# గిడుగు సీతాపతి

## జీవితం - రచనలు

రచన :

శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు, ఎం.ఏ.




ప్రచురణ :

తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు

GIDUGU SITAPATHI Jivitham - Rachanalu in Telugu by Sri Bommakanti Srinivasacharyulu, M A.

తెలుగు విశ్వవిద్యాలయం,
హైదరాబాదు - 500 004.

ప్రథమ ముద్రణ : 1988

ప్రతులు : 2,000

వెల : రూ. 7/-

ముఖచిత్ర రచన : శ్రీ శీలా వీర్రాజు

ప్రతులకు :
తెలుగు విశ్వవిద్యాలయం,
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాదు - 500 004.

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,
3-5-850, హైదర్‌గూడ,
హైదరాబాదు - 500 029.

# ప్రకాశక విజ్ఞప్తి

రమారమి క్రీస్తుశకం మొదటి శతాబ్దుల నాటికే తెలుగు భాష వ్యాప్తిలో ఉన్నట్లు చరిత్రకారుల అంచనా. ఆరో శతాబ్దినుంచీ రాజాజ్ఞప్తి రూపాలుగానో, ప్రభువుల విజయాంకాలుగానో, ధర్మపరుల దాన ప్రకటన లేఖనాలుగానో, తెలుగు నాట నెలకొన్న నూరారు తెలుగు శాసనాలలో పద్యరూపంగానో, గద్యరూపంగానో అచ్చమైన తెలుగు భాష కనిపిస్తుంది. దీని స్వరూప స్వభావాలను విశ్లేషించి చూస్తే పద్యరూపంలోని భాషా శైలి అనంతర యుగాలలోని కావ్య భాషా శైలికి వరవడిగా నిలిచిందనీ, వచన రూపంలోని భాష సమకాలిక సామాన్య జనుల వాడుక భాషకు చాల సమీపంగా ఉండేదనీ ధ్రువపడుతుంది. తెలుగునకు ప్రామాణిక సాహిత్య స్థాయి అబ్బిన నాటికి కూడ తెలుగు భాషా ప్రవాహంలో ఒక పాయగా కావ్య భాష, మరొక పాయగా వాడుక భాష ఒకదాని సరసన ఒకటి ప్రవహిల్లుతూ, పరస్పర ప్రభావితాలుగా ప్రవర్తిల్లుతూ వచ్చినట్లు నిర్ధారించ వచ్చు. వాడుక భాషను సంస్కరించగా రూపొందింది కావ్య భాష. వాడుక భాష సర్వ కాల సర్వావస్థలలో అశేష జనుల భావ వాహకం కాగా, కావ్య భాష అల్ప సంఖ్యాకులైన జనుల పరిమిత ప్రయోజనం కోసం ఉద్దిష్టమైన లిఖిత రూప వ్యవహారం.

జనరంజనం కోసమో, ఝటితి స్ఫూర్తి కోసమో ప్రయుక్తమైన మహాకవుల లక్షణ విరుద్ధ ప్రయోగాలు లాక్షణికులకు తరచుగా కొరకరాని కొయ్యలుగా తయారు కాగా కవులు నిరంకుశులన్న సాకు చూపి ఈ ప్రయోగాలకు వారి ఔద్ధత్యం కారణమని సర్ది చెపుతూ వాటికి అనింద్య గ్రామ్యాలని పేరు పెట్టి సరిపెట్టుకుంటూ వచ్చారు లాక్షణికులు. లక్షణ విరుద్ధమైన భాష గ్రామ్యమనీ తాము విధించిన నియమ నిబంధనలకు లొంగని ప్రయోగరీతి అగ్రాహ్యమనీ వీరు ఎప్పటికప్పుడు ఎచ్చరికలు చేస్తూ, వాడుక భాషా ప్రయోగాలను నిషేధిస్తూ, జనప్రియ ధోరణిని నిరోధిస్తూ, కట్టుదిట్టంగా బోలెడు గ్రంథం నడిపించారు.

ఈ శతాబ్దపు తొలి దశకంలో కళింగాంధ్రంలోని ఇసుకోలుబళ్ళ ఇన్స్పెక్టర్ యేట్స్ దొరగారి ప్రేరణతో గురజాడ అప్పారావు, బుర్రా శేషగిరిరావు, పి. టి. శ్రీనివాస అయ్యంగారు మున్నగు వ్యావహారిక భాషా ప్రియుల ప్రోత్సాహంతో గిడుగు రామమూర్తి పంతులుగారు వ్యావహారిక భాషోద్యమానికి సారథ్యం వహించారు. 'గిడుగు గ్రాంథికవాదం పాలిటి పిడుగు' అని వారి ఇష్టులు కొందరు కీర్తించినా గిడుగువారికి గ్రాంథిక భాషపై ద్వేషంగానీ, చిన్న చూపుగానీ ఎంత మాత్రమూ లేవు. ఐతే దాని పరిమితులూ, ప్రయోజనాలూ వేరని ఆయన

మతం. చదువు సంధ్యలూ, ఉక్కిన రాతకోతలూ వాడుక భాషా ముఖంగా సాగాలన్నది ఆయన వాదం. నన్నయగారి నుంచీ చిన్నయసూరి దాకా వెలసిన కవి పండితులు గ్రాంథిక భాషలో నిర్మించిన తెలుగు వాఙ్మయం నుంచి తప్పులను తవ్వి కుప్పలు కుప్పలుగా పోశా రాయన. సమకాలికులైన విద్వత్కవుల రచనల నుంచి తప్పుల తిప్పలను బండ్లకెత్తి తూర్పార బట్టారు. కొమ్ములు తిరిగిన ఉద్దండ పండితులే నిర్దుష్టంగా రాయలేని గ్రాంథికభాషా శైలిలో బడిపిల్లలూ, సామాన్యులూ రాయాలని ఉద్దేశించడం అశాస్త్రీయమనీ, ఆదేశించడం అన్యాయమనీ అది ఏటి కెదురీత వంటిదనీ గిడుగువారు పత్రికాముఖంగా ప్రబోధం కావించారు. తెలుగు మాగాణమంతా తిరిగి సభా ముఖంగానూ, విజ్ఞప్తుల పరంగానూ ప్రచారం చేశారు.

ఈ వాడుక భాషా ఉద్యమానికి ప్రతిస్పర్ధులుగా గ్రాంథిక భాషావాదులైన హేమాహేమీలు-జయంతి రామయ్య పంతులు, కొమర్రాజు వెంకట లక్ష్మణరావు, వేదం వేంకటరాయశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, వావిలికొలను సుబ్బారావు, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి ప్రభృతులైన గురు వృద్ధులైన ఎందరెందరో గిడుగు వర్గాన్ని ప్రతిభటించి, గిడుగు వాదాన్ని ప్రతిఘటించి సకల యుక్తులనూ, సర్వ శక్తులనూ మోహరించి ఓహరిసాహరిగా పోరాడారు. అచ్చంగా ఆ నాడు అదొక కురుక్షేత్రమే అయింది. పదస్థుల బలంతో, ప్రాచీన వాదుల బలగంతో కాంపొజిషన్ కమిటీ నిర్ణయాలను తిరగ తోడడంతో 'సరళ గ్రాంథికం' పేర గ్రాంథికవాదానిదే పైచేయి అయింది. ఆ దశలో 'గిడుగు రామమూర్తి నుడుగు నిల్వకపోయె, ఒగి జయంతి రామయోక్తి గెలిచె' అని వడ్డాది సుబ్బరాయ కవి వంటి వివాద వివశులు ఒడ్డారించినా కడకు గిడుగు వారి నుడుగే గెలిచింది; తెలుగుల వాడుక భాషకు అది గొడుగుగా నిలిచింది. మంచి మార్పుల కోసం ఉద్దేశించిన ఉద్యమాలకు మారొడ్డి నిలవడమూ, క్రమంగా వాటి ధాటికి తట్టుకోలేక అంతరించడమూ కొన్ని తిరోగమన శక్తుల సహజ లక్షణం. ఇది సృష్ట్యాదిగా సామాజిక వ్యవస్థలో సాగుతూ వస్తున్న సమర ప్రక్రియ.

రాష్ట్ర ప్రభుత్వమూ, రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాలూ అవలంబించిన వ్యావహారిక భాషా ప్రయోగానుకూల వైఖరి ఫలితంగా సుమారు ఐదారు పుష్కరాలుగా కొనసాగుతూ వచ్చిన గ్రాంథిక వ్యావహారిక భాషా వివాదానికి తెరపడింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నియమించిన లక్ష్మీకాంతం కమిటీ, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు నియమించిన అప్పారావు కమిటీ, వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారి విద్యా విషయక మండలీ, ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి ప్రాచ్య భాషా పండిత పరిషత్తూ చూపిన చొరవా, చేసిన సిఫార్సులూ వ్యావహారిక భాషోద్య

మానికి అధికారికమైన అదనపు బలాన్ని సమకూర్చాయి. మాండలిక స్పర్శకు అతీతమైన నేటి ఆధునిక ప్రామాణిక భాషావతరణకు నేటి వ్యావహారిక భాషోద్యమం ప్రధానభూమికగా ప్రవర్తిల్లింది. ఇందులో ప్రముఖ రచయితలు, ప్రసిద్ధ ప్రచురణ సంస్థలు, నవ్యసాహితీ సంస్థ, అభ్యుదయ రచయితల సంఘం, ఆకాశవాణి, తెలుగు పత్రికలు చేసిన విశిష్ట కృషి విస్మరించరానిది. ప్రస్తుతం అన్ని విశ్వవిద్యాలయాలలోనూ, అన్ని స్థాయీ భేదాలలోనూ చివరకు బడిపిల్లల వాచకాల రచనలలోనూ వ్యావహారిక భాషకు అధికారికమైన స్థానం లభించింది. తెలుగు నేర్చుకోదలచిన - వయోజనుల, ప్రవాసాంధ్రుల, ఆంధ్రేతరుల, ఉద్యోగుల, ఇతర జిజ్ఞాసువుల - అవసరాల దృష్టిలో కూడ ఈ మార్పు ఎంతో సముచితమని స్పష్టంగా రుజువైంది.

ఈ వ్యావహారిక భాషోద్యమానికి సారథ్యం వహించిన గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు ప్రాతః స్మరణీయులు. వారి అడుగు జాడలలో నడచి తండ్రికితగ్గ తనయుడుగా పేరుపెంపులు గడించిన సీతాపతిగారు చిరస్మరణీయులు. అటువంటి మహనీయుల సంస్మరణార్థం జస్టిస్‌కొత్తపల్లి పున్నయ్యగారి అధ్యక్షతన ఏర్పడిన సంఘం వారు శ్రీకాకుళంలో ఒక సభ నిర్వహించ నున్నట్లు తెలిపారు. ఈ సభలో గిడుగు రామమూర్తి, సీతాపతి గార్ల కాంస్య విగ్రహాలను ప్రతిష్ఠించడంతోపాటు వారి జీవితం, ఉద్యమాలకు సంబంధించిన విశేషాలపై లఘు గ్రంథాలను రచింపజేసి వెలువరించాలని ఆ సంఘం తలపెట్టింది. అయితే వాటిని రచింపజేసి, ముద్రించి, వెలుగులోకి కొని తెచ్చే బాధ్యతను తెలుగు విశ్వవిద్యాలయానికి అప్పగించడం జరిగింది.

తెలుగు భాషా, సాహిత్య, సంస్కృతుల పరిరక్షణార్థం ప్రాదుర్భవించిన తెలుగు విశ్వవిద్యాలయం ఈ బాధ్యతను నిర్వర్తించడం సముచితమైనదిగా భావిస్తూ అందుకు అవకాశం కల్పించిన గిడుగు రామమూర్తి, సీతాపతిగార్ల సంస్మరణోత్సవ సంఘం వారికి కృతజ్ఞతలు తెలియజేసుకుంటోంది.

ఈ లఘు గ్రంథాన్ని రచించిన శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు గారికి మా ధన్యవాదాలు.

పఠితలకు ఈ గ్రంథం బాగా నచ్చుతుందని మా నమ్మకం.

హైదరాబాదు,
తేదీ : 29-9-88.

ప్రకాశకులు :
తెలుగు విశ్వవిద్యాలయం

# నివేదనమ్

మనిషి జీవితం ఒక నవల లాంటిది. తొలి అధ్యాయాలు చదువుతున్నప్పుడు తుది అధ్యాయాలలో ఏ సన్నివేశాలు ఎలాంటి మలుపులు తిరిగేదీ చూచాయగా అయినా తెలియదు.

1951 నుంచి 1956 వరకూ 5 ఏళ్ళ పాటు మద్రాసులో తెలుగు భాషా సమితిలో సీతాపతి మేష్టారి దగ్గర సహాయ సంగ్రాహకుడుగా, అంతేవాసిగా, ఆయన ప్రక్క కుర్చీ మీద రోజూ కొన్ని గంటలు గడుపుతూ, ఆయన ఛలోక్తులూ, చమత్కార ప్రసంగాలూ అనుభవిస్తున్న ఆ రోజులలో - సుమారు 3 దశాబ్దాల తరువాత 1988 లో నేను ఆయన జీవిత చరిత్ర వ్రాయవలసి వస్తుందని చూచాయగానైనా నాకు తెలిసి ఉంటే ఎంత బాగుండేది ! ఆయన సరస ప్రసంగాలూ, ఆయన వ్యక్తిత్వంలోని మారుమూల కోణాల మీద వెలుగును ప్రసరించే సన్నివేశాలూ ఆ నాడు నేను నోట్ చేసుకుని ఉంటే ఎంత సజీవమైన, చక్కని పద చిత్రం తయారు చేయడానికి వీలయ్యేది !

పాశ్చాత్య దేశాలలో ఒక వ్యక్తి జీవిత చరిత్ర వ్రాయడం ఎంతో తేలిక! సాధారణంగా అక్కడ ప్రతి వ్యక్తీ 'దినచర్య' వ్రాసి పెట్టుకుంటూ ఉండడం, మిత్రులకు అతడు వ్రాసిన ఉత్తరాలను ఆ మిత్రులు భద్రపరుస్తూ ఉండడం జరుగుతుంది. అలాంటి కచ్చితమైన ఆధారాలతో జీవం ఉట్టిపడేట్టు వారి పద చిత్రాలు రూపొందించవచ్చును.

సీతాపతి మేష్టారి జీవిత విశేషాలను అంత కచ్చితంగా తెలిపే ఆధారాలు లభించకపోవడంతో, కేవలం ఆయన వ్రాసిన సంక్షిప్త 'స్వీయచరిత్ర', ఆయన కుమారుడు శ్రీ జి.వి. రామమూర్తి వ్రాసిన 'గిడుగు రామమూర్తి' (జీవిత చరిత్ర), ప్రొ॥ కాళ్ళకూరి సూర్యనారాయణ వ్రాసిన 'శ్రీ గిడుగు రామమూర్తి పంతులు జీవితము', డా॥ అక్కిరాజు రమాపతిరావు, డా॥ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి ప్రభృతులు చేసిన కొన్ని రచనలూ మాత్రమే ఆధారంగా రేఖా మాత్రమైన

ఈ పద చిత్ర రచన సాగించవలసి వచ్చింది. మరింత సమగ్రమైన 'సీతాపతి జీవిత చరిత్ర'కు ఇది దారితీయ గలిగితే ఈ రచన నిష్ఫలం కాదు.

మహామహులు ఎందరో ఉండగా అజ్ఞాతవాసం చేస్తున్న నన్ను ఈ జీవిత చరిత్ర రచనకు ఎంచుకొని నాకు ఈ అవకాశం కలిగించిన తెలుగు విశ్వ విద్యాలయం వారికీ, ముఖ్యంగా నా పట్ల ఆప్యాయత చూపే నా చిరకాల మిత్రుడు, సుప్రసిద్ధ పరిశోధకుడు, తెలుగు విశ్వవిద్యాలయం కులపతి ప్రొ॥ దొణప్ప గారికీ నా కృతజ్ఞత మాటలతో చెబితే తీరేది కాదు.

అడుగగానే ఈ రచనకు అవసరమైన గంథ్రా లన్నీ నాకు అందచేసిన సహృదయ మిత్రుడు శ్రీ జి. వి. రామమూర్తి గారి మేలు మరువ రానిది. ఆయన తోడ్పాటు లేకపోతే ఈ పుస్తకం వ్రాయడం సాధ్యం అయ్యేది కాదు.

వ్రాత ప్రతిలోనే ఈ రచనను చదివి, నన్ను వెన్ను తట్టిన సరస హృదయుడు శ్రీ డి. రామలింగం గారికి నేనెంతో కృతజ్ఞుణ్ణి!

1-9-34/5/1, రామ్‌నగర్,
హైదరాబాదు - 48
1-10-1988.

బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

# అధ్యాయ క్రమం


| | | | పుట. |
|---|---|---|---|
| | ప్రకాశకుల విజ్ఞప్తి | .... | iii |
| | నివేదనమ్ | .... | vi |
| 1. | తండ్రికి తగ్గ కొడుకు | .... | 1 |
| 2. | జననం - బాల్యం | .... | 8 |
| 3. | విద్యాభ్యాసం | .... | 17 |
| 4. | ఉద్యోగపర్వం | .... | 33 |
| 5. | వ్యావహారిక భాషోద్యమం | .... | 47 |
| 6. | నవర భాషాసేవ | .... | 62 |
| 7. | రాజకీయాలు - సినీమాలు | .... | 79 |
| 8. | భారతీ శతకం | .... | 94 |
| 9. | పరిశోధన | .... | 112 |
| 10. | ఉపసంహారం | .... | 127 |
| 11. | అనుబంధములు | | |
| | i గిడుగు వారి వంశవృక్షము | .... | 136 |
| | ii సీతాపతి జీవితంలో ప్రధానమైన తేదీలు | .... | 137 |
| | iii సీతాపతి రచనలు | .... | 139 |

# 1

# తండ్రికి తగ్గ కొడుకు

గిడుగు వేంకట రామమూర్తి పంతులు, గిడుగు వేంకట సీతాపతి, ఈ తండ్రీ కొడుకు లిద్దరూ ఆధునిక ఆంధ్ర భాషా చరిత్రలో సుగృహీత నామధేయుడ లైనవారు.

'మోతీలాల్ నెహ్రూ - జవాహర్‌లాల్ నెహ్రూ', 'వరాహగిరి జోగయ్య పంతులు - వరాహగిరి వేంకటగిరి లాగ తండ్రీ కొడుకు లిద్దరూ సమానంగా సుప్రసిద్ధులైన అపురూపమైన జంటలకు ఉదాహరణగా పేర్కొన దగ్గవారు.

## మహనీయులు :

మహాపురుషుల మహనీయతా స్వభావాన్ని వివరించే ఒక చక్కని వాక్యం వ్రాశాడు షేక్స్పియర్. ఒక నాటకంలోని ఒక పాత్ర సర్ టోబీ బెలెచ్ చేత షేక్స్పియర్ ఇలా అనిపిస్తాడు:

> "Some are born great
> Some achieve greatness, and
> Some have greatness thrust on them."

(కొందరు పుడుతూనే గొప్పవారుగా పుడతారు; కొందరు స్వయం శక్తి చేత, స్వయం కృషిచేత జీవితంలో గొప్పతనం సాధిస్తారు; మరి కొందరికి పరిస్థితుల ప్రాబల్యం గొప్పతనాన్ని ఆపాదిస్తుంది.)

పూర్వ కాలంలో ప్రహ్లాదుడు, ఆధునిక కాలంలో అంతర్జాతీయ ప్రసిద్ధి పొందిన గణితశాస్త్రవేత్త రామానుజం మొదలైన వారు పుడుతూనే మహా పురుషులుగా పుట్టినవారు.

గాంధీ మహాత్ముడు, జార్జి వాషింగ్టన్, లెనిన్, చర్చిల్ వంటి వారు స్వయం శక్తిచేత, స్వయం కృషిచేత మహాపురుషులైనవారు. పరిస్థితుల ప్రాబల్యం వల్ల మహనీయత ఆపాదింపబడ్డ వారికి స్టాలిన్, క్రుష్చేవ్, రీగన్, థాచర్ వంటి వారిని ఉదాహరణలుగా పేర్కొనవచ్చును.

నిజానికి ప్రతి మహాపురుషునిలోనూ - పుడుతూనే గొప్ప లక్షణాలతో పుట్టడం, అచంచలమైన దీక్షతో కృషి సాగించడం, జీవితంలో పరిస్థితులు అనుకూలించడం - అనే ఈ మూడు అంశాలూ ఏదో ఒక పాలులో కలిసే ఉంటాయి. ఏ పాలు ఎక్కువైతే వారు ఆ వర్గానికి చెందిన మహాపుషులు అని అంటూ ఉంటాము.

షేక్స్పియర్ నాటకంలో ఈ మాటలు పలికిన పాత్ర తాను మూడవ వర్గానికి చెందిన మహాపురుషుణ్ణని అంటాడు. తనకు గల అర్హత వల్లనే పరిస్థితులు తనకు మహనీయతను కట్టబెట్టాయని ఆయన అంటాడు.

'శ్రీ గిడుగు రామమూర్తి పంతులు జీవితం'* వ్రాసిన ప్రొ॥ కాళ్లకూరి సూర్యనారాయణ ఒక వ్యక్తిని మహాపురుషునిగా చేసే ఈ మూడు లక్షణాలూ గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారిలో ప్రస్ఫుటంగా గోచరిస్తున్నా యని అన్నారు. కాని, ప్రధానంగా స్వయం కృషి చేతనే ఆయన ఆధునికాంధ్ర భాషా పితామహు లయాడని చెప్పవచ్చును. సీతాపతిగారిలో కూడా సద్వంశంలో పుట్టడం, స్వయంకృషి ఉన్నా ప్రధానంగా ఆయన పరిస్థితుల ప్రాబల్యంవల్ల మహా కార్యాలు సాధించి సుప్రసిద్ధులైనవారు!

మహాపురుషుల లక్షణాలను వివరించడానికి పై షేక్స్పియర్ వాక్యాలతో పాటు 'లాంగ్ ఫెలో' వ్రాసిన ఒక పద్యాన్ని కూడా ప్రొ॥ సూర్యనారాయణ ఉదాహరించారు.

"Lives of great men all remind us
We can make our lives sublime

---

* చూ. వావిళ్ళ ప్రచురణ, 1955.

And departing leave behind us
Foot-prints on the sands of time."

(గొప్పవారి జీవితములు గుర్తుచేయు
ఎల్లరును గొప్పదనము సాధింపవచ్చు
ననుచు, కాల సైకతమందు తనదు అడుగు
గుర్తుల మిగుల్ప వచ్చు లోకులకు ననుచు!)

మహాపురుషులు తమ సమకాలీనుల మీద తమ ప్రభావం చూపుతారు. అంతే కాదు; తరువాతి తరాల వారిమీద కూడా వారి ప్రభావం కనిపిస్తుంది. గిడుగు రామమూర్తి పంతులుగారి ప్రభావం ఆయన సమకాలికులలో కందుకూరి వీరేశలింగం వంటి ప్రముఖులమీద కూడా కొంతవరకు కనిపించింది. గురజాడ అప్పారావు, పి.టి. శ్రీనివాస అయ్యంగార్, సీమనపల్లి రామయ్యా పంతులు, పైడిఘంటం చిన్నపంతులు, బుఱ్ఱా పార్వతీశం పంతులు, వింజ్లచెరువు గోపాలయ్యా వంటి ఎందరో మిత్రులూ, పర్లాకిమిడి యువరాజా శ్రీ చంద్రమహారాజు, కన్నేపల్లి లక్ష్మీనరసింహం, చాగంటి సాంబశివరావు, బుఱ్ఱా శేషగిరిరావు, పారనంది జగన్నాథ స్వామి, చిలుకూరు నారాయణరావు వంటి ఎందరో శిష్యులూ కూడా రామమూర్తి పంతులుగారి జీవితం చేత గాఢంగా ప్రభావితు లయారు.

సమకాలీనులలో తక్కిన వారందరికంటె ఆయన కుమారుడు సీతాపతిగారు తండ్రివల్ల మరింత ఎక్కువగా ప్రభావితు లైనవారు. సీతాపతిగారి జీవితంలో ఇంచుమించు పూర్వార్థం అంతా తన తండ్రి జీవితంతో పెనవేసుకుని, దానితో సమాంతరంగానే నడిచింది. తండ్రి ప్రారంభించిన వ్యావహారిక భాషోద్యమంలో తండ్రికి ఆయన కుడిభుజమై నిలిచారు.

తరువాతి తరం వారిమీద రామమూర్తి పంతులుగారి ప్రభావానికి- ఆయన ప్రారంభించిన వ్యావహారిక భాషోద్యమం సంపూర్ణంగా విజయవంతం కావడమే ప్రబల నిదర్శనం! ఈ నాడు పత్రికలలో, రేడియోలో, సినిమా సంభాషణలలో, ప్రభుత్వ కార్యాలయాల వ్యవహారాలలో చివరకు విశ్వవిద్యాలయ పాఠ్య గ్రంథాలలో కూడా వ్యావహారిక భాషే విరివిగా ఉపయోగపడుతూందంటే అది నిస్సందేహంగా తెలుగు జాతికి రామమూర్తి పంతులుగారు చేసిన నిర్వాహమే!

## కారణ జన్ముడు :

ఒక విధంగా గిడుగు రామమూర్తి పంతులు కారణ జన్ముడు. ప్రతి దేశంలోనూ, ప్రతి కాలంలోనూ కొన్ని అదృశ్య కాల శక్తులు పనిచేస్తూ ఉంటాయి. మానవ చరిత్రను ఒక నిర్దిష్ట మార్గంలో మలచడానికి ఆ శక్తులు యత్నిస్తూ ఉంటాయి. తమ యత్నంలో కృతకృత్యం కావడానికి కొందరు విశిష్ట వ్యక్తులను అవి సాధనాలుగా గ్రహిస్తాయి. అలా కాలపురుషుని చేతి సాధనంగా గ్రహింపబడిన వ్యక్తినే కారణ జన్ము డంటాము.

ఇరవయ్యవ శతాబ్దపు మధ్య భాగంలో భారతదేశం దాస్యవిముక్తి పొంది స్వతంత్ర దేశం కావడం కాలపురుషుని సంకల్పం. ఆ సంకల్ప సాధనకు కాల పురుషుడు గ్రహించిన ప్రధాన సాధనం మహాత్మా గాంధీ. అందుకే గాంధీజీ కారణ జన్ముడు!

ఆధునిక కాలంలో తెలుగు సాహిత్యభాషలో తీసుకొని రాదలచిన ఒక గొప్ప మార్పుకు కాలపురుషునిచేత ప్రధాన సాధనంగా గ్రహించబడ్డ మనిషి గిడుగు వేంకట రామమూర్తి పంతులు.

## తెలుగు సాహిత్య భాష :

నన్నయ మొదలుకొని తిరుపతి వేంకటకవులదాకా వచ్చిన తెలుగుసాహిత్య భాషలో కనిపించే క్రమపరిణామాన్ని నిశితంగా పరిశీలిస్తే ఒక విషయం మనకు బోధపడుతుంది. ప్రజలు నిత్యం మాట్లాడుకునే భాషకు భిన్నంగా సంస్కృత పద భూయిష్ఠంగా ఆరంభమైన తెలుగు సాహిత్యభాష క్రమంగా తన జటిలత్వాన్ని సడలించుకుంటూ ప్రజలు మాట్లాడుకునే భాషకూ, వారి జాతీయాలకూ, నుడి కారాలకూ దగ్గర కావాలని ప్రయత్నిస్తూ వచ్చింది. ఈ ప్రయత్నం దక్షిణాంధ్ర సాహిత్యంలో - ముఖ్యంగా యక్షగానాలు మొదలైన ప్రక్రియలలో - మరింత విస్పష్టంగా గోచరించింది.

కాలపురుషుడు సంకల్పించిన ఆ పరిణామం అలా కొనసాగుతూ వచ్చి చివరకు తిరుపతి వేంకట కవులలో కూడా అది ప్రముఖంగా కనిపించింది. కోమటి పద్దులా, ఉత్తరాలా వ్రాసుకోడానికి కూడా అనుకూలంగా సాహిత్యభాషను వారు మలిచారు.

అయితే - కాలపురుషుని ఈ సంకల్పానికి విరుద్ధంగా 19 వ శతాబ్దంలో తెలుగు భాషాచరిత్రలో ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. తెలుగు సాహిత్య భాషకు అంతవరకూ కట్టుదిట్టమైన ఒక వ్యాకరణం గాని, ఆ వ్యాకరణాన్ని అనుసరించి వ్రాస్తేనే సలక్షణమైన భాష, లేకపోతే అది దుష్టమైనభాష అనే భావన గాని ఏనాడూ లేవు. 'ఆంధ్ర శబ్దచింతామణి' వంటి కొన్ని వ్యాకరణాలు వెలపినా కవులూ, రచయితలూ ఎన్నడూ వానిని ప్రామాణికంగా గ్రహించలేదు.

అలాంటి పరిస్థితులలో 19 వ శతాబ్దంలో పరవస్తు చిన్నయసూరి తెలుగు సాహిత్యభాషను శాసించడానికి పూనుకొని 'త్రిలింగ లక్షణం' (బాల వ్యాకరణం) అనే గ్రంథం వ్రాశారు. ప్రధానంగా కవిత్రయంవారి ప్రయోగాలనే ప్రామాణికాలుగా ఆయన అంగీకరించారు. అందుకు భిన్నంగా ఆ తరువాతి కవులు చేసిన ప్రయోగాలను లక్షణ విరుద్ధాలనీ, దుష్టములనీ ఆయన నిరసించారు.

ప్రాచీన కవులలో ప్రథమ, ద్వితీయ, తృతీయాది శ్రేణులను వారి వారి కవితాశక్తులను బట్టి కాక వారు వాడిన భాషా లక్షణాలను బట్టి నిర్ణయించే పరిస్థితి ఏర్పడింది. చిన్నయసూరి శిష్యుడైన బహుజనపల్లి సీతారామాచార్యులు 'శబ్దరత్నాకరం' అనే తమ నిఘంటువు పీఠికలో తెలుగు పూర్వ కవులను వర్గీకరిస్తూ కవిత్రయాన్ని మాత్రమే ప్రథమశ్రేణి కవులుగా అంగీకరించి, వారి ప్రయోగాలకు విరుద్ధమైన ప్రయోగాలు చేశారనే కారణంచేత పోతన, చేమకూర వేంకటకవి వంటి మహాకవులను కూడా దిగువ శ్రేణి కవులుగా గుర్తించడం జరిగింది.

బాల వ్యాకరణాన్ని ఆ నాటి పండితులూ, కవులూ, రచయితలూ పరమ ప్రమాణంగా, శిరోధార్యంగా గ్రహించారు. క్రొత్తగా ముద్రణ యంత్రం వచ్చి పూర్వప్రబంధాలు మొదటిసారిగా అచ్చువేస్తున్న ఆ రోజులలో ఆ ప్రబంధాలలో బాలవ్యాకరణానికి విరుద్ధంగా ఉన్న ప్రయోగా లన్నిటినీ దిద్దివేయడానికి కూడా ఆ పండితులు వెనుకాడలేదు.

బాల వ్యాకరణంలో చిన్నయసూరి నిర్దేశించిన సాహిత్య భాషను గ్రంథ రచనలో మాత్రమే కాక ఉపన్యాసాలలోనూ, దైనిక వ్యవహారంలోనూ కూడా ఆ భాషనే వాడా లనేటంత తీవ్రరూపం దాల్చింది చిన్నయసూరి అనుయాయుల వాదం. అదే గ్రాంథికభాషా వాదం అయింది.

జయంతి రామయ్య పంతులు, కొక్కొండ వేంకటరత్నం పంతులు వంటి పండితులు తమ ఉపన్యాసాలలోనే గాక కోర్టులలో వాదించేటప్పుడూ, ఇంట్లో కుటుంబ సభ్యులతో ప్రసంగించేటప్పుడూ కూడా బాల వ్యాకరణ భాషనే ఉపయోగించడం మొదలుపెట్టారు.

ఈ విధంగా కవుల నిరంకుశత్వం అంతరించి, వ్యాకర్తల నిరంకుశత్వం పెచ్చుమీరింది. ఫలితంగా-సజీవంగానూ, ఆకర్షకంగానూ ఉండవలసిన తెలుగు సాహిత్య భాష కృతకంగానూ, నిర్జీవంగానూ తయారైంది.

## గ్రాంథిక భాషావాద ఖండన :

సంస్కృత, ఆంగ్ల, ఆంధ్ర భాషలలో కూలంకషమైన పాండిత్యం సంపాదించి చరిత్రలోనూ, భాషా శాస్త్రంలోనూ విశేషమైన కృషి చేసి, యేట్స్ దొర, గురజాడ అప్పారావు, పి.టి. శ్రీనివాస అయ్యంగార్ వంటి మిత్రుల సాంగత్యంలో సువిశాలమైన దృక్పథం అలవరచుకొన్న గిడుగు రామమూర్తి పంతులకు తెలుగు సాహిత్య భాషకు పట్టిన ఈ దురవస్థ దుస్సహం అయింది.

దూరదర్శీ, పారదర్శీ అయిన రామమూర్తిగారు కాలపురుషుని అభీష్టం గుర్తించారు. అంతవరకు లేఖన, ముద్రణ సౌకర్యాలు లేక కేవలం సంఘంలో ఒక చిన్నవర్గానికి మాత్రమే పరిమితమై ఉన్న తెలుగు సాహిత్యం ఆధునిక ప్రజాస్వామ్య యుగంలో అక్షరాస్యత విస్తరించడంతో బహుజన పరివ్యాప్తం కాబోతూందని ముందుగానే ఆయన గమనించారు. అందుకు అనుకూలంగా సాహిత్య భాషలో నియమ నిబంధనలను సడలించి, నిజానికి దానిని సర్వజన ఉపాదేయంగా చేయవలసిన అవసరం ఉంది అలాటి పరిస్థితులలో సంకుచిత దృష్టితో సాహిత్య భాషను శాసించడానికీ, ఆ భాషలో క్రమవికాసాన్ని నిరోధించడానికీ పూనుకున్న ప్రాచీన పండితుల ప్రయత్నం ఆయనకు ఆగ్రహం కలిగించింది. వ్యావహారిక భాషోద్యమ శంఖం ఆయన పూరించారు. దిగ్దంతులవంటి హేమాహేమీలైన పండితులతో వాగ్వాదాలకు తలపడ్డారు. సలక్షణమైన భాషలో వ్రాసినట్లు చెప్పుకునే వారి రచనలలోనుంచే బాలవ్యాకరణ విరుద్ధాలైన ప్రయోగాలను ఎత్తి చూపించారు. ప్రాచీనాంధ్ర కవుల ప్రబంధాలలోనుంచి కూడా బాలవ్యాకరణ విరుద్ధాలైన ప్రయోగాలను ఎన్నింటినో ఉదాహరించారు. కృత్రిమ, గ్రాంథిక భాషావాదుల కబంధ హస్తాలనుంచి రక్షణ కల్పించి ఆ నాటి బాలకవులకు ఆయన శరణ్యం అయారు.

తన వాదనా పటిమతో అంతవరకు గ్రాంథిక భాషా వాదులుగా ఉంటూ వచ్చిన కందుకూరి వీరేశలింగం, తిరుపతి వేంకటకవులు వంటి ప్రముఖులను కూడా వారి చివరి రోజులలో కొంతవరకు తమ వాదం వైపు ఆయన త్రిప్పుకోగలిగారు.

## వ్యావహారిక భాషోద్యమం !

గిడుగు రామమూర్తిగారు సాగించిన చరిత్రాత్మకమైన వ్యావహారిక భాషోద్యమంలో ఆయన కుమారుడు సీతాపతిగారు నిర్వహించిన పాత్ర అనల్ప మైంది. కొన్ని విషయాలలో ఆ తండ్రిని మించిన ప్రతిభావంతుడు అయినా పితృ భక్తితో, నిస్స్వార్థంగా తన జీవితంలోని పూర్వార్థమంతా తండ్రి చేపట్టిన ఆ ఉద్యమ సాఫల్యం కోసమే తన సర్వ శక్తులూ అంకితం చేసి ఆయన కృషి చేశారు. ఆ ఉద్యమంలో తనకు ప్రత్యేకంగా ఎలాంటి గుర్తింపునూ ఆయన కోరలేదు.

రామమూర్తిగారు తీవ్రమైన పట్టుదల, తన ధ్యేయం కోసం సర్వ శక్తులనూ కేంద్రీకృతం చేసి కృషిచేసే దీక్ష కలవారైతే, సీతాపతిగారు సహజంగా కళాసక్తుడు; జీవితాన్ని తేలికగా తీసుకునే స్వభావం కలవారు !

భాషాశాస్త్రం, చరిత్ర - ఈ రెండే రామమూర్తిగారికి అభిమాన విషయాలు కాగా, సీతాపతిగారు బహుముఖ ప్రజ్ఞాశాలి. కవిగా, నటుడుగా, రాజకీయవేత్తగా, ప్రాసంగికుడుగా, విజ్ఞాన సర్వస్వ నిర్మాతగా ఇలా ఎన్నో విధాలుగా తన జీవితం ఉత్తరార్ధంలో సీతాపతిగారు విశేష ప్రజాదరణను చూరగొన్నారు.

పర్లాకిమిడిని ఒరిస్సా రాష్ట్రంలో కలపడానికి నిశ్చయించిన మరుక్షణం పర్లాకిమిడి నుంచి రాజమండ్రికి మకాం మార్చి తిరిగి పర్లాకిమిడిలో అడుగుపెట్టనని భీషణ ప్రతిజ్ఞ చేసి జీవితాంతం ఆ ప్రతిజ్ఞను నిలబెట్టుకున్న రాజీ ఎరుగని ఆదర్శవాది రామమూర్తి పంతులుగారు !

ఒకప్పుడు తీవ్ర గ్రాంథిక భాషావాదిగా ఉండి తమకు బద్ధవిరోధి అయినా, చివరి రోజులలో పిఠాపురం రాజాగారు తనతో మైత్రిని ఆశించగా, పట్టు విడుపులు ప్రదర్శించి ఆయన సాచిన స్నేహ హస్తం అందుకున్న ప్రాప్త కాలజ్ఞుడు, లోకజ్ఞుడు సీతాపతి గారు !

రామమూర్తిగారు చండప్రచండమైన ప్రకాశంతో దుర్నిరీక్ష్యంగా వెలిగిన భానుమండలం వంటి వారైతే, అన్ని వర్గాల ప్రజలనూ అలరించిన రంగు రంగుల ఇంద్రధనుస్సు వంటి వారు సీతాపతి గారు !

# 2

# జననం-బాల్యం

'పిడుగు'తో అనుప్రాస చెక్కే 'గిడుగు' వారి వంశంలో గిడుగు రామ మూర్తి పంతులుగారి ప్రథమ సంతానంగా 1885 జనవరి 28 వ తేదీన (తారణ నామ సంవత్సర మాఘ శుద్ధ త్రయోదశీ బుధవారం నాడు) ఉదయం గం. 11 లకు విశాఖపట్టణం జిల్లాలోని భీముని పట్టణంలో సీతాపతి గారు జన్మించారు.

గిడుగువారు ఆరువేల నియోగులు. ఆరంభంలో వీరి నివాస స్థలం తూర్పు గోదావరి జిల్లాలోని అమలాపురానికి సుమారు ఒక మైలు దూరంలో ఉన్న ఇందుపల్లి గ్రామం.

1880 ప్రాంతంలో కోనసీమలో అనావృష్టివల్ల గొప్ప కరువు సంభవించింది. ఆ ప్రాంతం నుంచి ఎన్నో కుటుంబాలు ఇతర ప్రాంతాలకు వలస వెళ్ళవలసి వచ్చింది. అలా వలస వెళ్ళిన వారిలో సీతాపతిగారి తాత గారు వీర్రాజు గారు ఒకరు. కరణీకం లెక్కలలో అఖండుడు కావడమే కాక వీర్రాజుగారు తెలుగు, సంస్కృతం కూడా కొంతవరకు చదువుకున్నవారు. దానితో పాటు అప్పుడప్పుడే మన దేశంలో వ్యాప్తిలోకి వస్తున్న ఇంగ్లీషు భాషను కూడా స్వల్పంగా నేర్చుకున్నారు.

ఆ రోజులలో రైళ్ళు లేకపోవడంవల్ల వీర్రాజుగారు కాలినడకన విశాఖ పట్టణం వెళ్ళి అక్కడ జిల్లా కలెక్టరు కార్యాలయంలో ఉద్యోగంకోసం ప్రయత్నించారు; కాని లాభం లేకపోయింది. తరువాత వెంటనే విజయనగర సంస్థానంలో రెవెన్యూ ఇన్‌స్పెక్టరు ఉద్యోగం ఆయనకు లభించింది ఆ విధంగా ఈ గిడుగు వంశంవారు విజయనగరం జిల్లా వాస్తవ్యు లయారు.

సీతాపతి గారి తల్లి అన్నపూర్ణమ్మ. ఈమె కందికొండ వారి ఆడపడుచు; కందికొండ రామదాసుపంతులు గారి కుమార్తె. గోదావరి జిల్లాలో కరువు వచ్చి

గిడుగు వీర్రాజు గారు విజయనగరం చేరుకున్న రోజులలోనే ఈ కందికొండ రామదాసుపంతులు గారు కొవ్వూరునుంచి భీముని పట్టణం చేరుకున్నారు. అక్కడ మొదట ఒక ఓడ వర్తకునివద్ద నెలకు నాలుగు రూపాయల జీతం మీద కుదిరి, క్రమంగా పైకి వచ్చారు ఆ ఓడ వర్తకునితో వాటాదారుగా కలిసి విశేష లాభాలు ఆర్జించి అక్కడ ఒక పెద్ద మేడ కూడా కట్టారు.

గిడుగు రామమూర్తిగారికి తన 16 వ యేటనే 1879 లో కందికొండ రామదాసు పంతులుగారి కుమార్తె అన్నపూర్ణమ్మతో భీముని పట్టణంలోనే వైభవంగా వివాహం జరిగింది. వివాహమైన ఆరేళ్ళకే 1885 లో సీతాపతిగారు పుట్టారు. అప్పటికే రామమూర్తి పంతులుగారు మెట్రిక్యులేషన్ ప్యాసయి పర్లాకిమిడి రాజా గారి మిడిల్ స్కూలులో మొదట ఫస్ట్ ఫారం టీచరుగా చేరి, తరువాత ప్రైవేటుగా ఎఫ్.ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడై హైస్కూలు టీచరుగా మారి, 4 వ ఫారానికి క్లాసు టీచరుగాను, 5 వ, 6 వ ఫారాలకు హిస్టరీ టీచరుగాను పని చేస్తున్నారు.

పుత్రుడు కలిగినట్లు భీముని పట్టణం నుంచి శుభలేఖ రాగానే రామమూర్తి పంతులుగారూ, ఆయన తల్లి వేంకమాంబగారూ ఎంతో సంతోషపడ్డారు. నెల తిరుగకుండానే వారు భీముని పట్టణం వెళ్ళి వైభవంగా నామకరణోత్సవం చేసుకున్నారు. రామమూర్తి పంతులుగారి మాతామహుని పేరు, అంటే వేంకమాంబగారి తండ్రిపేరు పోడూరి సీతాపతి. మనుమనికి తన తండ్రిపేరే పెట్టాలని వేంకమాంబ గారు పట్టుపట్టడంవల్ల రామమూర్తి పంతులుగారు తమ పుత్రునికి తమ ఇల వేల్పయిన వేంకటేశ్వరుని పేరు కూడా జోడించి 'వేంకట సీతాపతి' అని పేరు పెట్టారు. ఆయన జన్మ నక్షత్రం ఆర్ద్ర; అందుకే ఆ సందర్భంలో ఆయన మాతామహుడు కందికొండ రామదాసుపంతులు గారు "ఆర్ద్ర వలె పిడి జీవితం రంజిల్లు గాక!" అని ఆశీర్వదించారట!

సీతాపతి గారి బాల్యం చాలా వరకూ తన తండ్రి టీచరుగా ఉద్యోగం చేస్తున్న పర్లాకిమిడి గ్రామంలోనే గడిచింది. పర్లాకిమిడి విజయనగరానికి 80 మైళ్ల దూరంలో ఉన్న ఒక మన్యపు ప్రాంతం. ప్రయాణ సౌకర్యాలు లేని ఆ రోజులలో విజయనగరం నుంచి పర్లాకిమిడి చేరుకోవాలంటే మధ్య మధ్య మజిలీలు చేసుకుంటూ పెద్ద పులులు, చిరుత పులులు తిరిగే అడవులగుండా 4 రోజులు ప్రయాణం చేయవలసి వచ్చేది.

## తొక్కు పలుకులు :

సీతాపతి గారి బాల్యాన్ని గురించి వివరంగా వ్రాయడానికి అవసరమైన ఆధారాలు ఎక్కువగా లభించడం లేదు. ఆయనకు ముగ్గురు తమ్ములు: వీర్రాజు రామదాసు, సూర్యనారాయణ. తానే మొట్టమొదటి మనుమడు కావడంచేత నాయనమ్మ వేంకమాంబగారు ఆయనను ఎక్కువగా గారాబం చేసినట్లు కనిపిస్తుంది. "బాల్యమందు నా సంరక్షణ భార మెక్కువగా వేంకమాంబగారే వహించారు. ఆమె తనకు వచ్చిన చిన్న చిన్న గేయాలు, పద్యాలు పాడుచు నాచేతను కొన్ని పాడిస్తూ ఉండేవారు" అంటారు సీతాపతిగారు తన 'స్వీయ చరిత్ర'లో*.

ఒక రోజున వేంకమాంబ గారు మనుమడికి ఈ క్రింది పద్యం చెపుతున్నారట:

చింతామణి యను బ్రాహ్మడు
పంతానికి గోడమీద పటమున్ వ్రాసెన్
అంతట వర్షము కురిసెను
కాంతామణి కంటిమీద కాకర పూచెన్ !

ఆ సమయానికి అక్కడికి వచ్చిన రామమూర్తి పంతులుగారు తల్లితో "ఏమిటమ్మా ఈ పద్యం? ఒక దానికొకటి సంబంధంలేదు'' అన్నారుట, "ఏదో పోనిద్దూ నా పిచ్చి పద్యాలు!'' అన్నారు వేంకమాంబ గారు నవ్వుతూ. అప్పుడు పసివాడుగా ఉన్న సీతాపతిగారు వచ్చీ రాని మాటలతో నాయనమ్మ చెప్పిన పద్యాన్ని సమర్థిస్తూ తండ్రితో ఇలా అన్నారట: "అది కాదు నాన్నా! గోడమీద కాంతామణి పటం వ్రాస్తే వానపడి బొమ్మకన్ను తడిసింది. అందులో నీటి చుక్క ఒకటి నిలిచి కాకరపువ్వులాగా మెరిసింది.'' పసివాడుగా ఉండగానే అలా గడుసుగా మాట్లాడి, 'గట్టివాడవే!' అని తండ్రిచేత ఆయన ప్రశంసలు పొందారు.

అనంతర కాలంలో శాఖోపశాఖలుగా విస్తరిల్లే వృక్ష లక్షణాలు సూచనా ప్రాయంగా బీజంలోనే కనిపించినట్లు ఒకవ్యక్తి పెద్దవాడైన తరువాత ఏ విధంగా రూపొందబోతాడో ఆ లక్షణాలన్నీ బాల్యంలోనే సూచనా మాత్రంగా అతనిలో

---

* స్వీయ చరిత్ర ప్రచురణ : సన్మాన సంఘం, 17-2-1962

కనిపిస్తాయి. సీతాపతి గారి అనంతర వ్యక్తిత్వ వికాసాన్ని సూచించే బాల్యంలోని అలాంటి కొన్ని ప్రధాన సంఘటనలను గురించి మాత్రమే ఇక్కడ చెప్పుకుందాం.

తన బాల్యాన్ని గురించి వ్రాస్తూ సీతాపతిగారు ఇలా అంటారు. "తోడి పిల్లలతో కలిసి మెలిసి బడిలో చదువు కొనకపోవడము వలన నాకు స్వాభిమానం, స్వార్థపరత్వం కలిగినవి. ఇరుగు పొరుగు పిల్లలతో గిల్లికజ్జాలు పెట్టుకోవడం, అల్లరి పనులు చేయడం ఎక్కువైనవి. తల్లి చేతను, తండ్రిచేతను తరుచుగా దెబ్బలు, చీవాట్లు తింటూ ఉండేవాడను." ఈ మాటలవల్లను, ఇప్పుడు చెప్పబోయే ఒక సంఘటనవల్లను సీతాపతిగారి వ్యక్తిత్వంలో కనిపించే స్వతంత్ర ప్రవృత్తికి బీజాలు చిన్నతనంలోనే ఎలా అంకురించిందీ మనకు స్పష్టమవుతుంది.

## ఇంటినుంచి పలాయనం :

మంచి ఉపాధ్యాయునిలో ఉండకూడని రెండు లోపాలు రామమూర్తి పంతులుగారిలో ఉండేవి. అవి : ఆశా, కోపం. తనకు వచ్చిన చదువంతా ఒక్కసారే విద్యార్థికి చెప్పివేయాలని ఆయనకు ఆశ, తొందర! ఆ చెప్పిన విషయాలు వెంటనే వారు గ్రహించకపోతే విపరీతమైన కోపం వచ్చేది. వారిని చావ బాదే వారు. ఆయన విద్యాబోధన విధానాన్ని విమర్శిస్తూ "అన్నప్రాశన నాడే ఆవ కాయ పెడతాడీ రామమూర్తి!" అనేవారట ఆయన తోడి ఉపాధ్యాయులు!

ఒకరోజున బడిలో మధ్యాహ్నం విశ్రాంతి సమయంలో కుమారునికి పాఠం చెబుతూ తా నడిగిన ప్రశ్నలకు అతడు సరిగా సమాధానాలు చెప్పలేదనే వెర్రి కోపంతో ఒళ్ళుపై తెలియకుండా ఆయన కుమారుణ్ణి కొట్టాడు. అతని బుగ్గలు వాచాయి. వీపు తట్లు తేరింది. ఏడుస్తూ ఇంటికి వెళ్లాడు. ఆ రాత్రి జ్వరం వచ్చింది. ఆ పసిబుణ్ణిలో అనేక ఆలోచనలు వచ్చాయి. "ఏమైనా సరే తాను బడిలో ప్రవేశించి చదువుకోవాలి గాని, మరి తండ్రిగారి వద్ద చదువుకోకూడదు" అని దృఢ సంకల్పం చేసుకున్నాడు.

రెండు రోజులలో జ్వరం తగ్గింది. ఆరోగ్యస్నానం చేశాడు. పన్నెండు గంటలకు పుస్తకాలు చేతిలోపట్టుకుని బడికి పోతున్నానని చెప్పి బయలు దేరాడు. క్రమంగా ఊరుదాటి విజయనగరం రోడ్డు పట్టాడు. విజయనగరంలో ఆయన

మేనత్త చాగంటి అన్నపూర్ణమ్మగారుండేవారు. కాలినడకను పోయి వారి ఇల్లు చేరుకోవాలని ఆ పసివాని ఉద్దేశం.

దారిలో ఒక రెండెడ్ల బండి కనిపించగా ఆ బండి వెనుకనే నడుస్తున్నాడు. పర్లాకిమిడికి 3 మైళ్లదూరాన ఉన్న కొరసవాడ అనే గ్రామంలో ఆ బండి ఆగి పోయింది. అక్కడ 'బూరగాం' అనే పరిసర గ్రామానికి చెందిన ప్రగడ చిరంజీవి భుక్త అనే ఒక పెద్దింటి బ్రాహ్మణుడు ఎదురుపడి ఈ కుఱ్ఱవాణ్ణి గుచ్చి గుచ్చి ప్రశ్నలు అడిగాడు. అతడు ఉన్నది ఉన్నట్లు చెప్పాడు. ఆ భుక్తగారు తన బండిలో అతనిని విజయనగరం తీసుకువెళతానని మాయమాటలు చెప్పి నమ్మించి, తన ఇంటికి తీసుకుని వెళ్లాడు.

ఈలోగా పర్లాకిమిడిలో అతని తల్లితండ్రులు అతని జాడ తెలియక అందోళన పడ్డారు. అతనిని వెదుకుతూ నలుగురూ నాలుగు మూలలకూ బయలుదేరారు. చివరికి ఎలాగైతేనేం భుక్తగారి ఇంట్లో ఆ కుఱ్ఱవాణ్ణి పట్టుకుని పర్లాకిమిడి తిరిగి తీసుకుని వెళ్లారు

పైకి ఇది ఒక సామాన్యమైన సంఘటనగా కనిపించినా సీతాపతి గారి జీవితంలో ముందు ముందు ఆయన ఎదుర్కొన బోతున్న సంఘటనలకు ఇది ఒక పూర్వ సూచన. ఆయన జీవుని వేదనకూ, పరిస్థితుల ప్రభావానికీ మధ్య అడుగడుగునా ఆయన సంఘర్షణను ఎదుర్కొవలసి వచ్చినట్లు కనిపిస్తుంది. తన ఇష్టానికి అనుగుణంగా తనలోని నిగూఢ శక్తులను పెంపొందించుకొని ఒక బాలుడు స్వేచ్ఛగా తన వ్యక్తిత్వాన్ని వికసింపచేసుకునేందుకు ఈ నాడు ఉన్నన్ని అవకాశాలు కూడా ఆ రోజులలో ఉండేవి కావు. పెళ్లి అయి భార్య కాపురానికి వచ్చేవరకూ తల్లితండ్రులు తమ పిల్లలను పసివారుగానే పరిగణించేవారు. వారి ఇష్టానిష్టాలతో సంబంధం లేకుండా వారికి ఏది మంచిదో, ఏది చెడ్డదో నిరంకుశంగా తల్లి తండ్రులే నిర్ణయించడానికి పూనుకునేవారు. సీతాపతిగారి బాల్యం అలాంటి అననుకూల పరిస్థితులలో గడిచినట్లు కనిపిస్తుంది.

ఆయనకు సహజమైన అభిరుచి భాషా శాస్త్రంలో గాని, పరిశోధనలో గాని, ఉపాధ్యాయ వృత్తిలో గాని లేదు. అయినా తప్పనిసరిగా ఆయన ఆ రంగాలలో ఆయన ప్రవేశించవలసి వచ్చింది.

## తెలుగు కవిత్వం పట్ల ఆసక్తి :

చిన్నతనంలో సీతాపతి గారిని ఎక్కువగా ఆకర్షించిన రెండు అంశాలు తెలుగు కవిత్వం, ప్రదర్శన కళలు. ఆయన మూడవ ఫారం చదువుతూ ఉన్నప్పుడు 1897 లో- అంటే ఆయనకు 12 ఏళ్ల వయస్సప్పుడు, పులుగుర్తి లక్ష్మీనరసింహంగారు వారి ఇంటికి వచ్చారు. వృత్తి చేత ఆయన టెలిగ్రాఫ్ సిగ్నలర్ అయినా ప్రవృత్తి చేత కవి ఎక్కడనుంచో బదిలీ అయి పర్లాకిమిడి వచ్చి ఆయన గిడుగువారి ఇంట్లోనే మకాం పెట్టారు. ఆయన తెలుగులో పద్యాల వ్రాసేవారు. ఆయన వద్ద ఛందస్సు నేర్చుకొని సీతాపతిగారుకూడా తెలుగులో పద్యాలు వ్రాయడం మొదలు పెట్టారు. పులుగుర్తి లక్ష్మీనరసింహంగారు వా ఇంట ఉన్నది రెండు మాసాలే అయినా ఆ పసి మనస్సులో ఆయన వెలిగించి కవితా జ్యోతి సీతాపతిగారిలో జీవితాంతం ప్రకాశిస్తూనే ఉంది. చివరి రోజులల్ కూడా ఆయన సంస్కృతంలో కవిత్వం వ్రాసి 'కవితోదయ చంద్రికా' అ ఖండ కావ్య సంపుటి ప్రకటించారు.

ఛందస్సు నేర్చుకున్న క్రొత్తల్లో విక్టోరియారాణి డైమండ్ జూబ్లీ ఉత్సవ నాటికి ఆమెను కీర్తిస్తూ పద్యాలు వ్రాయాలని సీతాపతిగారు పూనుకున్నారు. ఎ రైనా చూస్తే నవ్వుతారని భయపడుతూ చాటుమాటుగా రచన సాగిస్తూ ఉండేవారి ఒక రోజున ఆయన బాల్యమిత్రుడూ, ఒక ఏడాది సీనియరూ అయిన బుర్రా శేషగి రావుగారు వచ్చి ఆయన వ్రాస్తున్న పద్యాలు చూశారు. తనకు కూడా ఛందస నేర్పమన్నారు. పద్య రచనలో ఆయనకు తాను సాయం చేస్తా నన్నాడు. ఆయ దగ్గర వాళ్ల తాతగారి 'అమరం, ఆంధ్రనామ సంగ్రహం' ఉన్నాయట. వాటి చివర ఏ మాటకు ఏవేవి పర్యాయ పదాలో తెలిపే సూచిక కూడా ఉంద అందుచేత పద్య రచనలో అవసరమైన గణాలకు సరిపోయే మాటలు ఎలాంట కావాలన్నా ఆ నిఘంటువులు చూసి తాను చెప్పగలనన్నాడు.

సీతాపతి గారు ఒక ఆట వెలది పద్యం ఎత్తుకుని ''ఎట్టి............ఏ రా మేలెనో'' అని మొదటి పాదం వ్రాశారు. కాని దానిలో మధ్యలో రెండు సూ గణాలు పూర్తి చేయాలి (ఒక గురువు, లఘువు - UI కాని, మూడు ల వులు-III గాని ఉన్న గణాన్ని సూర్యగణం అంటారు). ఆ రెండు సూర్యగ లకూ సరిపోయే స్త్రీ పర్యాయపదం కావాలి. శేషగిరి రావుగారు నిఘంటువులు వె

'కిరవాణి' అనే మాట సరఫరా చేశారు. దానితో "ఎట్టి కిరవాణి ఏ రాజ్య మేలెనో" అని పాదం పూర్తి అయింది. అలా ఇద్దరూ కూడబలుక్కుని పది పద్యాలు తయారు చేశారు. వాటిలో రెండు సీస పద్యాలు, నాలుగు తేటగీతులు, ఒక కందం, ఒక పంచ చామరం, రెండు ఆట వెలదులు. ఆ పద్యాలు సభలో చదివి వారు బహుమతులు పొందారు.

అయితే సీతాపతి గారిలో అలా ఆవిష్కృతం అయిన కవితాశక్తి తగిన పోషణ లభించక తగినంత వికాసం పొందలేదు. తన స్వీయచరిత్రలో సీతాపతి గారు ఇలా వ్రాసుకున్నారు; "మా తండ్రి గారికి పద్యరచన ఇష్టం కాలేదు. దాని వలన చదువు పాడౌతుందని వారి అభిప్రాయం. నేను మరి ఒకసారి ఏవో పద్యాలు వ్రాస్తూ ఉండగా చూచి నా మండలపై పెన్సిలుతో కొట్టి వ్రాయవద్దని శాసించారు. తగిన ప్రోత్సహం లేక నేను కొన్నాళ్ళు ఆకృషి విడిచిపెట్టుకున్నాను" *

సీతాపతి గారిలోని కవితాశక్తికి ఆ నాడు తగినంత ప్రోత్సాహం లభించి ఉంటే ఆ నాటి ప్రముఖ ఆంధ్ర కవులలో ఒకరు అయేవారని తరువాతి కాలంలో ఆయన చెదురు మదురుగా వ్రాసిన పద్యాలు నిరూపిస్తున్నాయి.

## ప్రదర్శన కళలు :

చిన్నతనంలో సీతాపతిగారు సహజంగా ఆకర్షింపబడిన మరొక రంగం ప్రదర్శన కళలు. 1987 లో పర్లాకిమిడికి బలవంతరావు సర్కస్, నాటకం కంపెనీ అనే ఒక కంపెనీ వచ్చి సర్కస్ ప్రదర్శనలు నాటకం ప్రదర్శనలు ఇచ్చింది. దానితో సహజంగా సీతాపతిగారిలో నిగూఢమై ఉన్న ప్రదర్శనకళల

* భాషాశాస్త్ర పరిశోధనకూ, కవిత్వానికీ ఏదో సహజవైరం ఉన్నట్టు కనిపిస్తుంది. 1959 ప్రాంతాలలో శ్రీ చేకూరి రామారావు చక్కని కవిత్వం వ్రాస్తూ ఉండేవాడు. తెలుగు విశ్వవిద్యాలయంలో ఆయన బి.ఏ. (ఆనర్స్) క్లాసులో చేరి భాషాశాస్త్రం అభిమాన విషయంగా తీసుకున్న రోజునే ఆ నాటి భాషా శాస్త్రాచార్యుడు శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తి 'నీ కవిత్వానికి గోరీకడతా' నని శపథం చేశాడు. అక్షరాలా ఆయన అన్నంత పనీ చేశాడు. మరి చేకూరి రామారావు కవిత్వం వ్రాయలేదు.

మీది ఆసక్తి బయటకి వచ్చింది. తానూ, బుర్జా శేషగిరిరావు తమ పొరుగింటిలో ఉన్న శంకర వారి పిల్లలు వేంకటరత్నం, శ్రీరాములు, వేంకటరావు మొదలైన వారు చేరి ఒక సర్కసు ట్రూపు ఏర్పాటు చేశారు. అప్పుడు ఆయన బక్కపల్చగా, సన్నగా ఉండడంవల్ల వాలుమొగ్గలు వేయడం, బాలెన్సుతో తాడుమీద నడవడం వంటి పనులు అవలీలగా చేసేవారట. బుర్జా శేషగిరిరావు గారు అర్భకుడు కావడంతో సర్కసులో ఎక్కువగా ఉపయోగ పడలేదు. శంకరవారి పిల్లలు వైరుమీద నడవడం, పెద్ద కర్ర బంతిమీద నిలబడి బంతిని దొర్లించుకుంటూ ముందుకు పోవడం మొదలైన ప్రదర్శనలలో ఎక్కువ చాకచక్యం చూపించే వారు.

సర్కస్ ప్రదర్శనలకే కాక నాటకాల ప్రదర్శనలకు కూడా ఈ ట్రూపు పూనుకుంది. అరికి రేవుల మల్లేశం అనేచిత్రకారుడు వారినాటకాలకు అవసరమైన తెరలను చిత్రించి ఇచ్చేవాడు. అప్పటి కింకా హార్మోనియం ప్రచారంలోకి రాక పోవడంవల్ల ఇత్తడి నీళ్ళబిందెల అంచులమీద లావుపాటి చీపురు పుల్లలు నిలబెట్టి వాటిని వేళ్ళతో రాస్తూ శ్రుతిలాంటి నాదం పుట్టించే వారట. రెండేళ్ళపాటు అలా ఆ పిల్లలు తమ తమ ఇళ్ళలోనే సర్కస్ ప్రదర్శనలూ, నాటక ప్రదర్శనలూ ఇస్తూ ఉండేవారు.

ఒకసారి వాళ్ళకాలేజి వార్షికోత్సవంలో వీరికంటె పెద్ద విద్యార్థులు కన్యా శుల్కం (మొదటి ముద్రణ) లోని కొన్ని దృశ్యాలను ప్రదర్శిస్తూ సీతాపతిగారిచేత వెంకటేశం పాత్రను, బుర్జా శేషగిరిరావుగారి చేత కరటక శాస్త్రి పాత్రను వేయిం చారట. ఆ ప్రదర్శనలో తాతా సీతారామశాస్త్రి* గిరీశం పాత్ర అద్భుతంగా అమరిందనీ, "జీవితంలోనే సువ్వొక గిరీశానివి. అందుకే నీకా పాత్ర బాగా నప్పింది" అని తాము ఆయనను పరిహసించేవారమనీ సీతాపతి గారు అంటూ ఉండేవారు.

సీతాపతిగారిని ఆ రోజులలో విశేషంగా ఆకర్షించిన మరొక ప్రదర్శన కళ ఉపన్యాస కళ. ఇప్పటిలాగ కాకుండా ఆ రోజులలో ఉపన్యాస కళకు గొప్ప గౌరవం, ప్రజాదరణ ఉండేవి. అందులోనూ ఇంగ్లీషు ఉపన్యాసాలంటే మరింత

---

* సుప్రసిద్ధ కథకుడు, పత్రికా రచయిత అయిన గోరాశాస్త్రిగారి మేనమామ.

పోజుండేది. 1930 వరకూకూడా తెలుగుదేశమంతటా ఇంగ్లీషులో ఉపన్యసించగల వారిపట్ల ఎంతో గౌరవం ప్రదర్శించేవారు. బుర్రా శేషగిరిరావు, సీతారామశాస్త్రి గార్లతో కలిసి సీతాపతిగారు ఎక్కడ ఏ ఉపన్యాసం జరుగుతున్నా వెళ్ళి ఆసక్తిగా వినేవారు. తాము కూడా తమ జీవితాలలో అంతటి గొప్ప వక్తలు కావాలని కలలు గనేవారు !

ప్రదర్శన కళలలో చిన్నతనంలో సీతాపతిగారిలో వ్యక్తమైన ఈ ఆసక్తే తరువాతి జీవితంలో ఆయన సినిమారంగంలోనూ, నాటకరంగంలోనూ గొప్ప నటుడుగా ప్రసిద్ధి పొందడానికి నాంది పలికింది.

భాషాశాస్త్ర పరిశోధనలో సీతాపతిగారు ప్రదర్శించిన ప్రతిభకు సూచనగా చిన్నతనంలో ఒక సంఘటన జరిగింది. బుర్రా శేషగిరిరావుగారూ, ఆయనా కలిసి 1897 లోనే - అంటే తనకు పన్నెండేళ్ళ వయస్సప్పుడే - ఒక సంకేత భాష రూపొందించుకొని ఆ భాషలో పరస్పరం ఉత్తరాలు వ్రాసుకుంటూ ఉండేవారు. చిన్ననాటి ఆ అనుభవమే తరువాతి జీవితంలో వారు శాసనాలు చదవడానికీ, వివిధ భాషల అధ్యయనానికీ, భాషా పరిశోధనకూ అవసరమైన మహా ప్రతిభగా వికాసం పొందింది.

బాల్యంలోనే సీతాపతిగారికి వివాహం జరిగింది.అప్పటికి ఆయన వయస్సు పదహారేళ్ళు. రసూల్ కొండలోని తహసీలుదారు నందివాడ వేంకటరావు గారి కుమార్తె నిచ్చి ఆయనకు వివాహం చేశారు. అయితే, వివాహం జరిగిన పదహారు రోజులకే టైఫాయిడ్ జ్వరానికి గురి అయి పెండ్లి కుమార్తె మరణించింది. బాల్యంలో జరిగిన ఈ సంఘటన ప్రభావం కూడా నిశితంగా పరిశీలించి చూస్తే సీతాపతి గారి అనంతర జీవితం మీద కొంతవరకు కనిపించకపోదు.

ఈ విధంగా బాల్యంలో బీజప్రాయంగా గోచరించిన వివిధ అంశాలు ఆయన ఉత్తర జీవితంలో వివిధ రంగాలలో ఆయన విశేష ఖ్యాతిని అర్జించడానికి ఎలా దారి తీసిందీ మీది అధ్యాయాలలో పరిశీలిద్దాం !

3

# విద్యాభ్యాసం

ప్రతి మనిషి జీవితంలోనూ అదృష్టం, దురదృష్టం పడుగు పేకల లా
కలిసిపోయి ఉంటాయి. సీతాపతి గారి వివాహం జరిగిన పదహారు రోజులు తిరు
కుండానే ఆయన ప్రథమభార్య గతించడానికి కారణం ఆయన జాతకమే అన్నార
రామమూర్తి పంతులుగారికి జాతకాలలో నమ్మకం లేకపోయినా ఆయన స్నేహి
లొకడు మామిడన్న కుమారస్వామి అనే ఆయన సీతాపతిగారి జాతకం చూ
ఆ జాతకంలో ద్వికళత్ర యోగం ఉంది అని చెప్పారు.

“రామమూర్తీ! నాకు ఆ పిల్ల జాతకం మొదటే చూపించి ఉంటే ఈ సంబంధ
చేయకు, పిల్లకు మారకయోగం ఉంది” అని చెప్పిఉందును. అన్నాడు ఆ కుమా
స్వామి. “ఈ సారి అయినా సంబంధాలు వచ్చినపుడు పిల్ల జాతకం నా
చూపించి గాని సంబంధం ఖాయం చేయకు !” అని మిత్రుణ్ణి హెచ్చరించాడ
తర్వాత మూడేళ్ళదాకా ఏ సంబంధం వచ్చినా ‘ఈ పిల్లజాతకంలో వైధవ్యయోగ
ఉంది, ఈ పిల్లను చేసుకుంటే మామగారికి గండం!’ అని ఇలా ఏవేవో సాకు
చెపుతూ ఆ సంబంధాలను తప్పించాడు ఆయన. చివరకు 1904 లో విశాఖపట్ట
వాస్తవ్యులు కవిపురపు జగన్నాథరావుగారి కుమార్తె విశాలాక్షితో సీతాపతిగా
ద్వితీయ వివాహం జరిగింది.

సీతాపతిగారు దురదృష్టవంతుడు అని నలుగురూ అనడానికి వీలైన కొన్ని
సంఘటనలు ఆయన చిన్నతనంలో జరిగాయి. ఆయన పుట్టిన కొన్ని నెలల
ఆయన మాతామహుడు కందికొండ రామదాసుపంతులు గారికి ఓడవర్తకం
విపరీతమైన నష్టం సంభవించింది. ఆ బెంగతో ఆయన మంచంపట్టి అటు తరువా
రెండేళ్ళలోనే కాలం చేశారు. అప్పులూ, సప్పులూ అన్నీ పరిష్కారం చేసుకో
చివరకు ఒక ఇల్లూ, నాలుగువేల రూపాయలూ మాత్రం వారికి మిగిలాయ

ఆ డబ్బుతో పెళ్ళికి ఎదిగిన ఇద్దరు కూతుళ్ళకూ పెళ్ళిళ్ళు చేసి రామమూర్తిగారి అత్తగారు తన ఇద్దరి కొడుకులతోనూ పర్లాకిమిడి చేరుకుంది. ఆ కుటుంబం బరువు బాధ్యతలు కూడా రామమూర్తిగారే వహించవలసి వచ్చింది.

సీతాపతిగారికి తన మూడవయేట మాతామహుడు పరమపదించిన నాలుగు మాసాలకే ఆయను ఎక్కువగా ముద్దుచేస్తూ వచ్చిన నాయనమ్మ వేంకమాంబగారు కూడా గతించింది.

సీతాపతిగారి దురదృష్టం వల్ల గాక కాకతాళీయంగానే నిజానికి ఆ సంఘటనలు జరిగి ఉండవచ్చును!

## ప్రాథమిక విద్య :

ఇతర విషయాలలో ఎలా ఉన్నా చదువు విషయంలో మాత్రం సీతాపతి గారు గొప్ప అదృష్టవంతుడు. ఒక విధంగా ఆయన జీవితం వర్ధించిన విస్తరి వంటిది. గొప్ప విద్వత్కుటుంబంలో ఆయన జన్మించారు. తండ్రి ఋషికల్పుడైన మహా విద్వాంసుడు. ఆధునికాంధ్ర కవితా పితామహుడు గురజాడ అప్పారావుగారు నాల్గవ తరగతి నుంచి ఆ తండ్రికి సహాధ్యాయి. అటువంటి మహా కవుల, మహా విద్వాంసుల విద్వత్ప్రసంగాలతో, గోష్ఠులతో నిండిన ఉత్తేజకరమైన వాతావరణంలో సీతాపతిగారు పెరిగిపెద్దవాడయాడు.

సంప్రదాయానుగుణంగా అయిదవ ఏట అయిదవ మాసంలో అయిదవ రోజున యథావిధిగా సీతాపతిగారికి అక్షరాభ్యాసం జరిగింది. గురువుగారికి క్రొత్త బట్టలూ, అయిదుగురు విద్యార్థులకు పలకలూ, బలపాలూ ఇచ్చారు. నామకః అక్షరాభ్యాసం జరిగినా సీతాపతిగారిని వెంటనే ఏ బడిలోనూ చేర్చలేదు. రెండేళ్లపాటు తల్లి అన్నపూర్ణమ్మగారే తెలుగు చదవడం, వ్రాయడం ఇంటిదగ్గరే ఆయనకు నేర్పారు.

అక్షరాభ్యాసం కాకముందే నాయనమ్మగారు చెప్పిన ఎన్నో పద్యాలూ, శ్లోకాలూ సీతాపతిగారికి కంఠస్థంగా వచ్చును. తల్లి మరికొన్ని పాటలూ, పద్యాలూ ఆయనచేత కంఠస్థం చేయించింది. తండ్రి మాత్రం తన చదువులోనూ, పరిశోధన

లోనూ మునిగి తేలుతూ ఆ రోజుల్లో కుమారుని చదువు విషయం అంతగా పట్టించుకోలేదు. తల్లి చెప్పిన చదువువల్లనే ఆరవఏడు నిండేసరికే సీతాపతిగారు ఎంత కఠినమైన వాక్యం చెప్పినా తప్పులు లేకుండా పలకమీద వ్రాయగలిగేవారు. అయితే బడిలో చదువుకోనందువల్ల ఎక్కాలూ, లెక్కలూ మాత్రం ఆయనకు అలవడలేదు.

1891 లో సీతాపతిగారిని ఆయన ఆరవ ఏట బడిలో చేర్పించారు. చదువులో ఎక్కువ చురుకుదనం ప్రదర్శించి ఆయన 1892 డిసెంబరు నెలలో జరిగిన ప్రైమరీ పరీక్ష (ఆరోజుల్లో అది గవర్నమెంటు పరీక్ష) లో ప్యాసు అయారు.

వెంటనే ఆయనను ఇంగ్లీషు బడిలో చేర్పించకుండా మూడేళ్ళపాటు ఇంటి వద్ద తానే చదువుచెప్పి ఏకంగా మూడవ ఫారంలో చేర్పించాలని రామమూర్తిగారు సంకల్పించారు. కాని ఆ ప్రయత్నం ఫలించలేదు. ఆ రోజులలోనే ఒళ్లు తెలియని కోపంలో ఆయన కుమారుణ్ణి దండించడం, అలిగి ఆ కుమారుడు ఇల్లువదలి వెళ్ళిపోవడం జరిగిన సంగతి క్రిందటి అధ్యాయంలో వివరంగా మనం చెప్పుకున్నాం.

సొంతంగా ఇంగ్లీషు చెప్పడం ప్రారంభించిన అయిదునెలలకే రామమూర్తి పంతులుగారు కుమారునికి భాషాభాగాలూ, పార్సింగూ చెప్పడం మొదలు పెట్టారు. ఒక్కసారి చెప్పగానే అవి అతడు బోధపరచుకోవాలి. అలా గ్రహించకపోతే ఆయన చేతిలో దండన తప్పదు.

కాని, చెప్పాపెట్టకుండా కొడుకు ఇంట్లోనుంచి వెళ్లిపోయేసరికి రామమూర్తి గారిలోని తండ్రిప్రాణం విలవిల లాడింది. నాలుగు గంటల పాటు కొడుకు కోసం గాలించిన తరువాత గాని అతని క్షేమసమాచారం వారికి తెలియలేదు. 'బూరగాం' భుక్తగారి ఇంట్లో అతడు క్షేమంగా ఉన్నట్లు తెలిసే వరకూ ఆయనకు మనస్సు మనస్సులో లేదు.

కుమారుని గూర్చిన ఆ చల్లని కబురు తెలియగానే హైస్కూలు ప్రధానోపాధ్యాయుడు మంగు శ్రీనివాసరావుగారు తమ గుఱ్ఱపు బగ్గీలో రామమూర్తిగారినీ, పైడిమంటం జగన్నాథరావు గారినీ ఎక్కించుకుని వెంటనే 'బూరగాం' బయలుదేరారు.

తండ్రిని చూడగానే మళ్ళీ ఆయన ఎక్కడ కొడతారో అని భయంతో గజ గజలాడుతూ ఆ పసివాడు దావురు మన్నాడు. అప్పుడు మంగు శ్రీనివాసరావుగారు ఆ పిల్లవాణ్ణి దగ్గరకు తీసుకుని సముదాయించి, ఒళ్లుతెలియని కోపంతో పిల్లలను అలా బెదరకొట్టకూడదని రామమూర్తిగారిని మందలించారు.

అప్పటికే తన తొందరపాటు తనానికి పశ్చాత్తాప పడుతున్న రామమూర్తి పంతులుగారు కుమారుడు కనిపించాడనే సంతోషంతో పర్లాకిమిడి చేరగానే తన మిత్రులందరినీ పిలిచి అల్పాహార విందు చేశారు.

## హైస్కూలు చదువు :

ఈ సంఘటన వలన సీతాపతిగారికి ఒక మేలూ, ఒక కీడూ కూడా జరిగాయి. "మరి నేను ఏడికి చదువు చెప్పను. బడిలో ప్రవేశపెడతాను'' అన్నారు రామమూర్తి పంతులుగారు. వెంటనే 1894 లో సీతాపతిగారిని స్కూలులో ఫస్ట్ ఫారములో చేర్పించారు. 1900 వ సంవత్సరం వరకూ అలా స్కూలులోనే చదివి సీతాపతిగారు మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసయ్యారు. అలా స్కూలులో చేరి నలుగురి పిల్లలతో కలసి చదువుకునే అవకాశం లభించడం సీతాపతిగారికి జరిగిన మేలు.

ఇక కీడు ఏమిటంటే - అది మొదలు తండ్రి ఇంటివద్ద ఆయనకు ఏమీ చెప్పేవారు కారు. అన్ని సబ్జక్టులూ సొంతంగానే చదువుకోవలసి వచ్చేది. అయితే స్కూలులోని ఇతర ఉపాధ్యాయులలో ఇద్దరు ముగ్గురు వారి ఇళ్లవద్ద తమ పిల్లలతో పాటు సీతాపతిగారికి కూడా చదువు చెబుతూ ఉండేవారు.

స్కూలులో సీతాపతిగారు చదువుకున్న తెలుగు అత్యల్పం. రెండవ ఫారం నుంచి బి. ఏ. ప్యాసయ్యేవరకూ రెండవ భాషగా ఆయన చదవింది సంస్కృతమే! ఒక్క మొదటి ఫారంలో మాత్రమే ఆయన తెలుగు చదివి ఆ తరగతికి పాఠ్యాంశమైన నలోపాఖ్యానంలోని 40 పద్యాలూ కంఠస్థం చేశారు. అదే స్కూలులో ఆయన చదువుకున్న తెలుగు.

అయితే-తాను చదువుకున్న సంస్కృత భాషా బలంవల్లనూ, తండ్రితో కలసి వ్యవహార భాషోద్యమంలో ఆయన కొనసాగించిన పరిశోధన వల్లనూ,

తెలుగు కవిత్వంమీద ఆసక్తి వల్లనూ ఆటు తరువాతి కాలంలో తెలుగులో ఆయన గట్టి పాండిత్యం సంపాదించారు.

హైస్కూలు చదువు రోజులలో సీతాపతిగారికి ఎక్కువ ఆసక్తిని కలిగించిన విషయం గణితశాస్త్రం. ఆ రోజులలో ఇప్పుడు 'క్షేత్రగణిత'మనబడే 'ప్రాక్టికల్ జామెట్రీ' బోధించేవారు కాదు. యూక్లిడ్ రేఖాగణితమే ప్రధానంగా చెప్పేవారు. రెండవ ఫారంలో 16 థీరమ్‌లూ (ప్రొపొజిషన్‌లూ), మూడవ ఫారంలో 31 థీరమ్‌లూ చెప్పేవారు. నాల్గవ ఫారంనుంచి యూక్లిడ్ రేఖాగణితం గ్రంథంలో ఉన్న ఇతర అంశాలు బోధించేవారు. థీరమ్‌లనూ, వాటి ప్రూఫ్‌లనూ విస్పష్టంగా అర్థం చేసుకోవడంలోనే కాకుండా, ప్రతి థీరమ్ క్రింద ఇచ్చే సమస్యలను (రైడర్‌లను) పరిష్కరించడంలో కూడా సీతాపతిగారు ఎక్కువ ఆసక్తినీ, ప్రతిభనూ కనబరచేవారు.

గణితశాస్త్రంలో యూక్లిడ్ రేఖా గణితంలోనే ఆయనకు అధికమైన ఆసక్తి. అంకగణితంలో మళ్ళీ ఆయన బుద్ధి అంత చురుకుగా ప్రసరించేది కాదు. దానికి కారణం బహుశః చిన్నప్పుడు ఆయన ఎక్కాలు శ్రద్ధగా వల్లెవేయక పోవడం కావచ్చును. రేఖాగణితంలో ఎప్పుడూ ఆయన మొదటివాడుగానే ఉన్నా, అంకగణితంలో మాత్రం కొంత మందకొడిగా ఉండేవాడు. బీజగణితం (ఆల్జీబ్రా) లో మొదటి వాడుగా కాకపోయినా, మార్కులు బాగానే వస్తూఉండేవి.

యూక్లిడ్ రేఖా గణితంలోనూ, దానిలో థీరమ్‌ల క్రింద ఇచ్చిన రైడర్‌లకు (ప్రశ్నలకు) జవాబులు సాధించడంలోనూ ప్రత్యేకమైన ప్రతిభను కనబరచినా ఇంగ్లీషు, సంస్కృతం, చరిత్ర మొదలైన ఇతర విషయాలలో కూడా సీతాపతి గారికి బాగానే మార్కులు వస్తూ ఉండేవి. తన తరగతిలోని మొదటి ఐదారుగురు తెలివైన విద్యార్థులలో ఒకరుగా ఆయన ఉండేవారు.

## అంతర్నిహితమైన సహజ శక్తులు :

బాలునిలో అయిదేండ్లలోపు వయస్సులోనే భావి జీవితంలో అభివ్యక్తం కాబోయే భయాలూ, ఆశలూ, ఉద్రేకాలూ, నమ్మకాలూ మొదలైనవన్నీ తొలిసారిగా రూపు దాలుస్తా యని మనశ్శాస్త్రవేత్తలు చెప్పేమాటలు నిజమే అయినా, బాలుని

జీవితంలో హైస్కూలులో చదివే దశ కూడా ముఖ్యమైనది. ఆ దశలోనే అతనిలో అంతర్నిహితమైన శక్తులు మొదటిసారిగా ప్రాదుర్భవించడం జరుగుతుంది.

సీతాపతిగారిలోని తెలుగు కవిత్వం మీది ఆసక్తి, ప్రదర్శన కళలపట్ల మోజు, స్నేహితులతో ఒక సంకేతలిపి ఏర్పరచుకొని ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపడంలో సరదా మొదలైన లక్షణా లన్నీ ఈ దశలోనే అభివ్యక్త మయాయి.

వాటిని గూర్చి క్రిందటి అధ్యాయంలో సూచాయగా చెప్పుకున్నాము. ఆయన థర్డ్ ఫారమ్ చదువుతున్నపుడు మిత్రుడు బుజ్జా శేషగిరిరావుగారితో కలిసి విక్టోరియా రాణి డైమండ్ జూబ్లీ ఉత్సవానికి పది పద్యాలు వ్రాసి చదవడంతో ఆయన కవితా వ్యాసంగం ఆగిపోయి ఉండదు. ఎన్నో పద్యాలు ఆయన వ్రాసి ఉండాలి. కాని ఆ విక్టోరియా రాణి మీద వ్రాసిన పద్యాలు గాని, హైస్కూలులో చదువుకునే ఆ రోజులలో ఆయన వ్రాసిన ఇతర పద్యాలు గాని ఏవీ ఇప్పుడు లభించడం లేదు. ఆయన రచనలను గురించి కూలంకషంగా పరిశోధనచేయాడానికి పూనుకునే ఏ పరిశోధక విద్యార్థి అయినా వారి ఇంటిలోని పాత కాగితాలలోగాని, ఆనాటి ఆయన సహాధ్యాయల స్మృతులలోగాని నిలిచి ఉండడానికి వీలున్న ఆ పద్యాలను సాధించగలిగితే సీతాపతిగారిలోని కవితాశక్తి ప్రాదుర్భావానికి సంబంధించిన కొన్ని విశిష్ట లక్షణాలను గుర్తించడానికి వీలు అవుతుంది.

రామమూర్తి పంతులుగారికి కుమారుడు తెలుగు కవిత్వం వ్యామోహంలో పడడం ఇష్టం లేకపోయినా సంస్కృత విద్యార్థి అయి ఉండి కూడా తన కుమారుడు తెలుగులో అంత చక్కని పద్యాలు వ్రాసి సభలో చదివి నలుగురి మెప్పునూ, బహుమతులనూ పొందడం కొంత సంతోషం కలిగించకపోలేదు. "అపుడు నేను సంస్కృత విద్యార్థినైయుండిన్ని తెలుగు పద్య రచన ఎట్లు అలవరచుకొన్నానో తెలిసికొని ఆయన ఆశ్చర్యపడ్డారు" అని సీతాపతిగారు తమ స్వీయచరిత్రలో అంటారు.

రామమూర్తి పంతులుగారు కేవలం ఆశ్చర్యపడడమే కాదు, పద్య రచనకు ఉపయోగపడుతుందని కుమారునిచేత అమరం కంఠస్థం చేయించడానికి కూడా పూనుకున్నారు. ఆ విధంగా సీతాపతిగారు అమరంలో నాలుగైదు సర్గలు కంఠస్థం చేశారు. అంతలో లోయర్ సెకండరీ పరీక్షలు దగ్గిరపడడం వలన ఆ అమరం సంథలకు అంతరాయం ఏర్పడింది.

సీతాపతిగారి స్వీయ చరిత్ర వల్ల చిన్నతనంలో ఆయనకు ప్రదర్శన కళలపట్ల ఆసక్తి ఉండేదని మాత్రమే తెలుస్తూంది గాని సర్కస్ ప్రదర్శనలూ, నాటకాలూ, ఉపన్యాసాలూ మొదలైన వివిధ ప్రదర్శన కళలలో ఆ నాడు ఆయన ప్రదర్శించిన ప్రతిభ ఎలాంటిదో అంచనా కట్టేందుకు ఆధారాలు లేవు.

## గూఢ సంకేత లిపి :

శేషగిరిరావుగారూ, ఆయనా కలిసి తమలో తాము ఏర్పరచుకొన్న గూఢమైన సంకేత లిపి స్వరూపం ఎలాంటిదో కూడా మనకు తెలియదు. అయితే 1903 లో ఆ ఇద్దరు మిత్రులూ విడిపోవడం, తరువాత ఇరవై ఏళ్ళకు తిరిగి వారు కలుసుకోడం జరిగిందట. అలా కలుసుకున్నప్పుడు సీతాపతిగారు తమ మిత్రుణ్ణి అడిగారట: "శేషా! చిన్నప్పుడు మనం కల్పించుకున్న లిపిని నేనింకా అపుడపుడు నా డైరీలో వాడుక చేస్తూ ఉంటాను. ఆ లిపి నీకు గుర్తుందా?" అని.

బుర్రా శేషగిరిరావుగారు తామూ ఆ పనే చేస్తున్నామని అన్నారు. తరువాత ఇద్దరూ ఆ నాడు తాము వాడుకచేస్తున్న లిపులను సరి పోల్చి చూసుకోగా తాము మొదట ఏర్పరచుకొన్న 26 అక్షరాలలోనూ 6 అక్షరాలు మాత్రమే సమానంగా ఉన్నాయి. తక్కిన 20 అక్షరాలలోనూ కొద్దిగానో, గొప్పగానో మార్పులు వచ్చాయి.

ఈ మాటలను బట్టి ఆ ఇద్దరూ తమ సంకేత లిపిలో ఇంగ్లీషు వర్ణమాలలోని 26 అక్షరాలనే గ్రహించి వాటికి వేరు వేరు విలువలు ఏర్పాటు చేసుకున్నట్టు తోస్తుంది. ఉదాహరణకు 'B' కి 'M' విలువనూ, 'O' కు 'Z' విలువనూ, 'Y' కి C విలువనూ కల్పించుకున్నారనుకోండి, అప్పుడు **boy** అనే ఇంగ్లీషు మాట వారి లిపిలో **MZC** అని వ్రాయడం జరుగుతుంది. బహుశః వారు కల్పించుకున్న గూఢమైన సంకేత లిపి ఇలా కల్పించుకున్నదే అయి ఉండవచ్చును.

## ఎఫ్. ఏ. చదువు :

1900 వ సంవత్సరంలో సీతాపతిగారు మెట్రిక్యులేషను ప్యాసు అయ్యే సరికే పర్లాకిమిడి రాజాగారి హైస్కూలు రెండవ తరగతి కళాశాలగా అభివృద్ధి చెందింది. అందుచేత ఆయన ఎఫ్.ఏ. చదవడానికి మరొక పట్టణానికి వెళ్ళవలసిన

అవసరం లేకపోయింది. అప్పటికే రామమూర్తిగారు ప్రైవేటుగా మద్రాసు యూనివర్సిటీవారు నిర్వహించిన బి.ఏ. పరీక్ష వ్రాసి దేశ చరిత్రలో యూనివర్సిటీలో రెండవవాడుగా ప్యాసు కావడం, వెంటనే రాజాగారి కళాశాలలో చరిత్ర ఉపన్యాసకుడుగా నియమింపబడటం కూడా జరిగింది.

సీతాపతిగారు ఎఫ్. ఏ. లో చేరిన సంవత్సరమే (1901) ఎడ్మండ్ కాండ్లర్ అనే ఒక ఆంగ్లేయుడు ఇంగ్లీషు బోధించే ఉపన్యాసకుడుగా పర్లాకిమిడి రాజాగారి కళాశాలలో నియమింపబడ్డారు. ఆయన కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయ పట్టభద్రుడు ఇంగ్లీషులో గొప్ప రచయిత అని పేరు తెచ్చుకున్నవాడు. ఇంగ్లీషు భాషను బోధించే పద్ధతులలో ఆరితేరినవాడు. విద్యార్థుల ప్రేమను చూరగొన్నవాడు. అట్టి గొప్ప ఉపన్యాసకుని శిక్షణలో చదివి సీతాపతిగారు 1902 డిసెంబరు నెలలో ఎఫ్.ఏ. పరీక్ష ప్యాసు అయారు.

కళాశాలలో ఆయన ఎఫ్. ఏ పరీక్షకు చదువుతున్న ఆ రెండు సంవత్సరాలలో సీతాపతిగారితోపాటు వారి ఇంట్లోనే ఉంటూ మందగిరి మృత్యుంజయరావు కాశ్మకూరి సూర్యనారాయణ* అనే మరో ఇద్దరు విద్యార్థులు కూడా అదే తరగతిలో చదువుతూ ఉండేవారు. సీతాపతిగారి కంటె వారిద్దరూ ఒక ఏడాది పెద్ద వారు. ఈ ముగ్గురికీ కలిపి ఇంటివద్ద రామమూర్తి పంతులుగారు ఇంగ్లీషు, చరిత్ర పాఠాలు బోధిస్తూ ఉండేవారు.

"చదువులో ఎక్కువ శ్రద్ధ గలవాడు మృత్యుంజయరావు. రాత్రి 11 గంటల వరకూ చదివి పడుకొనే వాడు, తెల్లవారను 4 గంటలకే లేచి చదువుతూ ఉండేవాడు కాశ్మకూరి సూర్యనారాయణ 10 గంటల వరకూ చదివి పడుకొనే వాడు; తెల్లవారను 5 గంటలకు లేచేవాడు "నాకు రాత్రి 9 గంటలు కాగానే నిద్రవచ్చేది. వాళ్ళ బలవంతాన మరి కొంత సేపు పుస్తకం చేతబట్టినా చదువు తల కెక్కేది కాదు. తెల్లవారను 6 గంటల దాకా నిద్రమత్తు వదిలేది కాదు."

* తరువాతి కాలంలో ఈయన ఎం.ఏ. ప్యాసయారు. ప్రొఫెసర్ అయారు. వావిళ్ళ వారికి ఈయన "శ్రీ గిడుగు రామమూర్తి పంతులు జీవితము" అనే గ్రంథం వ్రాసి ఇచ్చారు.

అంటారు సీతాపతి గారు తమ స్వీయ చరిత్రలో. ఆయన వ్రాసిన ఇలాంటి అనేక వాక్యాల వలన ఆ రోజులలో ఆయనలో బొహీమియన్ లక్షణాలు (కట్టుబాట్లను సహించని స్వభావం) ఎంత ఎక్కువగా గోచరించేవో మనకు స్పష్టమవుతుంది.

మృత్యుంజయరావు, సూర్యనారాయణ, సీతాపతిగారు- ముగ్గురు మిత్రులూ ఎఫ్.ఏ పరీక్షలో ఉత్తీర్ణు లయారు. ఆ ముగ్గురిలోనూ మృత్యుంజయ రావుకి కాలేజి స్కాలర్‌షిప్ (నెలకు 15 రూపాయలు) లభించింది. సీతాపతిగారికి పర్లాకిమిడి రాజాగారి తమ్ముడైన పద్మనాభదేవ్ గారు నెలకు 20 రూపాయలు స్కాలరుషిప్ ఇచ్చారు. పాపం ఏ స్కాలరు షిప్పూ దొరకనిది కాశ్మకూరి సూర్యనారాయణకే. అందుచేత ఆయన విజయనగరం మహారాజా కాలేజీలో బి. ఏ. లో చేరవలసి వచ్చింది.

## బి. ఏ. చదువు - మద్రాసు జీవితం :

రామమూర్తి పంతులుగారికి తమ కుమారుణ్ణి మద్రాసులో క్రిస్టియను కాలేజిలో చదివించాలని సంకల్పం కలిగింది. అయితే అతనికి ఎవరైనా తోడు కావాలి. అందుచేత మృత్యుంజయరావుకి కూడా స్కాలరు షిప్పు వచ్చింది గనుక అతణ్ణి కూడా తమకుమారుని వెంట మద్రాసు వెళ్ళమన్నారు. కాని "15 రూపాయల స్కాలరుషిప్‌తో నేను చెన్నపట్నంలో చదువుకోలేను. విజయనగరం లోనే నేను నా చదువు సాగిస్తాను'' అన్నాడు మృత్యుంజయరావు. రామమూర్తి పంతులుగారు "నీకు నేను కావలసినపుడు ధన సహాయము చేస్తూ ఉంటాను. మా సీతాపతికి తోడుగా చెన్నపట్నంలోనే చదువుకో!" అని అతనిని అందుకు ఒప్పించారు. సీతాపతిగారి కంటె అతడు ఒక ఏడాది పెద్దవాడు కావడం వల్ల సీతాపతిగారిని పర్యవేక్షించే భారం కూడా అతనికి ఆయన ఒప్ప చెప్పారు.

సీతాపతిగారికి ఎఫ్.ఏ. లో చరిత్రలో నూటికి 50 మార్కులే వస్తే మేథమేటిక్స్ (గణిత శాస్త్రంలో) లో నూటికి 60 మార్కులు వస్తూ ఉండేవి. అదిగాక ఆయనకు చరిత్రకంటె లెక్క లంటేనే ఎక్కువ ఇష్టం. అందుచేత బి.ఏ లో తాను మేథమేటిక్సు గ్రూపు తీసుకుంటానన్నాడు సీతాపతిగారు. కాని తండ్రి అందుకు ససేమిరా ఒప్పుకోలేదు. తనూ మృత్యుంజయరావు ఇద్దరూ చరిత్ర గ్రూపు తీసికోవలసిందే అని ఆయన శాసించారు మృత్యుంజయరావుకి అది ఇష్టమే! కాని సీతాపతిగారికి ఇష్టం లేదు. అయినా తండ్రికి కోపం వస్తుందేమో అనే భయంతో ఆయన 'అలాగే!' అన్నారు.

కుమారుడు తన ఎదుట తల ఊపినా ఆ కుమారుని స్వభావం ఎరిగి ఉన్నవారు కనుక రామమూర్తి పంతులుగారికి సమ్మకం కలుగలేదు. మృత్యుంజయ రావును చాటుకు పిలిచి "ఒకవేళ వీడు మేథమేటిక్సు సెక్షనులో గనుక చేరితే వెంటనే నాకు తెలియజేయ్యి. నేను మద్రాసువచ్చి మార్పుచేయిస్తాను" అని చెప్పారు. అంతపట్టుదల - తనమాటే సాగాలని రామమూర్తి పంతులుగారికి!

సీతాపతిగారూ, మృత్యుంజయరావూ మద్రాసు బయలుదేరారు. అక్కడ వారికి మరొక మిత్రుడు కలిశాడు. ఆయన పేరు ఉన్నవ రామలింగం. ఆయన సీతాపతి గారికి కేవలం మిత్రుడేగాదు; దూరపు బంధువు కూడాను! బరంపురం కాలేజ్‌నుంచి ఆయన వచ్చాడు. మేథమేటిక్సు సెక్షన్‌లో ఆయన చేరాడు. సీతాపతి గారు కూడా అతనితో పాటు ఆ సెక్షనులోనే చేరాలని ఉబలాటపడ్డారు. కాని మృత్యుంజయరావు బెదిరించాడు: "నువ్వు గనుక ఆ పనిచేస్తే వెంటనే నేను మీనాన్న గారికి టెలిగ్రాం ఇస్తాను" అని. ఆ బ్రహ్మాస్త్రాని కి భయపడి సీతాపతిగారు తన ఇష్టంతో రాజీపని తండ్రిగారు చెప్పిన ప్రకారం చరిత్ర సెక్షనులో చేరి చరిత్రను అధ్యయనం చేయడానికే పూనుకున్నారు.

## ఆట విడుపు :

మద్రాసులో బి. ఏ. చదివిన మూడేళ్ళూ తండ్రి దగ్గర లేకపోవడంవల్ల సీతాపతిగారికి ఆటవిడుపు లభించినట్లు అయింది. దానికి తోడు తనతో అన్నివిధాలా సమానధర్ముడైన ఉన్నవ రామలింగంతో దోస్తీ ఎక్కువైంది. ఇద్దరినీ కాలేజ్ పాఠాలకంటె నాటకాలూ, పాట కచ్చేరీలూ, మీటింగులూ మొదలైనవి ఎక్కువగా ఆకర్షించేవి. మద్రాసులో అటువంటి కార్యక్రమాల కేమి తక్కువ? కాలేజ్‌క్లాసులు ఎగగొట్టి ఇద్దరూ ఇష్టం వచ్చినట్లు తిరుగుతూ ఉండేవారు.

## వేదంవారి శిష్యరికం :

సీతాపతిగారి లాగే ఉన్నవ రామలింగం కూడా రెండవ ఫారం నుంచి రెండవ భాషగా సంస్కృతమే చదువుతూ వచ్చిన వాడు. బి. ఏ,. లో కూడా ఇద్దరూ సంస్కృతం క్లాసులోనే చేరారు.

ఆ రోజులలో మద్రాసు క్రిష్టయన్ కాలేజీలో వేదం వేంకటరామ శాస్త్రిగారు సంస్కృత పండితుడుగా ఉండేవారు. కేవలం సంస్కృతం మాత్రమే అధ్యయనం

చేసిన ఇతర పండితుల వంటివారు కారు ఆయన. ఇంగ్లీషు కూడా ఆయన బాగా చదువుకున్నారు. పాఠ్యగ్రంథాలలోని సంస్కృత శ్లోకాలకు ఆయన ఇంగ్లీషులో చక్కగా అర్థం చెప్పేవారు.

సీతాపతిగారి జీవితంలో వేదం వేంకట రాయశాస్త్రిగారివంటి ఉద్దండ పండితుని గురుత్వం లభించడం గొప్ప అదృష్టం. ఆ గురువు పాదాలవద్దనే చదుకువున్న డా॥ కట్టమంచి రామలింగారెడ్డి గారు 'గురుపూజ' అనే వ్యాసంలో వేదం వేంకట రాయశాస్త్రిగారిని గురించి ఇలా వ్రాశారు: "నేను దెనుంగు తరగతికిఁ జేరినవాడ నైనను జేరిననాటి నుండియు శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులవారి దర్శన గౌరవమును, సల్లాప భాగ్యమును నాకు లభించినవి .......... వీరి వచనము మృదుమధురము, హాస్యరసశోభితము. ఎట్టి గాఢమైన విషయమైనను సరే సరళము గాను, సరసముగను వివరించు విధానము వీరి కలవడినట్లు పెఱ అగ్రాసనాధిప తులలో గానంబడదు. వీరి ప్రసన్నత సర్వసభికాకర్షకము. మేముచిన్నవారము; అల్పజ్ఞులము. అయినను మమ్ము మందలించునపుడు సైతము మిక్కిలి మర్యాదతో మేము పొరపాటు పాలైనట్లు పలుకుదుర కాని తప్పులలో బడినట్లు కఠినముగా బలుకరు. నా 'కవిత్వ తత్త్వ విచారము'నకు బీజమైన కళాపూర్ణోదయ విమర్శన వ్యాసమును నేను వీరి యధ్యక్షత క్రిందఁ జదువగాఁ గొంతవరకు నత్యుక్తి దోష మందున్నదని మెత్తని రీతిని బరిశీలించి నాకు ధైర్యము కలిగించిరి. మనసు విఱుగునట్టు మాటలాడుట వీరి పద్ధతి కాదు. అనగా-ఇతర పండితులపై దాడి వెడలునప్పుడు తప్ప!"

తరువాత ఆ రామలింగారెడ్డిగారే ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులై ఉన్న కాలంలో వేదం వేంకటరాయశాస్త్రిగారికి 'కళాప్రపూర్ణ' బిరుదం ఇచ్చే సందర్భంలో ఆయనను ఇలా ప్రశంసించారు:

"ఛాన్సలర్ మహాశయా! శ్రీ శాస్త్రులవారు చెన్నపురి క్రైస్తవ కళాశాలలోఁ జిరకాలము ప్రధాన సంస్కృత పండితులుగా నుండి పెక్కండ్రు విద్యార్థులకు జ్ఞానబోధ చేసి కృతకృత్యులైన మహానుభావులు. మఱియు బహు గ్రంథముల రచించి భాషాభివృద్ధికి మిక్కిలి తోడ్పడినవారు. వీరు రచించిన ప్రతాపరుద్రీయాది స్వతంత్ర గ్రంథములు వీరి కవితా పరిపాటికిని, విమర్శన గ్రంథములు వీరి సునిశిత మతి విశేషమునకును, శృంగార నైషధాది వ్యాఖ్యానములును, కథా సరిత్సాగరాది భాషాంతరీకరణములును వీరి రసజ్ఞతకును దార్కాణములు."

అలాంటి మహావిద్వాంసుడు మహోపాధ్యాయ వేదం వేంకటరాయశాస్త్రిగారి వద్ద సంస్కృత సాహిత్యం అధ్యయనం చేసే మహాభాగ్యం సీతాపతిగారికి కలిగింది.

కాలేజ్ వార్షికోత్సవ సందర్భంలో శాస్త్రిగారు విద్యార్థులచేత నాటకాలు ఆడిస్తూ ఉండేవారు. ఒక సంవత్సరం శ్రీహర్షుడు వ్రాసిన సంస్కృత నాటకం 'రత్నావళి'ని ఆడించడానికి పూనుకున్నారు. దాంట్లో సీతాపతిగారికీ, రామలింగానికీ, దర్భా శివరామదాసు అనే మరొక మిత్రునికీ కూడా పాత్రలు లభించాయి. కాని రిహార్సల్సు కూడా జరిగిన తరువాత ఏదో ప్రతిబంధకం ఏర్పడి, ఆ నాటకం ప్రదర్శించడం పడలేదు.

శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారివద్ద భవభూతి వ్రాసిన 'మాలతీ మాధవం' నాటకాన్ని పాఠ్య గ్రంథంగా సీతాపతిగారు చదువుతున్నారు. తెలుగు కవిత్వంలో మొదటినుండి ఆసక్తి కలవారు కావడం వల్ల ఆ నాటకానికి దాసు శ్రీరాములు గారు, జనమంచి వేంకట్రామయ్య గారు చేసిన తెలుగు అనువాదాలు సంపాదించి ఆ అనువాదాలు సరిగా ఉన్నదీ లేనిదీ సంస్కృత మూలంతో సరి పోల్చి చూస్తూ ఉండేవారు. కొన్ని కొన్ని శ్లోకాల అనువాదాలు ఆయనకు నచ్చేవి కావు. ఆ తెలుగు అనువాదాలపట్ల తన అభిప్రాయాలను సీతాపతిగారు వేంకట రాయశాస్త్రిగారి ఇంటికి వెళ్ళి ఆయనతో చర్చిస్తూ ఉండేవారు. ఆ సందర్భంలో కొన్నికొన్ని సంస్కృత శ్లోకాలను తానే స్వయంగా తెలుగులోకి అనువదిస్తూ ఉండడం కూడా జరుగుతూ ఉండేది. అలా చేసిన ఒక అనువాదం శాస్త్రిగారిచేత తల ఊపించిందని సీతాపతిగారు స్వీయచరిత్రలో వ్రాసుకున్నారు. ఆ శ్లోకాన్నీ, దానికి సీతాపతిగారు చేసిన అనువాదాన్నీ గూర్చి ఆయన కవితాశక్తిని పరామర్శించే మీది అధ్యాయంలో వివరంగా చెప్పుకుందాం.

మద్రాసులో బి. ఏ. చదువుకునే రోజులలో సీతాపతిగారి లోని తెలుగు కవితా లత కూడా తండ్రిగారి ప్రతిబంధకం లేనందువల్ల నిర్నిబంధంగా వికసించినట్లు కనిపిస్తుంది. కాలేజ్‌లో ఆయన రెండవ భాషగా సంస్కృతమే చదువుతున్నా, పర్లాకిమిడిలో ఎఫ్. ఏ. చదువుతున్న రోజులనుంచీ కూడా మిత్రులు మృత్యుంజయరావు, కాళ్లకూరి నారాయణరావులు చదువుతూ ఉండిన తెలుగు పాఠ్యగ్రంథాలు ఆయన కూడా శ్రద్ధగా అధ్యయనం చేస్తూ వచ్చారు. మద్రాసులో

ఉండగా మృత్యుంజయరావు పాఠ్య గ్రంథంగా చదువుతున్న కూచిమంచి తిమ్మ కవి వ్రాసిన 'సర్వలక్షణ సార సంగ్రహం' సీతాపతిగారిని ఎక్కువగా ఆకర్షించింది. అదే అనంతర కాలంలో 'తెలుగు ఛందోరీతులు' అనే ఉద్గ్రంథాన్ని ఆయన రచించడానికి దారితీసింది. ఆయన మిత్రులలో దర్భా శివరామదాసుకు కూడా తెలుగు కవిత్వం అంటే మక్కువ ఉండడంవల్ల సీతాపతిగారి కవితా వ్యాసంగానికి అది మరింత దోహదం చేసింది. అయితే ఆ రోజులలో ఆయన వ్రాసిన తెలుగు పద్యాలు ఏవీ అచ్చులో మనకు లభించకపోవడం మిక్కిలి శోచనీయం!

మద్రాసులో చదువుకునే రోజులలో సీతాపతిగారిలోని క్రీడం మీద ఆసక్తి కూడా విశృంఖలంగా విజృంభించింది. అక్కడ సీతాపతిగారి మిత్రులలో ఊటుకూరి ప్రకాశరావు అని ఒకాయన ఉండేవాడు. ఆయన సీతాపతిగారి కంటె 7, 8 ఏళ్లు పెద్దవాడు. కాని ఎందువల్లనో చదువులో వెనుక బడడంవల్ల బి. ఏ. తరగతిలో సీతాపతిగారికి సహాధ్యాయి అయాడు. మరో మిత్రుడు చాగంటి సాంబశివరావు ఆ కాలేజిలోనే ఎఫ్ ఏ. తరగతిలో చేరాడు. వారిద్దరూ చదువులో ఎలా ఉన్నా, టెన్నిస్ ఆడడంలో గొప్ప చాకచక్యం గలవారు వారి ప్రోద్బలంతో సీతాపతిగారు కూడా టెన్నిస్ ఆడుతూ ఉండేవారు. "వారిద్దరి వలె మ్యాచ్ ప్లేయరును కాను గాని బాగానే ఆడుతూ ఉండేవాడను" అని సీతాపతిగారు వ్రాసుకున్నారు. మద్రాసు చేరకముందు నుంచే అడపా దడపా ఆయన టెన్నిస్ ఆడుతూ ఉండేవారట!

## స్వల్ప అనారోగ్యం :

సీతాపతిగారి మద్రాసు చదువు సందర్భంలో చెప్పుకోవలసిన మరొక విశేషం ఆయన ఆరోగ్యం స్వల్పంగా దెబ్బతినడం. కాలేజిలో చేరిన రెండు మాసాలకే పైర్య నష్టం వ్యాధి పట్టుకుని ఆయనను బలహీనుణ్ణి చేసింది. ఆ వ్యాధి వల్ల శరీరం దుర్బలం కావడమేకాకుండా, మనస్సు కూడా బలహీన పడతుంది. చురుకుదనం తగ్గుతుంది. చదివింది సులభంగా తలకెక్కదు. మనస్సు స్తిమితంగా ఉండక విన్నది సరిగ్గా బోధపడదు. బహుశః ఆ రోజులలో ఆయన చదువులో కంటె వినోదాలతో కాలక్షేపం చేయడంలోనే ఎక్కువ ఆసక్తి చూపడానికి కొంత వరకు ఆ వ్యాధి కారణం కావచ్చును. ఆ వ్యాధివల్ల మొదటి ఏడాది అర్ధ సంవత్సరపు పరీక్షలకు ఆయన హాజరు కాలేదు.

ఆ ఏడాదే (1904) మే నెలలోనే సీతాపతిగారికి తిరిగి వివాహం నిశ్చయం అయింది. ఆయన కాబోయే మామగారు కవిపురపు జగన్నాథరావుగారు అల్లుని అనారోగ్యాన్ని గురించి విని ఏవో మందుపొట్లాలు పంపించడం, కొద్ది రోజులలోనే ఆయనకు కొంతవరకు స్వస్థత చేకూరడం జరిగింది. అనుకున్న ప్రకారం మే నెలలో వివాహం యథావిధిగా జరిగింది.

వేసవి సెలవులు పూర్తి అయి జూలై నెలలో ఆయన తిరిగి కాలేజీలో చేరడానికి చెన్నపట్టణం వెళ్ళారు. అప్పటికి ఇంకా పూర్తిగా ఆరోగ్యం చేకూరక పోవడంవల్ల డిసెంబరు నెలలో జరిగిన జూనియర్ బి. ఏ. పరీక్షలలో ఒక్క సంస్కృతంలో తప్ప ఇంగ్లీషులోనూ, చరిత్రలోనూ మంచి మార్కులు రాలేదు. అందుచేత ఇంగ్లీషు సంస్కృతం మాత్రమే సీనియర్‌లో చదివి యూనివర్శిటీ పరీక్షలకు వెళ్ళనిచ్చారు. ఆ తరువాతి ఏడాది చరిత్రభాగం కూడా పరీక్ష వ్రాసి ఆయన బి. ఏ. పరీక్ష ప్యాసు అయారు.

విద్యాభ్యాసం విషయంలో సీతాపతిగారిలో నెరవేరని కోరికలు రెండు ఉండేవి. ఒకటి: మేథమేటిక్సు సబ్జక్టుతో బి. ఏ. చదవాలని. తండ్రిగారి చండశాసనంవలన అది పడలేదు. రెండవ కోరిక 'లా' చదివి వకీలు కావాలని! మద్రాసులో చదువుకుంటున్న రోజులలో వీలు చిక్కినప్పుడల్లా ఆయన హైకోర్టుకు వెళ్ళి భాష్యం అయ్యంగారు, కృష్ణస్వామి అయ్యర్, నార్టన్ వంటి ఆ నాటి హేమాహేమీలైన న్యాయవాదులు చేసే వాదనలను వినివస్తూండేవారు. సీతాపతిగారి ప్రసంగ నైపుణ్యం, భావవిస్పష్టత మొదలైన లక్షణాలను ఎరిగి ఉన్న ఆయన మిత్రులు ఆయన 'లా' చదివి వకీలు అయిఉంటే, మన ప్రముఖ న్యాయవాదులలో ఒకరు అయి ఉండేవారు అని అంటూ ఉంటారు.

## ఎల్. టీ. ట్రెయినింగు :

చివరకు పరిస్థితుల ప్రాబల్యంవల్ల ఉపాధ్యాయ వృత్తిలోనే స్థిరపడాలని నిశ్చయించుకున్నందువల్ల సీతాపతిగారు 1907 లో ఎల్. టి. ట్రైనింగ్ కోసం రాజమహేంద్రవరం ట్రైనింగ్ కాలేజీకి దరఖాస్తుపంపారు. అయితే ఈ రోజులలో లాగానే ఆ రోజులలో కూడా ట్రైయినింగ్‌లో సీటు అంత తేలికగా దొరకేది కాదు. తండ్రిగారి మిత్రుడైన యేట్స్ దొరగారివద్దకు వెళ్లి సీతాపతిగారు తమ

అభీష్టం తెలుపగా ఆయన గట్టిగా రెకమెండ్ చేశారు. దానితో వెంటనే ఆయనకు సీటు వచ్చింది.

1907 జనవరిలో సీతాపతిగారు రాజమహేంద్రవరం ట్రైయినింగ్ కాలేజీలో ప్రవేశించారు. అక్కడ వారితో పాటు ట్రైయినింగ్‌లో చేరిన మిత్రులలో జయంతి గంగన్న, విస్సా అప్పారావు, గాడిచెర్ల హరిసర్వోత్తమరావు వంటి ప్రముఖులుకూడా ఉన్నారు. ఉన్నవ రామలింగం, మంత్రిప్రగడ సాంబశివరావు, సీతాపతిగారి పెదతాతగారి మనుమడు గిడుగు వేంకటరామమూర్తి మొదలైన వారుకూడా ఆయనతో కలిసి ఎల్. టి. చేశారు.

ఆ సంవత్సరం రాజమండ్రి ఆర్ట్సు కాలేజీకి, ట్రెయినింగ్ కాలేజీకి కూడా మార్క్ హంటర్‌గారే ప్రిన్సిపాలుగా ఉండేవారు. ట్రెయినింగ్ కాలేజీకి వైస్ ప్రిన్సిపాల్ మల్లాది వేంకటరత్నంగారు.

ప్రిన్సిపాల్ మార్క్ హంటర్ ఎమ్. ఏ. (ఇగ్లీంషు) క్లాసులు కూడా నడుపుతూ ఉండేవారు. అందుచేత ఆయనవద్ద ఇంగ్లీషు చదువుకోడానికి బుర్రా శేషగిరిరావుగారు కూడా వచ్చి, సీతాపతిగారితో పాటు ఆయన హాస్టలులోనే ఉండేవారు.

పెద్దవాడై,* ఎల్.టి. ట్రైనింగు చదువుతున్నా సీతాపతిగారిలో చిన్ననాటి ఆట కోటితనం తగ్గినట్లులేదు. స్వీయచరిత్రలో ఆయన ఇలా అంటారు:'రామలింగం నేనూ చేరినామంటే మేము శ్రద్ధగా చదువుకొనేవారము కాము; ఇతరులను చదువుకోనిచ్చేవారము కాము".

వాళ్ళ తరగతిలో వెంకోబారావని ఒక కన్నడ దేశపు ఉపాధ్యాయుడు ఉండేవాడు. ఆయన పాపం చాలా శ్రద్ధగా చదువుకుంటూ ఉండేవాడు. సీతాపతిగారూ, రామలింగం గారూ ఆయన చదువుకి విఘ్నం కలిగించకుండా ఉండడానికి ఒక షరతు పెట్టారు. ఆ షరతు ఏమిటంటే-మెథడ్స్, సైకాలజీ, హిస్టరీ ఆఫ్ ఎడ్యుకేషన్ అనే మూడు సబ్జెక్టులలోనూ ఒక్కొక్కదానికి నాలుగైదు పుస్తకాలు

---

* అప్పుడు ఆయన వయస్సు 22 సం॥లు. అప్పటికే ఆయనకు ప్రథమ పుత్రిక 'రమణమ్మ' జన్మించింది.

చదివి ఆయన తయారుచేసిన నోట్సు వీరిద్దరికీ కూడా ఇస్తూ ఉండాలి. ఆ షరతుకు పాపం ఆయన ఒప్పుకున్నారు.

ట్రైనింగ్ కాలేజీలో నెలనెలా పరీక్షలు జరుగుతూ ఉండేవి. ప్రతి సబ్జెక్టులోనూ వెంకోబారావుకే ఫస్టు మార్కులు వచ్చేవి. అయితే సైకాలోజీలోగాని, హిస్టరీ ఆఫ్ ఎడ్యుకేషన్‌లోగాని వెంకోబారావుకి నూటికి 60 మార్కులు వస్తే సీతాపతిగారికి 65, రామలింగం గారికి 60 వచ్చేవి. "నేనెంతో కష్టపడి నోట్సు తయారు చేస్తే ఆ నోట్సు చదివి పరీక్షలు వ్రాస్తున్న మీకూ నాకూ కేవలం 5 మార్కులేనా తేడా ?" అంటూ ఉండేవాడట వెంకోబారావు నవ్వుతూ.

రాజమండ్రిలో సీతాపతిగారు ట్రైనింగ్ చేస్తున్న రోజులలో జరిగిన ఒక ముఖ్యమైన సంఘటన-విపిన్‌చంద్రపాల్ ఆగమనం. ఆయన గొప్ప వక్త. ఆయన ఉపన్యాసాలు ఆ రోజులలో దేశాన్నంతా ఉర్రూతలూగించాయి. సీతాపతిగారు కూడా ఆయన ఉపన్యాసాలవల్ల ప్రభావితుడు కావడం, వందేమాతరం నినాదాలు చేస్తూ ఊరేగింపుల వెంట తిరగడం, విద్యార్థులు వందేమాతరం లాకెట్లు ధరించినందుకు ప్రిన్సిపాల్ హంటర్ వారిని దండించడం జరిగింది.

1907 డిసెంబరులో నెలలో సీతాపతిగారు ఎల్. టి. పరీక్షలో ఉత్తీర్ణు లయారు

అంతటితో సీతాపతిగారి జీవితంలో విద్యార్థి దశ ముగిసి, ఉద్యోగి దశ ప్రారంభం అయింది.

అయితే - ఉద్యోగి దశలో ప్రవేశించిన తరువాత కూడా విద్యారంగంలో సీతాపతిగారు మరొక పట్టం సాధించారు. అది డి. లిట్. పట్టం. సవరలను గురించి సీతాపతిగారు చేసిన పరిశోధనలవలన తెలిసిన సారాంశాలను ఆయన కొన్ని వ్యాసాలుగా రాజమహేంద్రవరంలోని హిస్టారికల్ రీసెర్చి జర్నల్‌లో ప్రకటిస్తూ వచ్చారు. ఆ వ్యాసాలనూ, కొన్ని సవర పాటలకు సీతాపతిగారు ఇంగ్లీషులో చేసిన పద్యానువాదాలనూ పరిశీలించి అమెరికాలోని వాషింగ్‌టన్ నగరంలో ఉన్న ఇంటర్‌నేషనల్ అకాడెమీవారు 1940 లో సీతాపతిగారికి డి. లిట్. పట్టం ఇచ్చారు. అప్పటి నుంచి ఆయన డాక్టర్ గిడుగు వెంకట సీతాపతిరావు అయారు.

# 4

# ఉద్యోగ పర్వం

ప్రతి మనిషి జీవితాన్నీ ఒక గణిత రేఖ (గ్రాఫ్) గా నిరూపించ వచ్చును. 'ఎక్స్' అక్షం కాలాన్నీ (సంవత్సరాలనూ) 'వై' అక్షం జీవితంలోని జయాపజయాలనూ, ఒడుదొడుకులనూ సూచిస్తా యనుకుంటే, ప్రతి వ్యక్తి జీవితం తాలూకు గణిత రేఖా 'ఎక్స్' అక్షం మీద ఏదో ఒక బిందువు వద్ద ఆరంభమై, 'వై' అక్షం వెంట పడుతూ లేస్తూ కొంత దూరం ప్రయాణించి, చివరికి ఎక్స్ అక్షం మీద ఏదో ఒక బిందువు వద్ద ముగుస్తుంది.

ఏ ఇద్దరు వ్యక్తుల జీవితాల తాలూకు గణిత రేఖలూ ఒకే తీరుగా ఉండ వనే మాట నిజమే గాని, స్థూలంగా- మానవుల జీవిత గణిత రేఖలలో రెండు వర్గాలను గుర్తించ వచ్చును. కొన్ని జీవిత రేఖలు సరళంగా సాగుతూ క్రమోన్నతిని సూచిస్తాయి. మరి కొన్ని ఊహించడానికి వీలు లేని విధంగా మలుపులు తిరుగుతూ, వంకర టింకరలుగా ముందుకు సాగి, అనుకోని విధంగా అంతం అవుతాయి.

ఒక విధంగా - రామమూర్తి పంతులు జీవితపు గ్రాపు మొదటి వర్గానికి చెందిన దైతే, సీతాపతి జీవితపు గ్రాపు రెండవ వర్గానికి చెందిందని చెప్పవచ్చును.

రామమూర్తి పంతులు చిన్నతనం నుంచే లక్ష్య శుద్ధినీ, ఒక స్పష్టమైన జీవిత ధ్యేయాన్నీ కలిగి ఉండడం వల్లా, అనంతర జీవితంలో సుప్రసిద్ధులైన గురజాడ అప్పారావు, జయపురం రాజా విక్రమదేవ వర్మ వంటి బాల్య స్నేహి తులు ఆయనకు లభించడంవల్లా, తమ కుమారుని కైనా సరే, ప్రియశిష్యులైన చిలుకూరి నారాయణరావు వంటివారికైనా సరే అక్రమంగా రెండు మార్కులు కలిపి పరీక్ష పాసు చేయించడానికి నిరాకరించేటంత కఠోరమైన నీతి మార్గాన్ని ఎన్ను

కున్నందు వల్లా ఆయన జీవితం సరళంగా క్రమోన్నతిని సాధిస్తూ ముందుకు సాగుతుందని ఆ నాడు ఎవరైనా జోస్యం చెప్పగలిగి ఉండేవారు.

సీతాపతి బాల్యం అలా కాకుండా సంఘర్షణలతో గడిచింది. తన అభిమతాలకూ పరిస్థితుల ప్రాబల్యానికీ మధ్య తీవ్ర సంఘర్షణలను అడుగడుగునా ఆయన ఎదుర్కోవలసి వచ్చింది. అందుకే ఆయన భావి జీవితం ఎలాంటి మలుపులతో సాగేదీ చిన్ననాడు ఎవరికీ స్పష్టంగా ఊహించడానికి అవకాశం లేకుండా పోయింది. రాజకీయ దౌత్యం కోసం ఆయన లండన్ వెళతారని గాని, ముందు ముందు దేశంలో ఒక ప్రముఖ సినీమా నటుడు అవుతాడని గాని ఆ నాడు ఎవరూ ఊహించి ఉండరు.

## ఆక్టింగ్ టీచర్ :

ఉద్యోగాలకు సంబంధించినంత వరకూ సీతాపతి అదృష్టవంతుడే అని చెప్పాలి. రాజకీయ రంగంలోనూ, సినీమా రంగంలోనూ గడిపిన కొద్ది సంవత్సరాలు మినహాయిస్తేఆయన ఎన్నడూ నిరుద్యోగిగా లేరు. 1906లో పర్లాకిమిడి హైస్కూలులో ఆక్టింగ్ టీచరుగా చేరింది మొదలు 1957 లో తెలుగు భాషా సమితి నుంచి ఆయన పదవీ విరమణ చేసేవరకూ ఎప్పుడూ ఏవేవో ఉద్యోగాలు ఆయన నిర్వహిస్తూనే వచ్చారు.

సీతాపతి ఉద్యోగ జీవితాన్ని స్థూలంగా ఈ క్రింది విధంగా ఒక పట్టికలో నిరూపించవచ్చును:

1906 (జనవరి 16 మొదలు వేసవి సెలవుల వరకూ) పర్లాకిమిడి హైస్కూలులో తాత్కాలికపు టీచరు పదవి.

1908-10 పర్లాకిమిడి హైస్కూలులో హిస్టరీ టీచరు పదవి.

1910-11 జయపురం హైస్కూలు హెడ్ మాస్టరుగిరి.

1911-31 పర్లాకిమిడి మహారాజా వారి కళాశాలలో హిస్టరీ లెక్చరర్ పదవి.

1931-32 ఆంధ్ర యూనివర్సిటీలో సవరలను గూర్చి పరిశోధన చేసే పరిశోధక విద్యార్థి దశ.

1936 'సరంగ్' గ్రామంలో బైబిల్‌ను సవర భాషలోకి అనువదించే ఉద్యోగం.

1940 (మార్చి నుంచి డిసెంబరు వరకూ) 'భారతి' మాస పత్రిక సంపాదక పదవి.

1948-1957 మద్రాసులో తెలుగు భాషా సమితిలో 'తెలుగు విజ్ఞాన సర్వస్వ' ప్రధాన సంగ్రాహకత్వం.

బి.ఏ. పరీక్షలో సీతాపతి 1904 లో ఇంగ్లీషు, సంస్కృతం పరీక్షలు మాత్రమే వ్రాసి పాసయారు. తరువాత 1905 లో చరిత్రలో కూడా పరీక్ష వ్రాసి సెలవలకు పర్లాకిమిడి వెళ్ళారు. అప్పుడే పర్లాకిమిడి మహారాజావారి కాలేజీ హైస్కూలులో ఒక ఉపాధ్యాయ పదవి ఖాళీ వచ్చింది ఆ పదవికి ముందుగా ముత్తుకృష్ణ అయ్యరు అనే ఆయనను నియమించారు. ఆ రోజులలో మద్రాసు లోని సైదాపేటలోనే మొదట ట్రెయినింగ్ కాలేజ్ ఏర్పాటు కావడం వల్ల ఉపాధ్యాయులుగా నియమింప బడే అర్హత గల వారు తమిళులలోనే ఎక్కువగా ఉండే వారు. అందుచేత ఆంధ్ర దేశం ఉపాధ్యాయులలో ఆ రోజులలో తమిళుల సంఖ్య ఎక్కువగా ఉండేది. పి. టి. శ్రీనివాస అయ్యంగార్ వంటివా రందరూ అలా వచ్చిన వారే!

ముత్తు కృష్ణయ్యరు వేసవి సెలవలు గడిచిన తరువాత జూన్‌లో గాని తాను పనిలో ప్రవేశించలే నని హైస్కూలు అధికారులకు తెలియ జేశారు. ఆ సంగతి తెలిసిన సీతాపతి తాత్కాలికంగా తనను ఆ పదవిలో నియమింప వలసిన దని దరఖాస్తు చేశారు. 1904 డిసెంబరులో తాను బి.ఏ. లో రెండు భాగాలు పాసయాననీ, 1905 డిసెంబరులో వ్రాసిన చరిత్ర భాగంలో కూడా తప్పకుండా పాసు కాగలననే విశ్వాసం ఉందనీ దరఖాస్తులో పేర్కొన్నారు. ఆ రోజులలో పట్టభద్రులు తక్కువ కావడం వల్ల ఆ ఆక్టింగ్ ఉద్యోగం సీతాపతి కిచ్చారు. చిత్రంగా ఆర్డరు చేతికి వచ్చిన రోజునే ఆయనకు మద్రాసు నుంచి చరిత్ర భాగంలో కూడా పాసయినట్లు తంతి వార్త వచ్చింది.

ఆ రోజునే - 1906 జనవరి మధ్యాహ్నం 12 గం. లకు - జీవితంలో మొట్ట మొదటి సారిగా సీతాపతి హైస్కూలు టీచరుగా ఉద్యోగ ప్రవేశం చేశారు.

4 వ, 5 వ ఫారాలకు ఇంగ్లీషు, హిందూ దేశ చరిత్ర ఆయన బోధించే వారు. మొదటి నుంచీ ప్రసంగ కౌశలం, వక్తృత్వ నైపుణి అలవరచు కొన్నందు

వలనా, సభా భీతి ఎన్నడూ ఆయనకు లేనందు వలనా ఉపాధ్యాయుడుగా ఆరంభం లోనే ఆయన రాణించినట్లు కనిపిస్తూంది. ఆ సంవత్సరం విద్యాశాఖాధికారిగా యేట్స్ దొర పర్లాకిమిడి హైస్కూలు తణిఖీ చేయడానికి వచ్చినప్పుడు జరిగిన ఒక సంఘటనను సీతాపతి తమ స్వీయ చరిత్రలో విపులంగా వర్ణించారు :

యేట్స్ దొర తమ సెక్షనులోకి వచ్చేసరికి ఆయన 5 వ ఫారం విద్యార్థులకు అశోక చక్రవర్తిని గురించిన పాఠం చెబుతున్నారు. అశోక సామ్రాజ్యాన్ని సూచించే దేశపటం గోడకు వ్రేలాడుతూంది. టేబుల్ మీద అశోకుని శాసనాల ప్రతులు కొన్నీ, కళింగ యుద్ధానికి సంబంధించిన రచనలు కొన్నీ, అశోకుని కాలం నాటి నాణేలు కొన్నీ ఉన్నాయి. వాటి నన్నిటినీ విద్యార్థులకు చూపిస్తూ ఆసక్తి జనకంగా ఆయన విద్యార్థులకు పాఠం చెబుతున్నారు. ఆ రోజులలో తెలుగు తప్ప తక్కిన అన్ని విషయాలూ ఇంగ్లీషులోనే బోధించబడుతూ వచ్చినందు వలన ఆయన ఇంగ్లీషులోనే పాఠం చెబుతున్నారు. అశోకుని శాసనాలు విద్యార్థులకు చూపించి వాటి తాలూకు ఇంగ్లీషు అనువాదం ఆయన చదివి వినిపిస్తున్నారు. యేట్స్ దొర ఒక అరగంట సేపు ఆయన క్లాసులో కూర్చుని ఆయన బోధనా పద్ధతులను గమనించారు. "ఈ పద్ధతిలో బోధిస్తే అశోకుని పాఠం పూర్తి కావడానికి మీకు ఎన్ని పీరియడ్లు కావలసి ఉంటుంది?" అని ఆయన అడిగారు. రెండు పీరియడ్లలో అశోకుని పాఠం పూర్తవుతుందనీ, మొదటి పీరియడ్‌లో అశోకుని చరిత్ర పట్ల విద్యార్థులకు ఆసక్తి కలిగిస్తే, రెండవ పీరియడ్‌లో పాఠ్య గ్రంథంలో ఉన్న విషయాలను బోధించవచ్చు ననీ సీతాపతి జవాబు చెప్పారు.

తన తొలి ఉద్యోగంలోనే తాను సాధించిన ఆ ఘన విజయాన్ని గురించి సీతాపతి తమ స్వీయ చరిత్రలో ఇలా వ్రాసుకున్నారు: "ఇన్స్‌పెక్షన్ రిపోర్టులో (యేట్స్‌దొర) నా పాఠం సంగతి ఎత్తుకొని నన్ను మెచ్చుకుంటూ ఒక తాపు గ్రంథం వ్రాశాడు."

1906 లో వేసవి సెలవులకు ముందే సీతాపతి ఆక్టింగ్‌గా చేపట్టిన ఆ టీచరు ఉద్యోగం ముగిసింది.

## హిస్టరీ టీచర్ :

1907 డిసెంబరు నెలలో రాజమండ్రిలో సీతాపతి ఎల్.టి. ట్రెయినింగ్ పరీక్షలు పూర్తి కాకమునుపే పర్లాకిమిడి మహారాజా వారి హైస్కూలులో హిస్టరీ ఉపాధ్యాయుడుగా ఆయనను నియమిస్తున్నట్లు రాజమండ్రి ట్రెయినింగ్ కాలేజ్ వైస్ ప్రిన్సిపాల్ ద్వారా ఆయనకు ఆర్డరు అందింది. ఆ ఆర్డరు కాగితాన్ని సీతాపతి కందిస్తూ ఆ వైస్ ప్రిన్సిపాల్ పర్లాకిమిడిలోని ఆ ఉద్యోగంలో చేరవద్దనీ రాజమండ్రిలోని తమ కాలేజీలోనే ఆయనను ఉపాధ్యాయునిగా నియమిస్తాననీ, రాజమండ్రిలోనే ఉండిపొమ్మనీ ఆయనను అనేక విధాలుగా ప్రోత్సహించారు.

కాని, తాను చదువుకున్న హైస్కూలులోనే, తన తండ్రిగారు లెక్చరరుగా పనిచేస్తున్న కాలేజీకి సంబంధించిన హైస్కూలులోనే టీచరుగా పని చేయడం తనకు ఘనంగా ఉంటుందని సీతాపతి భావించారు. అందుచేత వైస్ ప్రిన్సిపాల్ సలహాను పెడచెవిన పెట్టి సీతాపతి 1908 జనవరిలో వెళ్ళి, పర్లాకిమిడి హైస్కూలు లోనే మళ్ళీ టీచరుగా చేరారు.

రెండేళ్ళ పాటు (1908 నుంచి 1910 వరకు) ఆ హైస్కూలులో ఆయన హిస్టరీ టీచరుగా పని చేశారు. మెట్రిక్యులేషన్ క్లాసుకు చరిత్ర, 5వ ఫారం విద్యార్థులకు ఇంగ్లీషు ప్రధానంగా ఆయన బోధిస్తూ ఉండేవారు.

## ఫొనెటిక్ లిపిలో ఇంగ్లీషు బోధన :

రాజమండ్రిలో ఎల్. టి. ట్రెయినింగ్ చదువుతున్న రోజులలో సీతాపతి గారు ఫొనెటిక్ స్క్రిప్ట్ (ఉచ్చారణ విధేయమైన లిపి) ద్వారా డైరెక్ట్ మెథడ్ (ప్రత్యక్ష విధానం) లో ఇంగ్లీషు భాష విద్యార్థులకు బోధించడం నేర్చుకున్నారు. అందుకు సంబంధించి సీతాపతి వద్ద ఉన్న పుస్తకాలను పర్లాకిమిడి వెళ్ళిన తరువాత ఆయన తండ్రి రామమూర్తి పంతులు కూడా చదివి ఆ విధానాన్ని చాలా మెచ్చుకున్నారు. తమ హైస్కూలులో మూడవ తరగతిలో పిల్లలకు మొదటి సారిగా ఇంగ్లీషు బోధించేటప్పుడు ఇక నుంచి ఈ విధానాన్నే అనుసరిస్తే బాగుంటుందని ఆయన హెడ్మాస్టరు గారికి నచ్చచెప్పారు.

తత్ఫలితంగా ఆ ఏడాది మూడవ తరగతి విద్యార్థులకు ఫొనెటిక్ స్క్రిప్ట్ ద్వారా ఇంగ్లీషు బోధించే విధానాన్ని ప్రవేశపెట్టి, ఆ తరగతిని కూడా సీతాపతికి

ఒప్పుచెప్పారు. రామమూర్తి పంతులుగారి నాల్గవ కుమారుడు, సీతాపతి ఆఖరి తమ్ముడు సూర్యనారాయణ కూడా ఆ తరగతిలో చదువుతూ ఉండేవాడు. ఆరేళ్ళ వయస్సులో ఉన్న ఆ తరగతి పిల్లలు ఈ డైరెక్టు విధానంవల్ల ఒక్క-ఏడాదిలో 2,000 ఇంగ్లీషు మాటలను వాటి సరి అయిన ఉచ్చారణతో సహా నేర్చుకుని సులభంగా మాట్లాడడం అలవరచుకున్నారు. తమకు తెలిసిన ఆ 2,000 మాటలలో ఏదైనా కొత్త కథ చెప్పినా వారు అర్థం చేసుకో గలిగేవారు.

ఆ ఏడాది (1908) నవంబరు నెలలో "బాబా కమీషన్" వారు ఆ కాలేజీకి తణిఖీకి వచ్చి విద్యార్థులను అనేక విధాలుగా పరీక్షించి చూసి ఆ డైరెక్టు విధానంలో గల సౌలభ్యాన్ని ప్రశంసించారు. 1909 లో ఆ తరగతి విద్యార్థులు నాల్గవ తరగతిలోకి రాగా, వారితోపాటు సీతాపతి కూడా నాల్గవ తరగతికి ఇంగ్లీషు బోధించే ఉపాధ్యాయు లయారు. అలా ఆ తరగతి విద్యార్థులు మెట్రిక్యులేషన్ చేరుకునే వరకూ వారికి సీతాపతే ఇంగ్లీషు బోధించాలనే నిర్ణయం జరిగింది. డైరెక్ట్ విధానం ద్వారా ఇంగ్లీషు బోధించడానికి ఇవటూరి కనకాచలం వంటి మరి కొందరు ఉపాధ్యాయులను కూడా నియమించారు.

పర్లాకిమిడి హైస్కూలులో ఆ విధంగా ప్రారంభమైన ఆ నూతన బోధనా ప్రయోగం దేశంలో కొంత సంచలనం కలిగించింది. ఇతర ప్రాంతాల నుంచి ఎందరో విద్యాధికులు ఆ ప్రయోగ ఫలితాలను పరిశీలించడానికి పర్లాకిమిడి వస్తూ ఉండేవారు. ఆ నూతన బోధనా విధానాన్ని గురించి సీతాపతి కొన్ని వ్యాసాలు కూడా వ్రాసి 'ఆక్స్‌ఫర్డ్ ఎడ్యుకేషనల్ రిపోర్టు'లో ప్రకటించారు.

## డేనియల్ జోన్స్ ఉపన్యాసాలు :

ఆ రోజులలోనే- 1912 లో- మద్రాసు యూనివర్శిటీ వారి ఆధ్వర్యవంలో ఫోనెటిక్ స్క్రిప్టును గురించీ, డైరెక్టు మెథడ్ (ప్రత్యక్ష బోధనా విధానం) గురించీ ఉపన్యాసాలు ఇవ్వడనికి సుప్రసిద్ధ ఆంగ్ల భాషా శాస్త్రవేత్త డేనియల్ జోన్స్ లండన్ యూనివర్శిటీ నుంచి మద్రాసు వచ్చారు. 16 రోజుల పాటు సాగిన ఆయన ఉపన్యాసాలను వినడానికి పర్లాకిమిడి నుంచి రామమూర్తిగారూ, సీతాపతీ కూడా వెళ్ళారు. తమతో పాటు వారు సీతాపతి ఆఖరి తమ్ముడు సూర్యనారాయణను కూడా తీసుకు వెళ్ళారు. అప్పు డాతని వయస్సు పదేళ్ళే!

అయినా డైరెక్టు మెథడ్ ద్వారా సీతాపతి వద్ద ఇంగ్లీషు నేర్చుకుని ఉన్నందు వల్ల ఎమ్. ఏ. విద్యార్థులతో సరిమానంగా అతడు జోన్స్ ఉపన్యాసాలను విని అర్థం చేసుకో గలిగాడట! అప్పుడు పర్లాకిమిడిలో ఇంగ్లీషు, సైన్సు ఉపాధ్యాయుడుగా ఉన్న కాశ్శకూరి సూర్యనారాయణ, విజయనగరంనుంచి సోమనాథ భట్టు, బుర్రా శేషగిరి రావు, విశాఖపట్టణంనుంచి పి.టి. శ్రీనివాస అయ్యంగారు - ఇలా ఎందరో కూడా తెలుగు జిల్లాల నుంచి ఆ ఉపన్యాసాలు వినడానికి మద్రాసు వెళ్ళారు.

రామమూర్తిపంతులు అప్పటికే సవరభాషను గూర్చిన పరిశోధన సాగిస్తూ, దానికి ఫొనెటిక్ లిపిని వాడుక చేస్తూ వచ్చారు గనుక, ఆ సందర్భంలో ఆయన జోన్స్ దొరను కలుసుకొని సవర భాషలోనూ, తెలుగు భాషలోనూ ఉన్న కొన్ని విశిష్టమైన ధ్వనులను గూర్చి ఆయనతో చర్చించారు.

## జయపురం హైస్కూలు హెడ్‌మాస్టర్ :

అయితే ఇంగ్లీషు బోధనలో ఆరంభమైన ఆ నూతన ప్రయోగంతో సీతాపతి ఎక్కువ కాలం సంబంధం పెట్టుకోడం సాధ్యం కాలేదు. 1910 లో ప్రస్తుతం ఒరిస్సా రాష్ట్రంలో ఉన్న జయపురం పట్టణంలో క్రొత్తగా ఒక హైస్కూలు స్థాపించారు. దానికి హెడ్‌మాస్టరుగా ఉండదగిన వ్యక్తిని సూచించమని జిల్లా కలెక్టరు యేట్స్ దొరను కోరగా, ఆయన ఆ స్కూలు యాజమాన్యం వారికి సీతాపతి పేరును సూచించారు అలా సూచించడమే కాకుండా ఆయన ఆ పదవిని అంగీకరించ వలసిందని ప్రోత్సహిస్తూ సీతాపతికీ, ఆయన తండ్రిగారికీ లేఖలు కూడా వ్రాశారు.

పర్లాకిమిడిలో హిస్టరీ టీచరుగా సీతాపతి జీతం నెలకు 65 రూపాయలు మాత్రమే! జయపురంలో హెడ్‌మాస్టరు పదవిని అంగీకరిస్తే నెలకు 100 రూ.లు వస్తుంది. తన 25 వ ఏటనే హెడ్‌మాస్టరు పదవి తనను వరించడం సీతాపతికి ఉత్సాహంగా ఉంది. ఆయన తండ్రిగారు కూడా అందుకు అంగీకరించారు.

1910 జూన్ నెలలో సీతాపతి ఆ పనిలో ప్రవేశించారు. 25 ఏళ్ళ వయస్సు వచ్చి ఒక హైస్కూలుకు హెడ్‌మాస్టరు అయినా, సీతాపతి ఆయన తండ్రి దృష్టిలో పసివాడే! తాను వెంట ఉండి జయపురం తీసుకుని వెళ్ళి, సీతాపతిని

పనిలో చేర్పించి, ఆయన యోగ క్షేమాలు కనుక్కుంటూ ఉండవలసిందని అక్కడ మహారాజా వారి దివాన్ అయిన పూళ్ళ వెంకన్న పంతులుగారికి ఆయనను వప్ప చెప్పి వచ్చారు. ఆ వెంకన్న పంతులు తన బాల్యంలో సీతాపతి మామగారు కవిపురపు జగన్నాథరావు గారి ఇంట పెరిగి వృద్ధిలోకి వచ్చిన వాడు. "మీ మామగారూ నేనూ అన్నదమ్ముల్లాగ పెరిగాం. అందువల్ల ఒక విధంగా నువ్వు నాకూ అల్లుడివే!" అంటూ ఎంతో ఆప్యాయత చూపిస్తూ జయపురంలో సీతాపతికి ఆయన పెద్ద అండగా ఉన్నారు.

జయపురంలో సీతాపతి ఉన్నది ఒక్క ఏడాదే అయినా అక్కడ ఆయన జీవితం చాలా ఉత్సాహంగా గడిచినట్లు కనిపిస్తుంది. అనంతర కాలంలో ప్రముఖ కార్టూన్ ఆర్టిస్ట్‌గా ప్రసిద్ధి పొందిన తలిసెట్టి రామారావు ఆ ఏడు జయపురం హైస్కూలులో నాల్గవ ఫారం చదువుతూ ఉండేవాడు. కళాప్రియుడైన సీతాపతి ఆ నాడే ఆ కుఱ్ఱవాని ప్రతిభను గుర్తించి, అతడు గీసిన బొమ్మలు చూస్తూ అతని కెంతో ప్రోత్సాహం కలిగిస్తూవచ్చారు. అనంతరం ఆ రామారావు చిత్రకారుడుగా పేరు పొందడమే కాకుండా, లాయరు పరీక్ష పాసయి, జయపురం సంస్థానానికి అసిస్టెంట్ దివాన్ కూడా అయాడు.

ఆ నాటి జయపురం మహారాజా వారితో (విక్రయదేవ వర్మ గారికి పూర్వపు రాజు) సీతాపతికి పరిచయం ఏర్పడింది. ఆ మహారాజు వల్ల తాను పని చేస్తున్న కోరాపుట్ జిల్లాబోర్డువారి హైస్కూలులో ఒక లైబ్రరీ తెరిచేందుకు ఏటేటా 100 రూపాయల గ్రాంటును సంపాదించి, ఆ హైస్కూలు లైబ్రరీకి ఆయనే అంకురార్పణ చేశారు.

1911 లో జరిగిన జనాభా లెక్కల సేకరణలో సీతాపతి చురుకుగా పాల్గొని జయపురం చుట్టుపట్ల గల 18 గ్రామాలు చూసి వచ్చారు. ఆ పర్యటనల సందర్భంలో ఆ ప్రాంతాలలో అప్పటికీ నరబలి ఆచారం మారుమూల స్థలాలలో ఇంకా కొనసాగుతూనే ఉందని ఆయన విన్నారు. కొన్ని గ్రామాలలో ప్రజలంతా ఏకమై సమష్టి వ్యవసాయం చేసుకుంటూ ఉండడం ఆయన చూశారు. ఆ ప్రాంతాలలో ఆ నాడు బానిసల వ్యాపారం కూడా అమలులో ఉండేదట! ఒక 'గదబ' జాతి బానిసను సీతాపతి రూ. 12 లు ఇచ్చి కొన్నారు. వాడికి రెండు పూటలా తిండి

పెడితే చాలు, జీతం నాతం ఏమీ ఇవ్వనక్కర లేకుండానే గొడ్డు లాగ వాడు ఇంటెడు చాకిరీ చేసేవాడు. అడవికి వెళ్ళి కట్టెలు కొట్టి తెచ్చేవాడు.

అప్పటికి ఇంకా మోటారు కార్లు రానందు వలన విజయనగరం నుంచి జయపురం వెళ్ళాలంటే చాలా ప్రయాస పడవలసి వచ్చేది. విజయనగరం నుంచి 'డొంకినివలస' వరకు మాత్రమే రైలు ఉంది. ఆ తర్వాత సాలూరు, పొట్టంగి, కోరాపుట్టి మొదలైన గ్రామాల మీదుగా 85 మైళ్ళదూరం ఎడ్ల బండీలో ప్రయాణం చెయ్యాలి.

జయపురంలో వాతావరణం చాలా బాగుండేది. ఎండలు తీవ్రంగా ఉండేవి కావు. వర్షాలు చాలా ఎక్కువ. ఏడాదికి 90 అంగుళాల వాన పడేది. అందుకే అక్కడి స్కూళ్ళకి వేసవి సెలవలకు బదులు వానాకాలం సెలవలు సుమారు 2 నెలలు ఇచ్చేవారట.

1910 లో అలా ఇచ్చిన వానాకాలం సెలవలకు సీతాపతి పర్లాకిమిడి వెళ్ళినప్పుడు గురజాడ అప్పారావు వారి ఇంట్లో ఉన్నారు. అప్పటికే ఆయన రచించిన ముత్యాల సరాలూ, కథానికలూ త్రిలింగ పత్రికలో వస్తూ ఉండేవి. అప్పటి కింకా అచ్చుకాని కొన్ని వ్రాతప్రతులు కూడా గురజాడ అప్పారావువద్ద సీతాపతి చూశారు. అప్పుడే రచిస్తూ వచ్చిన నీలగిరి పాటలు కొన్ని సన్నని కంఠ స్వరంతో గురజాడ అప్పారావు పాడి వినిపించారు. చిన్ననాటి ఆ అనుభవంవల్ల సీతాపతి కవితాజీవితంమీదా, పిల్లలకోసం ఆయన వ్రాసిన పాటలమీదా గురజాడ అప్పారావు ప్రభావ ముద్ర గాఢంగా కనిపించింది.

ఆ సెలవలలోనే తన బాల్య స్నేహితులైన బుజ్జా శేషగిరిరావు, ఒంగవోలు పట్టాభి రామారావులు సీతాపతి వచ్చారని తెలిసి అక్కడి కాలేజ్‌లో ఒక సభ ఏర్పాటు చేశారు. ఆ సభలో రవివర్మ చిత్రకళా కౌశలాన్ని గురించి సీతాపతి ఉపన్యసించారు. ఆ విధంగా అప్పటికే సీతాపతి ఆ నాటి ప్రముఖులలో ఒకరుగా గుర్తింపు పొందినట్టు కనిపిస్తూంది.

## హిస్టరీ లెక్చరర్

జయపురంలో హెడ్‌మాస్టరు పదవి ఉత్సాహంగానే సాగుతున్నా 1911 లోనే ఆయన ఆ పదవిని వదలిపెట్టి, తిరిగి పర్లాకిమిడి రావలసివచ్చింది.

సీతాపతి తండ్రి రామమూర్తి పంతులు గారు 30 ఏళ్ళ పాటు టీచరుగా ఉద్యోగం చేసి 1911 లో - తన 49 వ ఏటనే - స్వచ్ఛందంగా పదవినుంచి విరమించారు. చెవుడు బాధ ఎక్కువ కావడం, పెద్ద కుమారుడు చేతికి అంది రావడం అందుకు ఆయనను ప్రోత్సహించాయి. తాను రిటైరు కాదలచినట్లు ప్రభుత్వానికి ఆయన వ్రాయగా ప్రభుత్వం వారు అందుకు సమ్మతించి రూ. 8,000 లు వారికి గ్రాట్యూయిటీగా ఇచ్చారు. ఆ సొమ్ముతో ఒక ఇల్లు కట్టుకుని, కొన్ని భూములు కొనుక్కుని, భాషా సేవ చేస్తూ పర్లాకిమిడిలోనే స్థిరపడి శేషజీవితాన్ని గడపడానికి రామమూర్తి పంతులుగారు నిర్ణయించుకున్నారు.

రామమూర్తి పంతులు స్థానంలో హిస్టరీ లెక్చరరుగా హిస్టరీలో ఎమ్.ఏ. పాసయిన ఒక తమిళుణ్ణి మొదట నియమించారు. కాని, ఆయనకు తాను చదువుకొన్న పచ్చియప్ప కళాశాలలోనే హిస్టరీ లెక్చరర్ పదవి దొరకినందువల్ల పర్లాకిమిడి రావడానికి ఆయన నిరాకరించారు.ఆ రోజులలో బి.ఏ లో హిస్టరీ బోధించే కాలేజ్ తెలుగుదేశంలో ఒక్క బందరులోనే ఉండేవి. అందుచేత హిస్టరీ బి.ఏ.లకు కొరత ఉండేది. ఇక హిస్టరీలో ఎమ్.ఏ. పాసయిన తెలుగు వారు అప్పటికి ఎవరూ లేరనే చెప్పాలి. అందుచేత సీతాపతినే పర్లాకిమిడి కాలేజ్‌లో ఆయన తండ్రిగారి స్థానంలో హిస్టరీ లెక్చరర్‌గా నియమించారు.

1911 లో జయపురంనుంచి సీతాపతి తిరిగి పర్లాకిమిడి వెళ్ళి పోతున్న సందర్భంలో అక్కడ ఆయనకు ఘనమైన వీడ్కోలు లభించింది. జయపురం యువరాజుకు ఇంగ్లీషు ట్యూటరుగా ఉంటున్న వింక్లర్ దొర వీడ్కోలు సభకు అధ్యక్షత వహించారు. జయపురం మహారాజూ, యువరాజూ, ఆఫీసర్లూ, ప్లీడర్లూ మొదలైన పుర ప్రముఖులు 400 మంది దాకా హాజరైన ఆ సభలో సీతాపతి ప్రతిభనూ, చాకచక్యాన్నీ ప్రశంసిస్తూ పలువురు ప్రసంగించారు. 1½ తులం బరువు గల బంగారు పతకం, నూతన వస్త్రాలూ ఆయనకు బహూకరించారు. ఎడ్లబండిలో సీతాపతి పర్లాకిమిడి బయలుదేరగా సుమారు 40 మంది 4 మైళ్ళదూరం బండి వెంట వచ్చి ఘనంగా ఆయనను సాగనంపారు.

జయపురంలో రిలీవ్ కావడం ఆలస్య మైనందువల్ల వేసవి సెలవల అనంతరం గాని సీతాపతి పర్లాకిమిడి కాలేజీలో డ్యూటీలో చేరడం సాధ్యం కాలేదు.

కాని ఆయనతో పాటే ఆ కాలేజ్‌లో లాజిక్ లెక్చరర్‌గా నియమించబడిన పారనంది జగన్నాథస్వామి మాత్రం తాను పనిచేస్తున్న రాజమహేంద్రవరం వీరేశలింగం హైస్కూలు నుంచి త్వరగా రిలీవై, వేసవి సెలవులకు ముందే ఏప్రిల్ నెలలోనే పనిలో చేరి, సీతాపతి కంటె కొన్ని నెలల సీనియారిటీ సంపాదించారు

1911 నుంచి 1931 వరకూ అవ్యాహతంగా 20 ఏళ్ళ పాటు సీతాపతి పర్లాకిమిడి కాలేజ్‌లో హిస్టరీ లెక్చరరుగా పని చేశారు. ఆ రెండు దశాబ్దాలలోనూ కాలేజ్‌లో విద్యార్థుల మన్ననలు పొందుతూ ఆయన చేసిన విద్యాసేవ కంటె తన తండ్రి ఆరంభించిన వ్యావహారిక భాషా సంగ్రామంలో అగ్ర సేనానిగా నిలిచి ఆయన చేసిన భాషా సేవే ముఖ్యంగా చెప్పుకోదగింది. వ్యావహారిక భాషోద్యమంలో ఆయన నిర్వహించిన ప్రముఖ పాత్రను గురించి మీది అధ్యాయంలో విపులంగా తెలుసుకుంటారు.

## ఆంధ్ర విశ్వవిద్యాలయంలో రీసెర్చ్ ఫెలో :

1931-32 సంవత్సరంలో సీతాపతి పర్లాకిమిడిలో తన లెక్చరరు ఉద్యోగానికి సెలవు పెట్టి ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు ఇచ్చిన రీసెర్చ్ ఫెలోషిప్‌తో వాల్తేరులో సవరలను గూర్చి పరిశోధనలు చేయసాగారు. అప్పుడు కాలేజ్‌లో ఆయన జీతం రూ. 175 లు. యూనివర్శిటీ వారి ఫెలోషిప్ మొత్తం రూ. 150 లు. సగం జీతం మీద తమకు ఆ సంవత్సరం సెలవు ఇమ్మని సీతాపతి దరఖాస్తు పెట్టుకోగా ఆరు మాసాల వరకూ యాజమాన్యం వారు ఎలాంటి సమాధానం ఇవ్వకుండా, చివరకు జీతం నష్టంమీద సెలవు మంజూరు చేశారు. అప్పటికే సీతాపతి రాజకీయాలలో జోక్యం కలుగచేసుకున్నందువల్ల యాజమాన్యంతో అయనకు వైమనస్యం ఏర్పడింది. 1932 లో ఎలాంటి కారణం చూపించకుండానే రాజుగారు ఆయనను ఉద్యోగంలోనుంచి బర్తరఫ్ చేశారు. అలా తీసివేయడం అన్యాయం అని 1934 లో సీతాపతి పర్లాకిమిడి రాజావారి మీద దావా వేశారు. 1938 లో ఆ దావామీద కోర్టు వారు తీర్పు చెపుతూ 3 నెలల జీతం (రూ. 525లు) మాత్రమే ఆయనకు ఇప్పించారు. తండ్రి గారి సలహా మీద సీతాపతి కటకంలో ఉన్న హైకోర్టులో అప్పీలు చేశారు. కాని రాజాగారు బలవంతులు కావడం వల్ల అక్కడ కూడా తీర్పు సీతాపతికి వ్యతిరేకమే

అయింది. ఆ విధంగా సీతాపతి జీవితంలో పర్లాకిమిడి కాలేజ్‌లో హిస్టరీ లెక్చరర్ ఉద్యోగపు అధ్యాయం అంతటితో ముగిసిపోయింది.

## నిరుద్యోగి దశ :

1931-32 లో ఆంధ్ర యూనివర్సిటీలో రీసెర్చి ఫెలోషిప్ ముగిసిన తరువాత మళ్ళీ సీతాపతి స్థిరమైన ఉద్యోగంలో జేరటం 1948 లో కాని జరుగలేదు. ఆ సంవత్సరం (1948 లో) ఆయన మద్రాసులోని తెలుగు భాషా సమితిలో తెలుగు విజ్ఞాన సర్వస్వానికి ప్రధాన సంగ్రాహకులుగా నియమింపబడి సుమారు ఒక దశాబ్దం పాటు చెప్పుకోదగిన సాహిత్య సేవ చేశారు.

1932-48 మధ్య కాలంలో కొన్నాళ్ళు రాజకీయాలతోనూ కొన్నాళ్ళు సినిమా రంగ విహారంతోనూ సీతాపతి జీవితం గడిచింది. అయితే ఈ మధ్య కాలంలో ఆయన తాత్కాలికంగా నిర్వహించిన రెండు చిన్న ఉద్యోగాలు లేకపోలేదు.

ఒకటి 'సరంగ్' అనే గ్రామంలో బైబిల్‌లోని కొన్ని భాగాలను సవర భాషలోకి అనువదించే పని. కెనడా దేశపు బాప్టిస్ట్ మిషన్‌వారి తరపున మిస్ మన్రో అనే ఆమె ఆ పనిని సీతాపతికి వప్పచెప్పింది. నెలకు రూ. 150 లు జీతం. అద్దె లేకుండా ఇంటినీ సేవకులనూ ఇచ్చింది. సుమారు 6 మాసాలు సీతాపతి అక్కడ పని చేసి, 3 'గాస్పెల్'లను సవర భాషలోకి అనువదించారు. ఆ అనువాదాలను ఏరోజు కారోజు ఇద్దరు వ్యక్తులు సరిచూసేవారు ఇంగ్లీషు వాక్యంలోని భావం అనువాదంలో సరిగా వచ్చిందో లేదో మిస్ మన్రో చూసేది. రామమూర్తి పంతులుగారి వద్ద కొంత కాలం ఆమె సవర భాష నేర్చుకుంది. ఒరియా భాష వచ్చిన 'రొడుంగ్' అనే సవర వాడు సవర భాషలోని ఆ అనువాదం చదవగానే అర్థం అవుతూందో లేదో చెప్పేవాడు.

'సరంగ్' గ్రామం పర్లాకిమిడికి ఉత్తరంగా 20 మైళ్ళ దూరంలో కొండల మీద ఉంది. అది మన్య ప్రాంతం కావడంవల్ల దోమ తెర వంటి ఇనుప చట్రం అమర్చి బందోబస్తు చేసిన ఇంటిని అద్దె లేకుండా ఆయనకు ఇచ్చినా, ఆయనా, ఆయన భార్యా కూడా 2, 3 సార్లు మలేరియా జ్వరానికి గురి అయారు.

అంతలో నవరలను గురించి ఒక ప్రసంగం ప్రసారం చేయవలసిందని మద్రాసు రేడియో కేంద్రంనుంచి ఆహ్వానం రావడంతో సీతాపతి మద్రాసు వెళ్ళారు. మద్రాసులో ఉండగా మరొకసారి కూడా మలేరియా జ్వరం రావడంతో మరి 'సరంగ్' వెళ్ళకూడ దని ఆయన నిశ్చయించుకున్నారు.

1932-48 మధ్య కాలంలో సీతాపతి చేసిన మరొక తాత్కాలిక ఉద్యోగం 'భారతి' సంపాదక పదవి. 1938 నుంచే సీతాపతి సినిమాలలో నటించడం మొదలు పెట్టినా సినిమాలలో ఎడతెరిపి లేకుండా పని లభించనందువల్ల మధ్య మధ్య ఆయన స్వల్పంగా ఆర్థికమైన ఇబ్బందులకు లోనయ్యేవారు. అలాంటి ఒక సమయంలో 1940 లో ఆంధ్ర పత్రిక సంపాదకుడైన శివలెంక శంభుప్రసాద్ సీతాపతిని ఆయన బసలో కలుసుకుని భారతి మాస పత్రికకు సంపాదకులుగా పని చేయవలసిందని కోరారు. అయితే సీతాపతి భారతి సంపాదకులుగా పని చేసింది కేవలం 9 మాసాలు (1940 మార్చినుంచి డిసెంబరు వరకు) మాత్రమే! భారతిలో ఆయన విరమించుకొనడానికి కారణం సినిమా మోజు ఇంకా పూర్తిగా తగ్గక పోవడం కావచ్చు; లేదా శంభుప్రసాద్‌గారి కఠినమైన క్రమశిక్షణలో ఆయన ఇముడలేక పోవడం కావచ్చు!

## విజ్ఞాన సర్వస్వ ప్రధాన సంగ్రాహకుడు :

1948 లో సీతాపతి తెలుగు భాషా సమితిలో ప్రధాన సంగ్రాహకులుగా చేరడానికి ఒకటి రెండేళ్లు ముందుగానే ఆయన సినిమా జీవితం ముగిసి స్వల్పంగా ఆర్థికమైన ఇబ్బందులకు ఆయన లోనయినట్టు కనిపిస్తుంది. ఆ రోజులలోనే జాతీయ జ్ఞాన మందిర్ అధిపతి మాగంటి బాపినీడు సీతాపతి బహుముఖ ప్రజ్ఞను గుర్తించి తాను సంకల్పించిన 'ఆంధ్ర సర్వస్వ' మనే చిన్న విజ్ఞాన కోశం రచనలో ఆయన సేవలను వినియోగించుకున్నారు. ఆంధ్ర సర్వస్వ రచనలో సీతాపతి ప్రదర్శించిన బహుముఖ పాండిత్యమే అటు తరువాత తెలుగు విజ్ఞాన సర్వస్వ నిర్మాణ లక్ష్యంతో తెలుగు భాషా సమితి ఏర్పడగానే దానిలో ప్రధాన సంగ్రాహకులుగా సీతాపతి నియమింప బడడానికి దారి తీసింది.

విజ్ఞాన సర్వస్వ ప్రధాన సంగ్రాహకులుగానేగాక, ఆ విజ్ఞాన సర్వస్వానికి విధాన నిర్ణయ సమితి (**Planning Committee**) లో సభ్యుడుగా కూడా ఉండి, ఆ విజ్ఞాన సర్వస్వానికి ఉపయోగకరమైన ఒక నూతన ప్రణాళికను తయారు చేయడంలోనూ, ఆ ప్రణాళికలో తొలి సంపుటం అయిన 'చరిత్ర - రాజనీతి' సంపుటాన్ని రూపొందించడంలోనూ సీతాపతి ప్రముఖ పాత్ర నిర్వహించారు.

సీతాపతి ప్రధాన సంగ్రహకులుగా ఉన్న కాలంలో తెలుగు భాషా సమితిలో మల్లంపల్లి సోమశేఖరశర్మ, వసంతరావు వేంకట్రావు, మేడేపల్లి వరాహనరసింహ స్వామి వంటి హేమాహేమీలు విజ్ఞాన సర్వస్వంలోని వివిధ సంపుటాలకు సంగ్రాహకులుగా పని చేశారు. ఆ రోజులలోనే సీతాపతి వద్ద సహాయ సంగ్రాహకుడుగా పనిచేస్తూ సర్వ జనాకర్షకమైన ఆయన వ్యక్తిత్వంలోని వివిధ కోణాలను సన్నిహితంగా సందర్శించే అవకాశం ప్రస్తుత గ్రంథ రచయితకు కలిగింది.

1948 నుంచి 1957 లో పదవీ విరమణ చేసే దాకా తెలుగు భాషా సమితిలో విజ్ఞాన సర్వస్వ ప్రధాన సంగ్రాహకుడుగా పని చేసిన ఆ దశాబ్ద కాలం సీతాపతి జీవితంలో ఒక గొప్ప యోగదశ! ఆ కాలంలోనే సాహిత్య అకాడమీ సలహా సంఘ సభ్యుడుగానూ, ఆంధ్రప్రదేశ్ బాల రచయితల వర్క్‌షాప్ డైరెక్టరుగానూ, అనేక డాక్టరేట్ థీసిస్‌లకు పరీక్షకుడుగానూ - ఇంకా అలాంటి అనేక గౌరవ హోదాలతో అనేక విధాలుగా ఆంధ్ర భారతిని సీతాపతి అర్చించారు. సాహిత్య సభలలో ఉపన్యాసాల ద్వారానూ, రేడియో ప్రసంగాల ద్వారానూ, పత్రికలలో వ్యాసాల ద్వారానూ, 'తెలుగులో ఛందోరీతులు', 'ఇంగ్లీషులో తెలుగు సాహిత్య చరిత్ర' వంటి ఉద్గ్రంథాల రచన ద్వారానూ సీతాపతి ఆంధ్ర సాహిత్యానికి ఎనలేని సేవ చేశారు.

1956 లో తెలుగు భాషా సమితికి హైద్రాబాద్‌లోనూ, విశాఖపట్టణంలోనూ శాఖా కార్యాలయాలు ఏర్పడడంతో సీతాపతిని హైద్రాబాద్ కార్యాలయానికీ, ఆయన వద్ద సహాయ సంగ్రాహకుడుగా పని చేస్తున్న ఈ గ్రంథ రచయితను విశాఖపట్టణం కార్యాలయానికీ బదిలీ చేయడం జరిగింది. మద్రాసులో ఈ ఇద్దరూ కలిసి ఉన్న కాలంలోనే సాహిత్య అకాడమీవారికి అఖిల భారత గ్రంథసూచి (**Bibliography**) లో తెలుగు విభాగాన్ని ఈ ఇరువురూ సంకలితం చేసి ఇచ్చారు.

సీతాపతి హైద్రాబాద్ చేరిన తరువాత కొద్ది కాలానికే ఆయనకు బాధిర్యం (చెవుడు) ఎక్కువ కావడం వల్లా, అప్పటికే 72 ఏండ్ల వయస్సు వచ్చి ఆరోగ్యం క్షీణించడం వల్లా 1957 లో ఇచ్ఛికంగానే ఆయన తెలుగు భాషా సమితి నుండి ఉద్యోగ విరమణ చేశారు.

చరిత్ర ఉపన్యాసకుడు గానూ, వ్యావహారిక భాషోద్యమంలో అగ్ర సైనికుడుగానూ, పరిశోధక విద్వాంసుడుగానూ - వివిధ ఉద్యోగాలలో సీతాపతి తెలుగు జాతికి చేసిన సేవ అనల్పమైంది!

# 5

# వ్యావహారిక భాషోద్యమం

అతి వినమ్రమైన లక్ష్యంతో ఆరంభమైన వ్యావహారిక భాషోద్యమం తెలుగు దేశంలో దైవబలంవల్ల చిత్రంగా ఎవ్వరూ ఊహించి ఉండనంత విస్తృతమైన ఫలితాలను సాధించగలిగింది.

విద్యాలయాలలో ప్రాచీన తెలుగు కావ్యాలను బోధించే బోధనా భాషగా ప్రాచీన కావ్య భాషను కాక ఆ నాడు పండితుల వ్యవహారంలో ఉన్న శిష్ట వ్యావహారిక భాషను వాడుక చేయాలనీ, ఆ భాషలోనే విద్యార్థులు ప్రశ్నలకు జవాబులు వ్రాసే అవకాశం కల్పించాలనీ, స్కూలు ఫైనల్, ఇంటర్మీడియెట్ పరీక్షలలో ఇంగ్లీషుకు తెలుగు అనువాదాన్నీ, వ్యాసరచననూ విద్యార్థులు శిష్ట వ్యావహారిక భాషలోనే వ్రాసే అవకాశం ఉండాలనీ మాత్రమే ఆదిలో వ్యావహారిక భాషోద్యమం ప్రతిపాదించింది. సాధారణ వచన రచనలకు శిష్ట వ్యావహారిక భాషను వాడాలని తప్ప సాహిత్య భాషగా శిష్ట వ్యావహారికాన్నే వాడి తీరాలని వా రెన్నడూ పట్టు పట్టలేదు. "జీవద్భాషకు నియామకుడు రచయితే కాని లాక్షణికుడూ, వ్యాకరణ కర్తా కాడు"* అని రామమూర్తి పంతులు గారు స్పష్టం చేశారు.

## వినమ్ర లక్ష్యం :

అయినా రామమూర్తి పంతులు చేసిన ఆ వినమ్రమైన ప్రతిపాదనను కూడా భాషా పరిణామ క్రమ పరిజ్ఞానం లేని ఆ నాటి పండిత భిషక్కులు త్రోసి పుచ్చారు. చిన్నయ సూరి బాల వ్యాకరణం వారికి వేదం. ఆ బాల వ్యాకరణానికి విరుద్ధమైన ప్రయోగాలన్నీ వారి దృష్టిలో 'గ్రామ్యాలు', 'దుష్టాలు', అప్రయోగార్హాలు.

---

* చూ. 'గిడుగు రామమూర్తి జీవితం - ఉద్యమం' - అక్కిరాజు రమాపతి రావు - పేజీ 62.

ఆ పండిత భిషక్కులు రామమూర్తి పంతులుపై ప్రయోగించిన దూషణా స్త్రాలకు ఈ క్రింది పానుగంటి లక్ష్మీ నరసింహారావు గారి వాక్యాలను ఒక మచ్చు తునుకగా మనం గ్రహింపవచ్చును :

"మా తూర్పు సోదరులు ఎన్ని గ్రామ్య భాషా గ్రంథములు వ్రాసినను గ్రాంథిక భాష చెడునది గాదు. రా.సా.గి.రా. పంతులు గారు (రావుసాహెబ్ గిడుగు రామమూర్తి పంతులు గారు) గ్రామ్య రామాయణము వ్రాసిన నేమి? గు. అప్పారావు (గురజాడ అప్పారావు) పంతులుగారు వ్యావహారిక భాషా భారతమును వ్రాసిన నేమి? బు.శే. పంతులు గారు (బుజ్జా శేషగిరిరావు పంతులుగారు) శేష ధర్మములు చెప్పిన నేమి? గ్రాంథిక భాష సంకర పడునా? గిడుగువారి నూతన సంప్రదాయమున వాగనుశాసనుని పురాతన సంప్రదాయము సంహత మగునా? గోలెముల కొలది నుప్పు ద్రిమ్మరించిన గోదావరీ తీర్థము క్షార మగునా? ఇట్టి అశాస్త్రీయ గ్రంథములు భాషలో నెన్ని యున్న నేమగును? వానిని గణించువా రెవ్వరు? తలపెట్టు వా రెవ్వరు? కుక్కమూతి పిందెల వలె, దెయ్యపు కొబ్బెర కాయల వలె భాషా వనమున నవి అచ్చటచ్చట గపులకు, గాకులకు గూడ నుప యోగింప కుండ నుండిన నుండు గాక! కాని వానినే తినవలయు ననియు, నవియే బాలుర కారోగ్యప్రద మనియు, నూతన వస్తు గుణ దీపికను, నూతన వైద్య శాస్త్రమును బనిలేక మా తూర్పు సోదరులు కల్పించి, వానిపై సర్కారు వారి ముద్రను వేయించి, ప్రాణ సంకట మగునట్లు వర్తించిన కారణమున వారితో గ్రాంథికుల మగు మా కింత విధి లేని వాదము సంభవించినది. భాషా పరిరక్షకై మే మింత పాటు పడవలసి వచ్చినది."

పై వ్రాతలో 'సర్కారు వారి ముద్ర వేయించి' అని లక్ష్మీనరసింహా రావు గారు అనడానికి కారణం ఈ సంగ్రామంలో తొలి విజయాన్ని వ్యావహారిక భాషా వాదులే సాధించడం!

## ముణ్ణాళ్ళ ముచ్చట :

1906 లో గంజాం, విశాఖపట్టణం, గోదావరి అనే మూడు జిల్లాలలోని పాఠశాలలకూ పరీక్షాధికారిగా నియమించ బడిన జె.ఏ. యేట్స్‌దొర ప్రతి యేడూ ఉపాధ్యాయ వార్షిక సమావేశాలు ఏర్పాటు చేసి బోధనా పద్ధతులను గూర్చి పెద్దల

చేత ఉపన్యాసా లిప్పించేవాడు. 1907 మొదలు 1910 వరకూ ఆ విధంగా జరిగిన ఉపాధ్యాయ వార్షిక సమావేశాలలో రామమూర్తి పంతులు గారు జీవద్భాష ప్రాశస్త్యాన్ని వివరిస్తూ, పాఠశాలలలో విద్యార్థులకు బోధనా భాషగా శిష్ట వ్యావహారికమే ఎందుకు ఉండాలో అనేక ఉపపత్తులతో నిరూపిస్తూ ప్రసంగించేవారు. 1911 లో సరళ గ్రాంథిక భాషలో వ్రాసిన సెట్టి లక్ష్మీనరసింహం గారి 'గ్రీక్ పురాణ గాథలు' (**Greek Myths**) అనే గ్రంథాన్ని స్కూల్ ఫైనల్‌కు పాఠ్య గ్రంథంగా విద్యాశాఖవారు నిర్ణయించారు.

అలా నిర్ణయించడమే కాకుండా మద్రాసులోని విద్యాశాఖాధికారులు పాఠశాలలలో వాడవలసిన భాషను గూర్చి ఒక జి. ఓ. (నెం. 3098 డి. 20-9-1912) కూడా అన్ని పాఠశాలలకూ పంపించారు. పాఠశాలలలోని విద్యార్థులు వారి పరీక్షాపత్రాలను ఇష్టానుసారం గ్రాంథికాంధ్రం(**Classical Telugu**)లో గాని, ఆధునికాంధ్రం (**Modern Telugu**) లో గాని వ్రాయవచ్చు ననీ, గ్రూప్ ఏ, గ్రూప్ సి.ల విద్యార్థులలో ఎందరు గ్రాంథికాంధ్రంలో, ఎందరు ఆధునికాంధ్రంలో పరీక్షా పత్రాలు వ్రాయ దలచుకున్నదీ విద్యాశాఖాధికారులకు తెలియ చేయవలసిందనీ ఆ జి.ఓ.లో కోరారు. 'ఆధునిక భాష' అంటే ఏమిటో వివరిస్తూ మరొక అనుబంధపు జి ఓ.ను కూడా (నెం. 3479 డి. 29-10-1912) వారు పంపారు. దానిలో 'ఆధునిక తెలుగును' వారు ఇలా నిర్వచించారు.

"ఆధునిక తెలుగు" అంటే 'బ్రౌన్ రీడర్', ఆర్డెన్ వ్రాసిన తెలుగు వ్యాకరణంలో మొదటి భాగం, ఏనుగుల వీరాస్వామయ్య వ్రాసిన 'కాశీయాత్రా చరిత్ర' మొదలైన గ్రంథాలలో వాడిన భాష అని ఈ స్కూలు ఫైనల్‌బోర్డు వారి అభిప్రాయం. ప్రతి స్కూలు గ్రాంథికాంధ్రాన్నో, వ్యావహారికాంధ్రాన్నో దేనినో ఒక భాషనే ఎంచుకోవలసి ఉంటుంది...."

## ఇంటర్మీడియేట్ కాంపోజిషన్ కమిటీ :

ప్రభుత్వం విడుదల చేసిన ఆ జి.ఓ.లను ఉద్దేశించే పానుగంటి లక్ష్మీ నరసింహారావు గారు 'సర్కారు వారి ముద్రవేయించి' అని వ్రాశారు.

ఆ జి.ఓ.లు దేశంలోని గ్రాంథిక భాషావాదులలో గొప్ప సంచలనం కలిగించాయి. ఐచ్ఛికంగా విద్యార్థులు కొందరు శిష్ట వ్యావహారికంలో ప్రశ్న

పత్రాలకు జవాబులు వ్రాయడాన్ని కూడా ఆ నాటి భాషాభిషక్కులు ఆమోదించ లేక పోయారు. ఊరూరా సభలూ,సమావేశాలూ జరిపి మహజర్‌లూ, విజ్ఞాపనలూ, తీర్మానాలూ విద్యాశాఖ వారికి పంపించడం మొదలు పెట్టారు.

చివరకు ప్రభుత్వం వారి ఆదేశాన్ని అనుసరించి మద్రాసు విశ్వవిద్యాలయం వారు 1911 సెప్టెంబరు 8న గ్రాంథిక, వ్యావహారిక భాషా శైలుల వివాదాన్ని పరిశీలించి విద్యార్థులకు ఏ శైలి ఉచితమో నిర్ణయించడానికి ఒక పండిత సంఘాన్ని నియమించారు.

'ఇంటర్మీడియెట్ కాంపొజిషన్ కమిటీ' అనబడే ఆ సంఘానికి అధ్యక్షుడు మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాల అధ్యాపకుడు మాటూరు రంగాచార్యులు. జయంతి రామయ్య, వేదం వేంకటరాయ శాస్త్రి, వావిలికొలను సుబ్బారావు, కొమర్రాజు లక్ష్మణరావులు గ్రాంథిక వాదుల తరపునా, గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావు, బుఱ్ఱా శేషగిరిరావు, పి.టి. శ్రీనివాస అయ్యంగార్లు వ్యావహారికభాషా వాదుల తరపునా ఆ కమిటీలో సభ్యులుగా ఉన్నారు అనేక సమావేశాలు జరిపి, చివరకు ఆ కమిటీ వాడుకలోఉన్నపదాలనూ, క్రియారూపాలనూ, సమాసాలనూ, విభక్తిరూపాలనూ విద్యార్థులు వ్యాస రచనలో ఉపయోగించవచ్చు నని తన నివేదికలో పేర్కొన్నది. వాడుకలో ఉన్న ఎలాంటి పదాలనూ, సమాసాలనూ, క్రియారూపాలనూ, విభక్తులనూ వాడవచ్చునో వివరిస్తూ అలాంటి కొన్ని పదాల పట్టికలను కూడా ఆ నివేదికకు అనుబంధంగా ఆ కమిటీ చేర్చింది.

వ్యావహారిక భాషావాదులు ఆ విధంగా ఆ కమిటీలో విజయం సాధించినా, ఆ విజయం మూణ్ణాళ్ళ ముచ్చటే అయింది. దేశంలో సంప్రదాయాభిమానులూ, సనాతన పండితులూ తీవ్రమైన ఆందోళన లేవదీసి, ఆ నివేదిక పట్ల తమ తీవ్ర అసమ్మతిని తెలియజేశారు. ఆధునిక శిష్ట వ్యావహారిక భాషా శైలి విద్యార్థులకు ఏమాత్రం ఉచితమైంది కాదు అని విద్యాశాఖమీద వారు ఒత్తిడి తెచ్చారు. దేశంలో ధనికులు, పలుకుబడి గల పెద్దలు చాలామంది గ్రాంథిక భాష వైపే మొగ్గు చూపడంతో చివరికి వారి ఒత్తిడికి తలఒగ్గి వ్యావహారికభాష వాడడానికి అనుమతి నిస్తూ లోగడ తాము చేసిన జి.ఓ.ను ఉపసంహరించుకుంటూ 1914 లో విద్యాశాఖవారు మరొక జి.ఓ.ను జారీ చేయవలసివచ్చింది.

1914 లో ఆ జి.ఓ.తో గ్రాంథిక భాషా వాదులు తమ విజయ కేతనం ఎగురవేశారు. ప్రభుత్వానికి తమ కృతజ్ఞతలు తెలుపుకున్నారు. పానుగంటి లక్ష్మీ నరసింహారావు వంటి హాస్యరచయితలు ఆ జి. ఓ. కు "రామమూర్తీ! ఇంక నీవు నీ గంజాం జిల్లాకు Go (వెళ్లు)" అని అర్థం అంటూ రామమూర్తి పంతులు గారిని పరిహాసం చేశారు.

## సంపూర్ణ విజయం :

విద్యాలయాలలో శిష్ట వ్యావహారికాన్ని బోధనా భాషగా చేయాలనే రామ మూర్తి పంతులు గారి ప్రధాన లక్ష్యం ఆయన జీవిత కాలంలో నెరవేరనే లేదు.

మరొక వారం రోజులలో ఆయన దేహ యాత్ర చాలిస్తా రనగా 1940 జనవరి 15 వ తేదీ సాయంత్రం 5 గంటలకు మద్రాసులోని 'ప్రజా మిత్ర' కార్యాలయంలో సుమారు 100 మంది పత్రికా రచయితలను సమావేశ పరచి రామమూర్తి పంతులు గారు తమ కడపటి సందేశం వారికి అందచేశారు. తాపీ ధర్మారావు, న్యాయపతి నారాయణమూర్తి వంటి సుప్రసిద్ధ పత్రికా సంపాదకులు ఆ సభకు హాజరయారు. ఆ సభలో విశ్వవిద్యాలయాల వారి చేత వ్యావహారిక భాషను అంగీకరింప చేసే బాధ్యతను వారు పత్రికా ప్రతినిధులకు ఒప్పు చెప్పారు. హీన స్వరంతో సుమారు 2 గంటలపాటు ఆయన ఆ సభలో ప్రసంగించి తాను ప్రారంభించిన ఉద్యమ సంపూర్ణ సాఫల్యాన్ని తన జీవిత కాలంలో తాను చూడ లేక పోతున్నందుకు పరితాపాన్ని వ్యక్తం చేశారు. ఆ సభకు హాజరైన ప్రముఖ సంపాదకులు వ్యావహారిక భాషావాద లక్ష్యాన్ని నూటికి నూరు పాళ్లూ సఫలం అయేట్టు చూడడానికి తమ సర్వ శక్తులనూ వినియోగించి కృషి చేస్తామని ఆ సభలో శపథం చేశారు.

అయినా - మరి 30 ఏళ్ళ తరువాత, 1973 నాటికి గాని తెలుగు బోధించే అన్ని విశ్వవిద్యాలయాలూ వ్యావహారిక భాషను ఆమోదించడం, రామమూర్తి పంతులు గారి లక్ష్యం సంపూర్ణంగా నెరవేరడం జరుగలేదు.

క్రమంగా ఒక విశ్వవిద్యాలయం తరువాత మరొక విశ్వవిద్యాలయం ఎలా వ్యావహారిక భాషను ఆమోదించడం జరిగిందో 'గిడుగు రామమూర్తి (జీవిత చరిత్ర)' వ్రాసిన ఆయన మనుమడు జి.వి. రామమూర్తి ఇలా వర్ణించారు :

"1955 లోనే మద్రాసు యూనివర్శిటీ తెలుగు బోర్డు ఆఫ్ స్టడీస్ వారు వ్యావహారిక భాషా పద ప్రయోగాలను అంగీకరించినా, 1965 వరకూ ఆంధ్ర ప్రదేశ్‌లోని యూనివర్సిటీల వారు ఈ విషయాన్ని చర్చించనైనా లేదు. ఆ సంవత్సరంలో యూనివర్సిటీ పాఠ్య గ్రంథాలలోని శైలి విషయం చర్చకు వచ్చినపుడు భద్రిరాజు కృష్ణమూర్తిగారు వ్యావహారిక భాషే అనుసరణీయ మని పట్టుపట్టారు. ఈ విషయంలో ఏకాభిప్రాయం కోసం పింగళి లక్ష్మీకాంతంగారి అధ్యక్షతను ఒక సమావేశం జరిగింది. ఆ తర్వాత వారి అధ్యక్షతనే ఒక స్టయిల్ కమిటీ ఏర్పడింది. ఈ కమిటీ తీర్మానాల దృష్ట్యా ప్రభుత్వం గ్విన్ గారి అధ్యక్షతను మరొక కమిటీని నెలకొల్పింది. ఈ కమిటీ సూచనల ననుసరించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 'తెలుగు అకాడమీ'ని 1969 లో స్థాపించింది. ఈ సంస్థ వారు ఇంటర్‌మీడియెట్, బి.ఏ. తరగతుల వివిధ సాంకేతిక విషయాల పాఠ్య పుస్తకాలను వ్యావహారిక భాషలోనే ప్రచురిస్తున్నారు. పిహెచ్.డి. చేసే విద్యార్థులు తమ పరిశోధన వ్యాసాలను వ్యావహారికంలోనే వ్రాయడానికి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారు 1969 లో అనుమతించారు. 1973 లో ఆంధ్రా యూనివర్సిటీ వారు వ్యావహారిక భాషను ఆమోదించారు. 1911 లో రామమూర్తి పంతులుగారు ప్రారంభించిన వ్యావహారిక భాషా ఉద్యమం 1973 నాటికి సంపూర్ణంగా ఫలవంతమైనది". (పుట 65)

వ్యావహారిక భాషను ఆమోదించే విషయంలో ఆ విధంగా చిత్రంగా తెలుగు దేశంలోని విశ్వవిద్యాలయాలకు 1955 లో మద్రాసు విశ్వవిద్యాలయం ఒరవడి పెట్టవలసివచ్చింది.

విశ్వవిద్యాలయాలు వాడుక భాషను ఆమోదించడం ఆలస్యమైనా, దేశ వ్యాప్తంగా ఝంఝా మారుతం లాగ గిడుగు రామమూర్తి పంతులు కొనసాగించిన ఉద్యమ ఫలితంగా అంతకు కొన్ని దశాబ్దాల ముందే పత్రికలూ, రేడియోలూ, సినిమాలూ వ్యావహారిక భాషను ఆమోదించాయి. అంతేకాదు. పంతులుగారిచేత ఉత్తేజితులైన మహా రచయితలు కొందరు వాడుక భాషలో ఉద్గ్రంథాలు రచించి సాహిత్య భాషగానూ, కవిత్వ భాషగానూ కూడా గ్రాంథిక భాషకంటె వ్యావహారిక భాషే మరింత పటిష్ఠమైన దని రుజువు చేశారు.

గురజాడ అప్పారావుగారు కన్యాశుల్కంలో శిష్ట వ్యావహారికాన్ని కాకుండా విజయనగర జిల్లా మాండలిక భాషనూ, అక్కడి వివిధ సాంఘిక వర్గాల వారి భాషలనూ కూడా వాడి ఆ వ్యావహారిక భాషా రూపాలతో ఎంత గొప్ప రూపకం రచించవచ్చునో స్పష్టం చేశారు. ముత్యాల సరాలు, నీలగిరి పాటలు వంటి రచనల ద్వారా కవిత్వ భాషగా కూడా శిష్ట వ్యావహారికానికి గల శక్తిని నిరూపించారు. నండూరి సుబ్బారావుగారు సాంఘికంగా దిగువ తరగతుల వారు మాట్లాడే గ్రామీణ భాషలో 'ఎంకి పాటలు' వ్రాసి ఆ భాషలో కూడా సంస్కృతంలోని జయదేవుని గీతగోవిందంతో సమానమైన ఉదాత్త ప్రణయ కావ్యాన్ని ఎలా రచించవచ్చునో ప్రత్యక్షంగా ప్రదర్శించారు. ఇక నవ్య సాహిత్య పరిషత్ ప్రముఖ సభ్యులు శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రి. చింతా దీక్షితులు, విశ్వనాథ సత్యనారాయణ ('మా బాబు' వంటి నవలలలో) వంటి వారు శిష్ట వ్యావహారికంలో కథలూ, నవలలూ ఎంత రసవంతంగా రచించ వచ్చునో నిరూపించారు. గురజాడ అప్పారావుగారేగాక మాధవపెద్ది గోఖలే, పోరంకి దక్షిణామూర్తి వంటి వారు కూడా మాండలిక భాషలలో కథలూ, నవలలూ వ్రాసి వాటికి సాహిత్య భాషా గౌరవం చేకూర్చారు.

పూర్వం సంస్కృతపు మాటలూ, తెలుగు మాటలూ గుదిగుచ్చి మణి ప్రవాళ రచనల వంటివి చేసినట్టు, ఆధునిక కాలంలో ఇంగ్లీషు మాటలూ, తెలుగు మాటలూ కలిపి మణిప్రవాళ శైలిలో మనోహరమైన రచనలు చేయడంలో గుడిపాటి వేంకటాచలం, శ్రీశ్రీ, బి. వి. సింగరాచార్య వంటి వారు ప్రయోగాలు చేశారు.

ఆ విధంగా విద్యాలయాలలో బోధనా భాష కావడానికి ముందే వ్యావహారిక భాష తెలుగులో సాహిత్య భాషగా స్థిరపడింది.

## ఉద్యమ క్రమ వికాసం :

వ్యావహారిక భాషోద్యమం 1907 లోనే ప్రారంభమైనా, 1910 నాటికి గాని దాని కొక స్పష్టమైన రూపం ఏర్పడ లేదు. 1911 లో రామమూర్తి గారు లెక్చరరుగా రిటైరయిన తరువాత అది మరింత తీవ్ర రూపం దాల్చింది.

గ్రాంథిక భాషావాదుల చేత వచన రచనకు వ్యావహారిక భాషను వాడడం ఉచిత మని ఒప్పించడానికి రామమూర్తి పంతులుగారు రెండు విధాలైన ఉపపత్తులను సేకరించారు. ఒకటి: పూర్వకాలంలో కూడా కావ్యాలలో తప్ప

ఆ నాటి కవులూ, పండితులూ టీకలూ, టిప్పణులూ, వ్యాఖ్యానాలూ, శాసనాలూ మొదలైన వాటిలో ఆ నాటి తమ వ్యావహారిక భాషనే వాడుక చేశారని నిరూపించడం. అందుకోసం ఆయన ఎన్నెన్నో తాళపత్ర గ్రంథాలను పరిశీలించి సాక్ష్యాధారాలను సేకరించారు. వాటినే బాలకవి శరణ్యం, గద్యచింతామణి వంటి గ్రంథాలలో ప్రచురించారు.

రెండు : చిన్నయ సూరి వ్యాకరణానికి అనుగుణంగా రచన చేస్తున్నామని చెప్పుకునే పండితులూ, కవులూ కూడా ఆ భాష తమకు సహజమైంది కానందువల్ల ఎన్నెన్ని లక్షణ విరుద్ధమైన ప్రయోగాలు చేస్తున్నదీ ఎత్తి చూపించడం తిరుపతి వేంకట కవులు 'రెండు బాసలకు మేమె కవీంద్రుల మంచు' ప్రగల్భంగా చెప్పుకున్న ఈ క్రింది పద్యంలోనే ఆయన ఒక వ్యాకరణ దోషం చూపించారు :

ఉ. దోస మటంచెరింగియును దుందుడుకొప్పగ పెంచినార మీ
మీసలు రెండు బాసలకు మేమె కవీంద్రుల మంచు తెల్పగా
రోసము కల్గినన్ కవి వరుల్ మము గెల్వుడు; గెల్చిరేని ఈ
మీసలు తీసి మీ పద సమీపమునన్ తల వంచి మ్రొక్కమే ?

ఈ పద్యంలో 'కవి వరులు మమ్ము గెల్వుడు' అని మధ్యమ పురుష క్రియ వాడి, 'గెల్చితిరేని' అని ఆ తరువాత కూడా మధ్యమ పురుష క్రియనే వాడటానికి బదులుగా 'గెల్చిరేని' అని ప్రథమ పురుష క్రియను వాడటం దోషం కాదా అని ఆయన నిగ్గదీశారు

ఒక్క తిరుపతి వేంకటకవుల రచనలలోనే కాదు. ఆ నాటి కొమ్ములు తిరిగిన పండితులైన వేదం వేంకటరాయ శాస్త్రి వంటి ఉద్దండుల రచనలలో కూడా వ్యాకరణ దోషాలు ఆయన ఎత్తి చూపించారు.

తాను సేకరించిన సాక్ష్యాధారాలనూ, తాళపత్ర గ్రంథాలనూ వెంట తీసుకొని వెళ్ళి తెలుగు దేశంలోని అన్ని ముఖ్యనగరాలూ సందర్శించి, అక్కడి విద్యాలయాల లోని పండితులనూ, ఇతర పండితులనూ కలుసుకొని మన పూర్వులు వ్యావహారిక భాషను నిరసించలేదని సాక్ష్యాధారాలు చూపిస్తూ వారితో చర్చించేవారు. చర్చానంతరం వారి అభిప్రాయాలను లిఖిత పూర్వకంగా

వ్రాయించి తీసుకునేవారు. అలా సేకరించిన వారి అభిప్రాయాలను తాను పర్లాకిమిడినుంచి ఒక్క సంవత్సరం పాటు మాత్రమే నడిపిన 'తెలుగు పత్రిక'లో ప్రచురించే వారు. కొందరు పండితులచే లక్షణ విరుద్ధ మని నిరసించ బడుతున్న 'వాడి, వాణ్ణి, వాండ్లు, నుంచి, కోసం, రోజుకు, వాటికి, కొద్ది, చేస్తాను, చేసేను, చేతును, చేస్తిని' మొదలైన రూపాలు పదే పదే తాళపత్ర గ్రంథాలలో కనబడు తున్నా యని ఒప్పుకుంటూ ఆయనకు ఆ పండితులు వ్రాసి ఇచ్చారు.

1915 మార్చి నెలలో కాకినాడలో రామమూర్తి పంతులు గారు అలా కలుసుకుని చర్చించిన కవి పండితులలో దివాకర్ల తిరుపతి శాస్త్రి కూడా ఒకరు. ఆయనతో సహా ఆ పండితు లందరూ సంతకాలు చేసి ఇచ్చిన అభిప్రాయం ఇలా ఉంది :

"కావ్య గౌరవమున కర్హము గాని బడి పిల్లల వ్రాతలలో కావ్య నియమము లుండి తీరవలయు ననుట సంప్రదాయ విరుద్ధము. కావ్య గౌరవమునకు బాత్రమగు పట్ల కావ్య నియమము లవశ్యముగ బాటింపబడవలయును. కనుకనే విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి వారు సైతము స్వాతంత్ర్యమును కొంతవర కుపయోగించిరి. జీవ శాస్త్రము మొదలగునవి వ్రాయు నెడ వారును కొన్ని వ్యావహారిక రూపముల గ్రహించుటయే గాక వ్యాకరణ నియమములను చాల వర కుపేక్షించిరి. ఇది విషయానుసార మగుటచే నుచితమే! ఇట్టి స్వాతంత్ర్యమును కాలేజ్ విద్యార్థులలో వలయు వారి కిచ్చుట వలన నేమియు లోపము సంభవింప కుండుటయే గాక సంప్రదాయ ప్రవాహము ననుసరింప నిచ్చుట యని దృఢముగ నమ్ముచున్నాము."

1916 లో ఒకసారి రామమూర్తి పంతులుగారు కొవ్వూరులో ఒక సభలో ప్రసంగిస్తూ ఉండగా ఏదో పని మీద కొవ్వూరు వచ్చిన వీరేశలింగం పంతులు గారు దూరంగా నిలబడి ఆ ప్రసంగం వినడం సంభవించింది. ఆ తరువాత ఆయన తన మిత్రులతో ఇలా అన్నారట : "రామమూర్తి పంతులు వాదంలో సత్యం లేకపోలేదు. ప్రాచీన లక్షణానికి విరుద్ధమైన ప్రయోగాలు కొన్ని లోకంలో వాడుకలోకి వచ్చాయి. వాటిలో కొన్నిటిని లోకాన్ని చూసి కవులును ప్రయోగించారు. అవి తప్పులు అనుటకంటె ఒప్పులుగానే గ్రహించి లక్షణం సవరించు

కోవాలి. అయితే రామమూర్తి పంతులు అంతటితో తృప్తిపడక, కవులకున్నూ లోకమే ప్రమాణం కనుక కవులు ప్రయోగించినా ప్రయోగించకపోయినా, వాడుక భాష అంతా గ్రంథ రచనకు అర్హమైనదే అని వాదిస్తున్నాడు. అది ఎంతవరకు సమంజసమా అని ఆలోచిస్తున్నాను."

ఆ సంగతి తెలిసి రామమూర్తి పంతులు గారు వెళ్ళి వీరేశలింగంగారిని కలుసుకున్నారు. ఆయన సందేహాలన్నీ తీర్చారు. తత్ఫలితంగా 28-2-1919 వ తేదీన రాజమండ్రిలో వీరేశలింగం పంతులు గారు అధ్యక్షులుగానూ, గిడుగు రామమూర్తిగారూ, జయంతి గంగన్నగారూ కార్యదర్శులుగానూ 'వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజం' ఏర్పడింది. ఆ సమాజం లక్ష్యాలలో ముఖ్యమైనవి: 1. వ్యావహారిక భాషకూ, గ్రాంథికభాషకూ మధ్య ఉన్న వ్యత్యాసాన్ని సాధ్యమైనంతవరకూ తగ్గించి భాషను సులభం చేయడం, 2. జ్ఞానాభివృద్ధి కోసం వ్రాసే గ్రంథాలలో సాధ్యమైనంత వరకూ వ్యవహారంలో ఉన్న రూపాలే ఉపయోగించి వ్యవహారంలో లేని వాటిని విడిచిపెట్టటం.

కాని, దురదృష్టవశాత్తు ఆ తరువాత 3 నెలలకే వీరేశలింగం పంతులుగారు పరమపదించడంతో ఆ సమాజం ఉపయోగకరమైన ఎలాంటి కార్యక్రమాన్నీ అమలు పరచలేక పోయింది.

## ఉద్యమ కాలంలో వెలువడిన గ్రంథాలు :

వ్యావహారిక భాషోద్యమం సాధించిన ఒక సత్ఫలితం ఆ నాటి పండితులూ, కవులూ, రచయితలూ - అటు గ్రాంథిక భాషా వాదానికి చెందిన వారైనా, ఇటు వ్యావహారిక భాషా వాదానికి చెందిన వారైనా తెలుగు భాషను గురించీ, తెలుగు భాష భవిష్యత్తును గురించీ తీవ్రంగా ఆలోచించేట్టు చేయడం. ఆ నాటి తీవ్రమైన, ఆవేశ పూరితమైన చర్చల ఫలితంగా గ్రాంథిక భాషావాదుల వర్గం నుంచీ, వ్యావహారిక భాషావాదుల వర్గం నుంచీ కూడా తెలుగు భాష స్వరూప స్వభావాల మీద వెలుగును ప్రసరించే ఎన్నో మంచి రచనలు వెలువడ్డాయి. వాటిలో కొన్ని:

## గ్రాంథికవాదులు వ్రాసినవి :

1. ఏ డిఫెన్స్ ఆఫ్ లిటరరీ తెలుగు - జయంతి రామయ్య పంతులుగారు ప్రకటించిన కరపత్రం (1912)
2. మెమొరాండం ఆన్ తెలుగు ప్రోజ్ - కొమర్రాజు లక్ష్మణరావుగారు మద్రాసు యూనివర్సిటీకి సమర్పించిన పత్రం.
3. అంపగమి - మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారి విమర్శ. ఇది గిడుగు రామమూర్తి పంతులుగారి 'ప్రౌఁడెనుఁగు కమ్మ'కు సమాధానంగా వ్రాసిన రచన.
4. ఏ నోట్ ఆన్ ది కంపైలేషన్ ఆఫ్ ఏ కాంప్రెహెన్సివ్ ఎటిమలాజికల్ డిక్షనరీ ఆఫ్ ది తెలుగు లాంగ్వేజ్ - జయంతి రామయ్య పంతులుగారు 'సూర్యరాయాంధ్ర నిఘంటు' రచనకు ఒక ప్రణాళికను సూచిస్తూ వ్రాసిన కరపత్రం.
5. ఆధునిక వచన రచనా విమర్శనం - వావిలికొలను సుబ్బారావు, మొదలైనవి.

## వ్యావహారిక భాషావాదులు వ్రాసినవి :

1. గ్రీక్ పురాణ కథలు - సెట్టి నక్ష్మీనరసింహం రచన; సరళ గ్రాంథికంలో వ్రాయబడి స్కూల్ ఫైనల్‌కి పాఠ్యగ్రంథం అయిన ఈ రచన గ్రాంథిక భాషావాదుల తీవ్ర ఆగ్రహానికి గురి అయింది.
2. బీజగణితము - పి.టి. శ్రీనివాస అయ్యంగార్; వ్యావహారిక భాషలో వ్రాసిన పాఠ్యగ్రంథం.
3. విధి లేక వైద్యుఁడు - వేదం వేంకటాచలయ్య వ్రాసిన వ్యావహారిక రచన.
4. లైఫ్ ఆర్ డెత్ - ఏ ప్లీ ఫర్ వెర్నాక్యులర్స్ - పి.టి. శ్రీనివాస అయ్యం గారి ఆంగ్ల వ్యాసం.
5. మెమొరాండమ్ ఆన్ మోడర్న్ తెలుగు - గిడుగు రామమూర్తి పంతులు గారు 1912 లో ప్రభుత్వానికి అందచేసిన పత్రం. 1913 లో దానిని పుస్తక రూపంలో ప్రచురించి పండితులకు పంచిపెట్టారు. జయంతి రామయ్య

పంతులు గారి 'ఏ డిఫెన్స్ ఆప్ లిటరరీ తెలుగు' దీనికి సమాధానంగా వెలువడినదే!

6. 'ది మినిట్ ఆప్ డిసెంట్' - గురజాడ అప్పారావు గారు యూనివర్శిటీ వారి నిర్ణయం పట్ల అసమ్మతి తెలియచేస్తూ వ్రాసిన ఇంగ్లీషు వ్యాసం. కొమర్రాజు లక్ష్మణరావు గారు వ్రాసిన మెమొరాండం ఆన్ తెలుగు ప్రోజ్ దీనికి సమాధానంగా వ్రాసినదే!

7. నిజమైన సంప్రదాయం - గిడుగు రామమూర్తి పంతులు గారి రచన (1914).

8. ఆంధ్రభాషా సంస్కరణ - తాతా సుబ్బరాయశాస్త్రి, గారు. దీనిలో ఆధునిక శిష్ట ప్రయోగాలను అనుసరించి తెలుగు వ్యాకరణాలను సంస్కరించాలని ఆయన సూచించారు.

9. ఆంధ్ర భాష - వఝల చిన సీతారామశాస్త్రి వ్యావహారిక భాషను సమర్థిస్తూ వ్రాసిన వ్యాసం.

10. ప్రాఁదెనుఁగు కమ్మ - తనకు గ్రాంథిక భాష రాదనే వారికి జవాబుగా రామమూర్తి పంతులు గారు అతి ప్రాచీనమైన తెలుగులో వ్రాసిన రచన. 1914 లో ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రికలో ప్రచురించబడింది.

11. కళింగదేశ చరిత్ర - గురజాడ అప్పారావు రచన. విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి గ్రాంథిక భాషలో లేదనే కారణంవల్ల ఈ రచనను ప్రచురించడానికి నిరాకరించింది.

12. విమర్శాదర్శం - బుజ్జా శేషగిరిరావు చేసిన వ్యావహారిక రచన మొదలైనవి.

## తండ్రీ కొడుకులు :

ఇంత వరకు మనం చెప్పుకున్న వ్యావహారిక భాషోద్యమ కథకు నాయకుడు గిడుగు రామమూర్తి పంతులు గారే అయినా, ఉపనాయకునిగా సీతాపతిని మనం గ్రహించవలసి ఉంటుంది. అతి తీవ్రంగా సాగిన ఆ వ్యావహారిక భాషా సంగ్రామంలో ప్రధాన సేనాని రామమూర్తి పంతులు గారే అయినా యుద్ధానికి అవసరమైన మందుగుండు సామగ్రిని సరఫరా చేయడంలోనూ, వ్యూహ రచనా

ప్రణాళికలను సిద్ధం చేయడంలోనూ సీతాపతి తండ్రికి ఎంత ఎక్కువగా తోడ్పడ్డారో స్పష్టంగా నిర్ణయించి చెప్పేందుకు తగిన సాక్ష్యాధారాలు మనకు లేవు. "1911 నుంచి 1936 వరకు వీరిద్దరూ (రామమూర్తి, సీతాపతి గార్లు) తండ్రీ కొడుకుల లాగ కాకుండా జంట పండితులలాగ కృషి చేశారు." (పుట-20) అన్నారు 'గిడుగు రామమూర్తి జీవితచరిత్ర' రచయిత జి. వి. రామమూర్తి.

1911 లోనే సీతాపతి పర్లాకిమిడి కాలేజ్ లెక్చరర్ అయినా, కళాశాలలో గ్రీక్, రోమన్ చరిత్రలు బోధించడానికి ఇంటి దగ్గర శ్రద్ధగా కృషి చేయవలసి రావడంవల్ల 1914 వరకూ తన తండ్రిగారి సవర భాషా కృషిలో గాని, వ్యావహారిక భాషావాదంలో గాని ఎక్కువగా పాల్గొనలేక పోయినట్లు ఆయన తన స్వీయచరిత్ర (పుట-28) లో చెప్పుకున్నారు.

1913 లో విజయనగరం కళాశాలలో జరిగిన ఒక సభలో "మీ వ్యావహారిక భాషలో గేయాలు వ్రాసుకో వలసిందే గాని, వృత్తాలు వ్రాయగలమా?" అని రామమూర్తి పంతులు గారిని ఒకరు ప్రశ్నించారు. ఆ నాడు తరచు వ్యక్తమవుతున్న అలాంటి ప్రశ్నలకు జవాబుగా సీతాపతి అంతకు ముందే 'సరస్వతీ విలాపం' అని 20 పంక్తులతో కూడిన ఒక శార్దూల విక్రీడిత మాలిక వ్రాసి ఉండడంవల్ల దానిని ఆయన ఆ సభలో చదివి వినిపించారు. ఆ మాలికలో ఆయన వృత్త లక్షణాన్ని పూర్తిగా పాటించినా యతి ప్రాసలను మాత్రం పాటించలేదు. అటు తరువాత యతి ప్రాసలను కూడా పాటిస్తూ 'స్త' ప్రాసతో వ్యావహారిక భాషలో సెట్టి లక్ష్మీనరసింహం మరొక మాలిక వ్రాసి ప్రకటించారు.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి వజ్రాయుధం అనే పత్రికను రాజమండ్రి నుంచి నడుపుతూ ఒక సంచికలో 'కాలఁదికి కొద్దియగు - గ్రామ్యభాషా విజృంభణము' అనే వాక్యాన్ని వజ్రాయుధం బొమ్మక్రింద ప్రకటించారు. ఆ సంచిక చూడగానే సీతాపతి ఆ రాత్రికి రాత్రి మాత్రా ఛందస్సులో 'కొద్ది మొట్టి' అని 24 పద్యాలు వ్రాసి ఆ రాజమండ్రినుంచే వెలువడుతున్న మరొక పత్రికలో ప్రకటించారు. ఆ పద్యాలలో 'కొద్ది' అనే ప్రయోగం రంగనాథ రామాయణం కాలం నుంచి నేటి వరకూ ఏ యే కవులు చేశారో సప్రమాణంగా ఆయన వివరించారు. ఆ పద్యాలలో ప్రతి పద్యం చివరా 'ఎవడికై రా నన్ను చంపుటకు'?

అని వస్తుంది. 'కై' అంటే కవి, 'రా' అంటే రాజు. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి 'కవిరాజ' బిరుదాంచితుడు.

వ్యావహారిక భాషోద్యమ సంగ్రామం నాటి ఆ హోరులో సీతాపతి పేరు ఎక్కువగా వినిపించక పోయినా, తండ్రికి లభించిన విజయంలోనూ, గౌరవం లోనూ కొంతభాగానికైనా నిస్సందేహంగా ఆయన వారసుడు!

## నిఘంటువు - వ్యాకరణం :

వ్యావహారిక భాషావాదం వల్ల తమ గ్రాంథిక భాషకు ఎక్కడ ముప్పు వాటిల్లుతుందో అనే భయంతో గ్రాంథిక భాషావాదులు తమ సర్వ శక్తులూ కేంద్రీకరించుకుని గ్రాంథిక భాషను సంరక్షించుకోడానికి ఒక బృహత్ ప్రణాళి కను సన్నద్ధం చేసుకున్నారు. కాకినాడలో ఆంధ్ర సాహిత్య పరిషత్తు స్థాపించు కున్నారు. దాని తరపున సాహిత్య పరిషత్ పత్రిక అనే ఒక మాస పత్రికను ప్రచురింప సాగారు. గ్రాంథిక భాషకు బహుజనపల్లి సీతారామాచార్యులు గారి శబ్ద రత్నాకరం సమగ్ర నిఘంటువు కాదని 1916 లో బహు సంపుటాలతో కూడిన ఒక బృహన్నిఘంటువును తయారు చేయించడానికి పూనుకున్నారు. అదే సూర్య రాయాంధ్ర నిఘంటువు. ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక ప్రచురణ సుమారు 50 ఏళ్ళ పాటు నిరాఘాటంగా కొనసాగింది.

గ్రాంథిక భాషా వాదులకు ప్రతిభటంగా వ్యావహారిక భాషా వాదులు కూడా ఒక పత్రిక నడపడం, నవ్యాంధ్ర వ్యాకరణం ఒకటి వ్రాయించడం, బ్రౌన్ నిఘంటువు పద్ధతిలో వ్యవహారంలోని పదాల అర్థచ్ఛాయ లన్నింటినీ సప్రయోగంగా వివరిస్తూ, వ్యుత్పత్తినీ, అర్థ విపరిణామాన్నీ సూచిస్తూ ఒక బృహన్నవాంధ్ర నిఘంటువు నిర్మించుకోడం అత్యవసర మని గుర్తించక పోలేదు.

కాని, గ్రాంథిక భాషా వాదులకు ఉన్న అంగబలం గాని, అర్థబలం గాని వ్యావహారిక భాషావాదులు కొరవడడంవల్ల రామమూర్తి పంతులుగారు పర్లాకిమిడిలో ఆరంభించిన 'తెలుగు పత్రిక' ఏడాది కంటె ఎక్కువ కాలం నడవలేదు.

ఒక నవ్యాంధ్ర వ్యాకరణం, నవ్యాంధ్ర బృహన్నిఘంటువు వ్రాయడానికి అవసరమైన వివరాలు, ప్రయోగాలు అన్నీ సేకరించి పెట్టుకున్నా, నిరంతర

వాదోపవాదాలలో చిక్కుకోడంవల్ల రామమూర్తి పంతులుగారికి ఆ మహాకార్యాలు నిర్వహించే స్వాస్థ్యం చిక్కలేదు.

వీరేశలింగం పంతులుగారు 'నవ్యాంధ్ర వ్యాకరణం' అనే పేరుతో ఒక విపులమైన వ్యాకరణం వ్రాయడానికి పూనుకోగా, రామమూర్తి పంతులుగారు తాము సేకరించిన ప్రయోగ సంచయాలనూ, సామగ్రినీ ఆయనకు ఇచ్చివేశారు. కాని, ఆ తరువాత కొన్ని నెలలకే వీరేశలింగంగారు పరమపదించడంతో ఆ వ్యాకరణం వెలుగు చూడలేదు. తాము సేకరించిన ప్రయోగ సంచయమంతా రామమూర్తిగారు వీరేశలింగం పతులుగారికి ధారా దత్తం చేసే సందర్భంలో సీతాపతి తమ తండ్రితో "పోనీ! ఆ ప్రయోగాలు ఆధారంగా మనమే ఒక నవ్యాంధ్ర వ్యాకరణాన్నీ, ఒక నవ్యాంధ్ర బృహన్నిఘంటువునీ తయారు చేయకూడదా?" అన్నారట!

దానికి రామమూర్తి గారు చాలా బాధతో "నేను వ్రాస్తే ఎవడో గ్రామ్యాచార్యుడు గ్రామీణులకోసం, గ్రామ్యవాదం కోసం వ్రాశా డంటారు. దానికి దేశంలో ప్రామాణ్యం రాదు. వీరేశలింగం గారే అందుకు తగిన వారు!" అంటూ కంట నీరు పెట్టుకున్నారట!

సుకుమార హృదయుడైన రామమూర్తి గారి హృదయాన్ని ఆ నాటి పండితులు తమ సూటి పోటి మాటలతో ఎంతగా గాయపరచారో, ఆయనలో ఎంతటి ఆత్మన్యూనతా భావాన్ని కలిగించారో ఈ మాటలవల్ల మనకు అర్థం అవుతుంది.

తండ్రి మరణానంతరం కుమారుడు సీతాపతి అయినా ఆ రెండు ఘనకార్యాలనూ పూర్తి చేయడానికి అవసరమైన స్తిమితంగాని, ఆర్థిక స్వాస్థ్యం గాని ఆయనకు చేకూరక పోవడం ఆంధ్రజాతి దురదృష్టం!

# 6

# సవర భాషా సేవ

వ్యావహారిక భాషోద్యమంలో లాగ కాకుండా సవర భాషా సేవ విషయంలో సీతాపతి చేసిన సేవ విడిగా, ప్రత్యేకంగా కనిపిస్తుంది. కొన్ని సవర పాటలకు ఆయన చేసిన ఇంగ్లీషు, తెలుగు అనువాదాలు బాగా ప్రచారం పొందాయి. ఇటీవల ఈ రచయిత కలుసుకున్న కళా ప్రపూర్ణ అవసరాల అనసూయా దేవి సీతాపతి సవర పాటలకు చేసిన తెలుగు అనువాదాలను స్వర పరచి వివిధ స్థలాలలో తాను గానం చేసినట్లు చెప్పారు. బైబిల్ లోని కొన్ని గాస్పెల్‌లను సీతాపతి సవర్ల భాషలోకి అనువాదం చేయడాన్ని గురించీ, ఫెలో షిప్ మీద ఆయన ఆంధ్ర విశ్వ విద్యాలయంలో సవర భాషను గూర్చి పరిశోధన చేయడాన్ని గురించీ క్రిందటి అధ్యాయాలలో తెలుసుకున్నాం.

తన భార్య పెట్రేషియా డొన్నెగన్‌తో కలసి సవర భాషను గూర్చి విశిష్టమైన పరిశోధన కొనసాగిస్తున్న ప్రొఫెసర్ డేవిడ్ స్టాంప్ 'మరోసారి గిడుగు రామమూర్తి' గ్రంథం సంపాదకులు డా॥ చేకూరి రామారావుకు వ్రాసిన లేఖలో సీతాపతిగారు వ్రాసిన 'ది సోరాస్ అండ్ దెయిర్ కంట్రీ' (సవరలు - వారి నివాస స్థలాలు), 'సోరా సాంగ్స్ అండ్ పొయెట్రీ' (సవర పాటలు - పద్యాలు), 'సోరా మ్యూజికల్ ఇన్‌స్ట్రుమెంట్స్' (సవరల సంగీత వాద్యం) వంటి కొన్ని ఆంగ్ల వ్యాసాలను గూర్చి ప్రస్తావించారు. వీటిలో మొదటిది 'జర్నల్ ఆఫ్ ది ఆంధ్రా హిస్టారికల్ రీసెర్చి సొసైటీ' (సంపుటాలు XII-XIV; 1938-43) లోనూ, మూడవది పారిస్ నుంచి వెలువడే ఒక సంగీత పత్రిక (1933) లోనూ ప్రకటించబడినట్లు ఆయన పేర్కొన్నారు. రెండవది పుస్తక రూపంగానే వెలువడింది.

1966 లో అమెరికాలోని విస్కాన్‌సిన్ విశ్వ విద్యాలయం నుంచి సవర భాషలోని వాక్య నిర్మాణాన్ని గురించి పరిశోధన చేయడానికి సవర ప్రాంతాలకు

వచ్చిన క్లాస్టీ స్టరోస్టా 1967 లో తన పరిశోధనా వ్యాసాన్ని గ్రంథ రూపంగా ప్రకటించి కృతజ్ఞతతో దానిని గిడుగు రామమూర్తి పంతులు గారికి అంకితం ఇస్తూ ఈ క్రింది విధంగా వ్రాశారు :

**To the memory of**
**Rao Sahib G.V. Ramamurti**
**Teacher, humanitarian, and**
**Pioneer in Munda Linguistics, this work is**
**respectfully dedicated.**

(ఆచార్యుడూ, మానవ సేవా పరాయణుడూ, ముండా భాషల పరిశోధనకు అంకురార్పణ చేసినవాడూ అయిన రావ్ సాహెబ్ జి. వి. రామమూర్తి గారికి భక్తి ప్రపత్తులతో ఈ గ్రంథం సమర్పితం).

ఆ క్లాస్టీ స్టరోస్టాగారు 'రామమూర్తి, ఏ ముండా లింగ్విస్ట్స్ ఎప్రీసి యేషన్' అనే ఇంగ్లీషు వ్యాసం* లో రామమూర్తి పంతులుగారు సవర భాషకు తయారు చేసిన మాన్యువల్ ఆఫ్ ది సోరా లాంగ్వేజ్ (సవర భాషా వ్యాకరణం) ను ఇలా ప్రశంసించారు :

"Ramamurthi's qualifications as a Mundaist aside, there is no question that his 'Manual' was and continues to be the single most impartant source of information available on the Sora language and even (for the time being, any way) on Sora culture and Society,"

(ముండా భాషల తులనాత్మక పరిశోధకుడుగా రామమూర్తి అర్హతల సంగతి అలా ఉండగా, ఆయన వ్రాసిన 'మాన్యువల్' సవర భాషను గూర్చి,

---

* చూ. 'మరోసారి గిడుగు రామమూర్తి' - హైదరాబాద్ బుక్ ట్రస్ట్, 1986 - పుట 213.

సవరల సంస్కృతిని గూర్చి, సవరల సామాజిక వ్యవస్థను గూర్చి తెలిపే మిక్కిలి ప్రధానమైన ఏకైక గ్రంథం అనడంలో సందేహం లేదు.)

రామమూర్తిని గూర్చిన ఈ ప్రశంసలో సీతాపతికి ఎంతో కొంత భాగం చెందక పోదు.

## సవరలు ఎవరు ?

పర్లాకిమిడి చుట్టుపట్ల గల మాళవాప్రదేశపు కొండ ప్రాంతాలలో నివసించే ఒక అనాగరక జాతి ప్రజలు సవరలు. వీరు తాము 'స్ ఓరన్' లము అని గాని, 'సొ ఓరన్' లము అని గాని చెప్పుకుంటారు. చరిత్ర రచయిత ప్లినీ 'సు అరి' అనీ, టాలమీ 'సబరై' అనీ పేర్కొన్నవారూ, మన ప్రాచీన గ్రంథాలలో శబరులని పేర్కొనబడిన వారూ ఈ సవరలే అని భావిస్తున్నారు.

సవరలు మిక్కిలి అనాగరకులు. మైదానపు ప్రాంతాలలో గల తెలుగు, ఒరియా పల్లెలకు చేరువగా ఉన్న కొన్ని సవర పల్లెలలోని సవరలకు మాత్రం ఆ మైదాన ప్రాంతపు ప్రజల నాగరకత కొంత వరకూ అబ్బింది. వీరు మొలకు బట్ట చుట్టపెట్టుకోడం నేర్చుకున్నారు. కాని, కొండల లోపలి ప్రాంతాలలో ఉన్న సవరలు ఇప్పటికీ మొలకు ఆకులే చుట్టుకుని తిరుగుతూ ఉంటారు. సవర స్త్రీలకు పైట అంటే ఏమిటో, అది ఎందుకు వేసుకోవాలో తెలియదు. అడవిలో ఆకులములు ఏరి, కట్టెలు కొట్టి తెచ్చి వాటిని మైదాన ప్రాంతపు ప్రజలకు అమ్మి రోజుకు ఏ అరణాలో, అర్ధ రూపాయో వస్తే దానితోనే వారు జీవిక వెళ్ళబుచ్చుతూ ఉంటారు.

ప్రతి శనివారం పర్లాకిమిడిలో జరిగే సంతకు వచ్చి కఱ్ఱలు, పాలగుండ, పసుపు, తేనె, అల్లం, కొండ చీపుళ్ళు మొదలైనవి అక్కడ అమ్మి ఆ డబ్బుతో తమకు కావలసిన అల్యూమినియం గిన్నెలు, పూసలు, బట్టలు, ఉప్పు మొదలైన వాటిని వారు కొనుక్కుని పోతూ ఉంటారు.

ఆడా, మగా ఇద్దరూ కలిసి సమానంగా పాటు పడుతూ వారు పోడు వ్యవసాయం చేస్తారు. సవరలు గొప్ప స్నేహ శీలురు. నీటిలో మునిగి ప్రమాణాలు చేసి నగర వాసులతో వారు స్నేహం కట్టుకుంటారు. అలా స్నేహం

కట్టుకున్న తరువాత సంవత్సరానికి ఒక సారైనా ఆ సవర స్నేహితుడు నగర స్నేహితుణ్ణి కలుసుకుంటాడు. శక్తి వంచన లేకుండా తన పొలంలో పండిన పంటలో ఎంతో కొంత తెచ్చి కానుకగా అర్పిస్తాడు. దానికి ప్రతిగా అతడు ఆశించేది కేవలం ఒక పూట కడుపు నిండా తిండి, తలకు రాసుకోడానికి ఇంత నూనె, గోచీ పెట్టుకోడానికి ఒక ఎఱ్ఱ రంగు గుడ్డా మాత్రమే! సవరలు అల్ప సంతోషులు. ఆ కొద్ది పాటి కానుకలకే వారు మురిసిపోతారు.

విలు విద్యలో వారు మంచి నేర్పరులు. విల్లు చేతిలో ఉన్న సవర వానికి ఎవరైనా కోపం తెప్పిస్తే, ఆ నాటితో వానికి ఆయువు మూడిందన్నమాటే!

సవరల అమాయికత్వాన్ని సూచించే ఒక సంఘటనను ప్రొ॥ కాళ్ళకూరి సూర్యనారాయణ* ఇలా వర్ణించారు: ఒక రోజున ఒక సవరవాణ్ణి అతని తండ్రి తన సవతి తల్లి మాటలు విని అన్యాయంగా కోపపడ్డాడు. దానితో ఆ సవరవానికి కోపం వచ్చి ఒక్క బాణంవేసి తన తండ్రిని చంపివేశాడు. పోలీసులు అతనిని అరెస్టు చేసి పర్లాకిమిడి సబ్ మేజిస్ట్రేట్ ముందు హాజరు పరిచారు. "ఏమిరా నీ తండ్రిని నీవు చంపిన మాట నిజమేనా?" అని అడిగాడు న్యాయాధికారి. దానికి వాడు అమాయికంగా ఇలా జవాబు చెప్పాడు: "బాబూ! అన్యాయంగా నా తండ్రి నా మీద కోపపడ్డాడు. నాకు రోషం వచ్చి నేను నా తండ్రిని చంపినమాట నిజమే! అందుకు నాకు ఎంత శిక్ష అయినా వెయ్యండి. కాని నా తండ్రిని మాత్రం నాకు తిరిగి ఇచ్చేయండి. మా అమ్మ గోల పెడుతూంది. నేను చూడలేకుండా ఉన్నాను." అలా అని వాడు కోర్టులో వెక్కి వెక్కి ఏడిచాడు. అంత నిష్కల్మష మైన మనస్సు గలవారు సవరలు. వారిలో ఎవనిలో అయినా కపటం అనేది కనిపిస్తే అది మైదానాలలోని ప్రజల సంపర్కంవల్ల ఏర్పడిందే అని స్పష్టంగా చెప్పవచ్చును.

---

* చూ. శ్రీ గిడుగు రామమూర్తి పంతులు జీవితము - వావిళ్ళ ప్రచురణ, 1955; పుట 36

## సవరలకు విద్యా బోధన :

సవరల అమాయికత్వాన్ని ఆసరాగా తీసుకుని వారు తెచ్చే సరుకులను చౌక ధరలకు కొని, ఎక్కువ ధరలకు అమ్మి లాభాలు పొందుతూ నగరాలలోని వర్తకులు వారిని మోసగిస్తూ ఉండడం చూసి, మొదటి నుంచీ జీవ కారుణ్య దృష్టి గల రామమూర్తి పంతులు గారి మనస్సు విలవిల లాడిపోయేది. ఎలాగైనా విద్యా బుద్ధులు గరిపి సవరలను నాగరకులను చేయాలని రామమూర్తి పంతులు గారు సంకల్పించారు.

సవరలకు విద్య నేర్పడం ఎలా ? వారికి తమ సవర భాష తప్ప మరొక భాష రాదు. అందుచేత ముందుగా తాను వారి సవర భాషను నేర్చుకోవాలి. కాని, వారి భాషకు ఒక లిపి లేదు; గ్రంథాలు లేవు. అందుచేత ముందుగా పర్లాకిమిడిలోనే తెలుగు, సవర భాషలు రెండూ తెలిసి ఉన్న 'పొట్టెడు' అనే ఒక సవరవానికి జీత మిచ్చి సవర భాష బాగా మాట్లాడడం ఆయన నేర్చుకున్నారు. సవర భాషను ఓఢ్ర లిపిలో వ్రాయాలని ఓఢ్రులూ, తెలుగు లిపిలో వ్రాయాలని తెలుగువారూ పట్టుబట్టారు. కాని సవర భాషా ధ్వనులకు తెలుగు భాషా ధ్వనులతోనే ఎక్కువ సామ్యం ఉండడం వల్ల తెలుగు లిపిలోనే వ్రాయడం ఉచిత మని జిల్లా కలెక్టరు కూడా అంగీకరించారు.

తరువాత రామమూర్తి తమ సొంత ఖర్చులతో మాళవాలోని మారుమూల గ్రామాలు కూడా పర్యటించి సవరల పాటలూ, కథలూ, ఆచార వ్యవహారాలూ సేకరించి గ్రంథస్థం చేసి, ప్రతిఫలం ఒక్క పైసా అయినా ఆశించకుండా వాటిని ప్రభుత్వానికి అందజేశారు. ప్రభుత్వం వాటిని ప్రకటించింది. మాళవా ప్రాంతంలో పర్యటించే ఆ రోజులలోనే తరచు మలేరియా జ్వరానికి గురి అయి, క్వయినా మందు ఎక్కువగా మింగడంవల్ల ఆయనకు ఘోరమైన చెవుడు సంప్రాప్తమైంది.

తరువాత 'సవరలకు చదువు చెప్పడం ఎలా?' అన్న ప్రశ్న వచ్చింది. రోజూ అడవికి పోయి ఏవో వస్తువులు సేకరించి అమ్ముకుంటే గాని వారికి జీవితం గడవదు. అందుచేత రామమూర్తి ఇద్దరు సవర వాళ్ళకు రోజుకు నాలుగణాల చొప్పున ఇచ్చి తెలుగు వ్రాయడం, లెక్కలు చేయడం ప్రొద్దున పూట మాత్రమే

నేర్పేవారు. మధ్యాహ్నం అడవిలోకి పోవడానికి స్వేచ్ఛగా వారిని వదలి పెట్టే వారు. ఈ విధంగా కొన్నేళ్ళు సవరలకు చదువు చెప్పి, వారిని ఉపాధ్యాయులుగా వేరు వేరు సవర పల్లెలకు పంపించి అక్కడ కొన్ని బడులు ఏర్పాటు చేశారు. కొన్నాళ్ళు ఆ బడులలో ఉపాధ్యాయుల జీతాలు కూడా ఆయనే భరించేవారు. తరువాత క్రమంగా ఆ బడులకు ప్రభుత్వ విద్యాశాఖవారి ఆర్థిక సహాయం లభించింది.

ఒక సారి రామమూర్తి తన సవర భాషా పాండిత్యాన్ని పరీక్షించుకో దలచి, 1892 లో ఒక రోజున వారి ఇంటికి వచ్చిన ఇద్దరు మాళువా సవరలతో సవర భాషలో ప్రసంగించగా, ఆయన సవర భాష విని ఆ ఇద్దరు సవరలూ విరగబడి నవ్వారు. అప్పుడు తాను నేర్చిన సవర భాష స్వచ్ఛమైంది కాదనీ, తెలుగు పదాలతో సంకరమైందనీ గుర్తించి, ఆ ఇద్దరు సవరలతో స్నేహం కట్టి, వారి వద్ద స్వచ్ఛమైన సవర భాషను ఆయన నేర్చుకున్నారు.

వారిద్దరితో రామమూర్తిగారు స్నేహం కట్టిన తీరు చిత్రమైంది. ఆ రోజున ఆ ఇద్దరు సవరలూ తేనె, పసుపు, అల్లం, రెండు కొండ చీపుళ్ళూ తీసుకుని వచ్చి రామమూర్తి గారికి కానుకగా ఇచ్చారు. ఈయన వారికి రెండు ఎఱ్ఱని కుచ్చు గోచీలూ, రెండు కట్టల చుట్టలూ ఇచ్చి తమ ఇంట్లో వారికి భోజనం పెట్టారు. భోజనానంతరం వారు 'గడిఙేన్! గడీనమ్' (నీవు నాకు స్నేహితుడవు, నేను నీకు స్నేహితుడను) అంటూ మూడు సార్లు చీపురు పుల్లలను త్రుంచి పడేశారు. రామమూర్తి పంతులు కూడా అలాగే చేసి వారితో స్నేహంకట్టారు.

ఆ ఇద్దరు సవరల సాయంతో రామమూర్తి తాము తయారు చేసుకున్న సవర వాచకాలను సరిదిద్దుకున్నారు. ఆ తరువాత ఒక సవర కుఱ్ఱవాణ్ణి తమ ఇంట్లోనే ఉంచుకుని అతనికి తిండీ, బట్టా ఇస్తూ అతని సాయంతో కొన్ని సవర వాచకాలూ, కథల పుస్తకాలూ, పాటల పుస్తకాలూ, తెలుగు - సవర, సవర - తెలుగు నిఘంటువులూ తయారు చేశారు. ఆ తరువాతి కాలంలో 1911లో మద్రాసు ప్రభుత్వం వాటిని ప్రకటించింది. ఆ సందర్భంలో ఆయన కృషిని ప్రశంసిస్తూ ప్రభుత్వం "మీకు ఏం పారితోషికం కావాలి ?" అని అడుగగా రామమూర్తి "సవరవారి కోసం ఒక మంచి స్కూలు స్థాపించండి. నేను ప్రారంభించిన

స్కూళ్ళకు గ్రాంట్లు ఇవ్వండి-అదే నాకు పదివేలు "అన్నారు. ప్రభుత్వం ఆయన కోరికను మన్నించి సెరంగోలో ఒక ట్రైనింగ్ స్కూలు తెరిచింది. రామమూర్తి స్థాపించిన పాఠశాలలకు గ్రాంట్లు మంజూరు చేసింది.

## సవర భాషా పరిశోధన :

ఇండియా ప్రభుత్వం తరపున భారత దేశంలోని భాషలన్నింటిని గూర్చిన వివరాలనూ సేకరించి 'లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా' అనే గ్రంథాన్ని కొన్ని సంపుటాలుగా తయారు చేయడానికి పూనుకున్న సర్ జార్జ్ గ్రియర్సన్‌కు సవర భాష విషయంలో రామమూర్తి పంతులు సాయం చేశారు. బైబిల్‌లోని 'పేరబిల్ ఆఫ్ ది ప్రోడిగల్ సన్' అనే కథను సవర భాషలోకి అనువదించి ఇవ్వడమే కాకుండా, సవర భాషా వ్యాకరణ విశేషాలను సంగ్రహంగా వివరిస్తూ ఒక చిన్న వ్యాసం కూడా ఆయన అందచేశారు. 'ద్రావిడ భాష'లకు సంబంధించిన 5 వ సంపుటంలో అవి చేర్చబడ్డాయి.

సవర భాషను గూర్చి ఇంగ్లీషులో వ్రాసిన పుస్తకాలలో రామమూర్తి గారు 'ఇంటర్నేషనల్ ఫొనెటిక్ స్క్రిప్ట్' (అంతర్జాతీయ ధ్వని విధేయ లిపి) వాడుక చేశారు. 1931 లో రామమూర్తి సవర భాషా వ్యాకరణం (A Manual of Sora Language), 1933 లో ఇంగ్లీషు-సవర నిఘంటువు, 1936 లో సవర-ఇంగ్లీషు నిఘంటువు తయారు చేశారు. ఈ రచన లన్నింటిలోనూ రామమూర్తి పంతులతో పాటు జంట పండితుడుగా సీతాపతి కూడా పని చేశారు. అందుచేతనే ఆ నిఘంటువులకు ముందుమాట వ్రాస్తూ, రామమూర్తి 'నేను' అని కాకుండా, 'మేము' అని బహు వచనం వాడడం జరిగింది.

అంతకు ముందే 1911 లో 'సవర - తెలుగు', 'తెలుగు - సవర' నిఘంటువులు ప్రకటించబడిన వెంటనే ఆ సంవత్సరం నవంబరు 12వ తేదీన 5 వ జార్జ్ చక్రవర్తి పేరిట ఒక 'సర్టిఫికెట్ ఆఫ్ మెరిట్'ను, 1913 జనవరి 1వ తేదీన 'రావు సాహెబ్' బిరుదాన్ని ఇచ్చి రామమూర్తి పంతులను బ్రిటిష్ ప్రభుత్వం సత్కరించింది.

తరువాత 1931 లో ఇంగ్లీషులో సవర భాషా వ్యాకరణం ప్రకటించిన తరువాత 1933 జనవరి 1వ తేదీన 'కైజర్-ఇ-హింద్' బంగారు పతకాన్ని

బ్రిటిష్ ప్రభుత్వం రామమూర్తి పంతులకు బహూకరిస్తున్నట్లు ప్రకటించింది. 1933 జూన్ నెలలో మద్రాసు గవర్నరు ఛత్రపురానికి వచ్చినపుడు ఏర్పాటైన ప్రత్యేక దర్బారులో ఆ పతకాన్ని రామమూర్తికి అందజేశారు.

అలాగే - 1935 మే 6వ తేదీన 5వ జార్జ్ చక్రవర్తి రజతోత్సవ పతకాన్ని కూడా రామమూర్తి అందుకున్నారు.

## దొరలకు సవర భాషా బోధన :

వెల్ష్‌మన్ అనే ఒక అటవీశాఖ ఉద్యోగి సవర దేశంలో పని చేయవలసి రావడం వల్ల అతడు సవర భాష నేర్చుకోవలసి వచ్చింది. 1908 లో ఆయన రామమూర్తి పంతులకు "మీకేదైనా పారితోషికం ఇస్తాను. మా ఇంటికి వచ్చి నాకు సవర భాష నేర్పుతారా?" అని అడిగారు. దానికి రామమూర్తి తన కేమీ పారితోషికం అవసరం లేదనీ, వారి ఇంటికి రావడానికి తనకు వీలు పడదనీ, కాలేజ్‌లో మధ్యాహ్నం విశ్రాంతి సమయంలో వస్తే ఒక గంట సేపు సవరభాష నేర్పుతాననీ అన్నారు. ఆ దొర అలాగే వచ్చి ఆయన వద్ద సవర భాషను నేర్చుకున్నారు. ఆరంభంలో తాను పెద్ద ఉద్యోగస్థుడ నని అధికార దర్పం ప్రదర్శించినా, రామమూర్తి అసాధారణ పాండిత్యం గుర్తించిన తరువాత గురు భావంతో వినమ్రంగా ఆయన ప్రవర్తించేవాడు. అలా రామమూర్తి వద్ద సవర భాషను నేర్చుకున్న ఆ వెల్ష్‌మన్ దొర 1917 లో గతించాడు.

ఆ తరువాత 1928 లో మిస్ మన్రో అనే మిషనరీ దొరసాని సవర ప్రాంతంలో పనిచేయడానికి వచ్చి, రామమూర్తి దగ్గిర సవర భాషను నేర్చుకుంది.

## సీతాపతి భాగస్వామ్యం :

ఇంచుమించు సీతాపతి జన్మించడానికి ముందునుంచే సవర జాతికీ, సవర భాషకూ సేవ చేసే రామమూర్తి కృషి ఆరంభం అయినా, తనకు 40 ఏళ్లు వచ్చే వరకూ సీతాపతికి సవరభాషను నేర్చుకోడం పడలేదు. అంతవరకూ ఆయన వ్యావహారిక భాషోద్యమ సంగ్రామంలోనే తండ్రికి సాయం చేస్తూ ఉండేవారు.

ఒక రోజున రామమూర్తి సీతాపతిని దగ్గరకు పిలిచి, "నాయనా! నీవు కూడా సవర భాషను నేర్చుకోక తప్పదు నేను ఒక్క ఈ కార్యభారం వహించ

లేకుండా ఉన్నాను" అన్నారట. సీతాపతి 'అలాగే' అన్నారు. వెంటనే సవరభాషా బోధన మొదలుపెట్టి తన బోధనా పటిమ వల్ల తాను 30 ఏళ్ల శ్రమపడి నేర్చుకున్న సవరభాషా జ్ఞానాన్ని అంతటినీ ఆరు మాసాలలోనే కుమారునికి ఆయన నూరిపోశారు.

'లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా'లో సవర భాషను గురించి వ్రాస్తూ ఆ గ్రంథం సంపాదకుడు సర్ జార్జ్ గ్రియర్సన్ ఇలా వ్రాశారు : "దీనికి సంబంధించిన నిఘంటువులూ, కథలూ, పాటలూ రావు సాహెబ్ జి. వి. రామమూర్తి పంతులు రచించగా ప్రభుత్వం వారు ప్రకటించినవి - అన్నీ తెలుగు భాషలో, తెలుగు లిపిలో ఉన్నందువల్ల తెలుగు తెలిసిన వారికే తప్ప ఇతరులకు అవి ఉపయోగపడడం లేదు. వీటిని ఇంగ్లీషు భాషలో వ్రాస్తే అవి భాషా తత్త్వవేత్తలకు విశేషంగా ఉపయోగ పడగలవు".

ఆ రోజులలోనే ప్రభుత్వ ఉద్యోగస్థులకూ, సవరలు నివసించే ప్రాంతంలో పనిచేస్తున్న మిషనరీలకూ, అస్సాం తేయాకు తోటలకు సవరలను కూలీలుగా తీసుకుని పోతున్న సంఘం వారికీ కూడా అదే అభిప్రాయం కలిగింది. అప్పుడు బ్రిటీష్ ప్రభుత్వం వారు 'సవర - ఇంగ్లీష్', 'ఇంగ్లీష్ - సవర', నిఘంటువులనూ, 'సవర వ్యాకరణాన్నీ', 'సవర కథలనూ' ఇంగ్లీషులో వ్రాసే పనిని రామమూర్తి పంతులకు ఒప్పచెప్పారు. ఆ గ్రంథాలు వ్రాసే కృషిలో 1931 నుంచి 1936 వరకూ సీతాపతి తండ్రికి తోడు నీడగా ఉండి విశేషంగా సాయం చేశారు.

## సవరల కళామయ జీవనం :

కళా హృదయుడైన సీతాపతి సవర గీతాలకు తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ, తాను చేసిన అనువాదాల ద్వారానూ, తెలుగు ఇంగ్లీషు భాషలలో సవరలను గురించి తాను వ్రాసిన వ్యాసాల ద్వారానూ సవరల కళా మయ జీవనాన్ని గూర్చిన అనేక మనోహర దృశ్యాలను లోకం దృష్టికి తెచ్చారు.

సవరలు జీవించే కొండ ప్రాంతంలో ప్రకృతి సర్వాంగ సుందరంగా దర్శన మిస్తుంది. అందుచేత సహజంగానే సవరలు ప్రకృతి సౌందర్యారాధకు

లయారు. వారి పురాణ కథలలోనూ, జానపద గీతాలలోనూ, కవితా మయమైన వారి ఊహాగానాలలోనూ, వారి ఆచారాలలోనూ, పొడుపు కథలలోనూ, సామెతల లోనూ ఆ ప్రాంతపు ప్రకృతి సౌందర్యం, అక్కడి జంతువులూ, చెట్లూ అన్నీ మనోహరంగా ప్రతిఫలిస్తాయి. దూరంనుంచి ఒక చిరుత పులి అరుపు విని అది కోపంతో అరచిన అరుపో, ఆకలితో అరచిన అరుపో, ప్రణయ కలాపంలో సంతోషంతో అరచిన అరపో సునాయాసంగా సవరలు గుర్తించగలరు.

పాటలు పాడడం సవరలకు చాలా సరదా! వివిధ సందర్భాలలో ఆశువుగానే వారు పాటలు కట్టి పాడుతూ ఉంటారు. దురదృష్టవశాత్తు వారు ఒక లిపిని అలవరచుకోనందు వల్ల అలా ఆశువుగా కట్టిన పాటలను లిపి బద్ధం చేసి భద్రపరచుకోడం వారికి సాధ్యం కాలేదు. చాలా పాటలు అంతరించి పోతూ ఉంటాయి. కాని అందరినీ బాగా ఆకర్షించే అద్భుతమైన పాటలు కొన్ని మాత్రం వాళ్ళ నోళ్ళలో నానుతూ మౌఖికంగా ఒక తరం నుంచి మరో తరానికి సంక్రమిస్తూ వచ్చాయి.

సవరల పాట లన్నీ గానానుకూల మైనవి. మన ఫిడేల్ లాంటి 'రాజన్' అనబడే తంత్రీ వాద్యాన్నో, మన గిటార్‌ను పోలిన 'కెంకెన్ రాజన్' అనే వాద్యాన్నో వాయిస్తూ వారు పాటలు పాడతారు. అనుకోకుండా ఒక కోడె వయసువాడూ, ఒక పడుచుపిల్లా అడవిలో తారస పడితే యథాలాపంగా పాడినట్టుగా పాడే పాటల ద్వారా వారు తమ మనోభిప్రాయాలను పరస్పరం తెలుపుకుంటారు. సాధారణంగా పురుషుడే చొరవ తీసుకొని ఇలా ఏదో ఒక పాట ఎత్తుకుంటాడు:

"లాంగీ బాయ్, లాంగీ బాయ్
కైతా గుర్ లాంగీ బాయ్!"
(చక్కని చుక్కా! చక్కని చుక్కా!
జామపండు లాంటి చక్కని చుక్కా!)

ఆ కోడెక త్తెకు ఆ కోడెకాని మీద మనస్సు గనుక ఉంటే తనలో తాను పాడుకుంటున్నట్టు ఆమె ఇలా జవాబు చెబుతుంది :

"లాంగా మర్! లాంగా మర్!
కింతే గుర్ లాంగా మర్!"

(అందగాడా! అందగాడా!
అరటి పండు లాంటి ఓ అందగాడా!)

అలా ఆరంభం అవుతాయి వారి ప్రణయ కలాపాలు.

సీతాపతి ఇంగ్లీషులో అనువదించిన ఈ సవరపాట చూడండి:

Why don't thou turn thy face
or hide from me thy grace?
Am I advanced in age
Beyond the youthful stage?
My beard and hair, behold
They do not prove me old.
My darling couldst thou say
If they are really grey?
Like the squirrel's bristle
Or the mongoose gristle?
A happy pair we will be
If we, in love, agree.
Art thou modest and shy
To have a marital tie?
How delighful is the grace
Of modest maiden's face !
Like the leaf-bud tender
Shoots in charming splendour.

(ఎందుకు చాటు చేసుకుంటావు ముఖం
ఎందుకు దాచుకుంటావు నీ సొగసు?
చెప్పు - నే నేమైనా ముసలివాణ్ణా?
వయసు చెల్లిపోయిన వాణ్ణా?
చూడు నా మీసం, గడ్డం

ముసలితనం ముచ్చుకైనా కనిపిస్తుందా?
సొగసు కత్తే! నువ్వనగలవా
అవి నెరసి పోయాయని
ఉడత తోకలాగ, ముంగిస
బొచ్చులాగ అవి బిరుసెక్కాయా?
చక్కని జంట అవుతాము
మనం గనుక నేస్తం కడితే!
నీ కింత సిగ్గెందుకె బాలా?
పెళ్లి ప్రస్తావన తీసుకు వస్తే?
సిగ్గుపడే చిన్నదాని ముఖం
చిందే అందాలు కోకొల్లలు!
సుకుమారమైన చివురుటాకు
వెదజల్లే సొగసుల వెల్లులు!)

భగ్న ప్రేమతో విలవిల లాడే విరహిణులు ఏదో వంకతో అడవికి పోయి అక్కడ తమ హృదయావేదన నంతా వెళ్ళబోసుకుంటూ ఇలా పాడుకుంటారు :

"మలే డార్లిన్, మల్గా డార్లిన్
ఈతెమ్ కెంతే? హీటమ్ కెంతే
మైనా డాలే, రామిటిడ్?"

(కుమిలి కుమిలి ఏడుస్తున్నాను
క్రుంగి క్రుంగి చనిపోతాను
ఎందుకే ఓ మైనా! నీ కింత ఉల్లాసం?
పాటల్లో ఆ దరహాసం!)

సవర యువతీ యువకులకు తమ జీవిత భాగస్వాముల నెంచుకునే స్వేచ్ఛ ఉన్నా, సర్వ సాధారణంగా తల్లి తండ్రుల ఆశీర్వాదంతో జరిగే వివాహాలే సుఖంగా కొనసాగుతున్నాయి.

ఇరుగు పొరుగులను ఆదరంగా చూడడం, వారికి చక్కని ఆతిథ్యం ఇవ్వడం సవరల స్వభావం. తమకు ఉన్నంతలో వారు అతిథులను బాగా

ఆదరిస్తారు. ఒక నిరుపేద సవరలో కనిపించే అతిథి సేవా స్వభావాన్ని చాటు తూంది ఈ క్రింది గీతం :

"I have at home no more than a mat
And that's worn out all round
I seat my guest on that poor mat
And I shall sit on the ground"

(ఇంట్లో ఒక్క చాప తప్ప వేరేమీ లేదు
అదీ చిరిగి పోయిన పాత చాప!
ఆ చాపమీదే అతిథిని కూర్చో పెడతాను
ఆ పక్కనే నేలమీద నేను చతికిల బడతాను)

సవరలకు కూడా వసంత ఋతువే అన్ని రుతువులలోకీ ఆనందోత్సాహాలను కలిగించే శోభాయమానమైన ఋతువు. సవరలు పాడుకునే ఈ వసంత గీతం చూడండి :

"Buds have blossomed, fruits have ripened
Come on my friend ! Come on my friend
Buzzing drone has come out my dear
Humming queen bee has met him here
O thou my friend ! where hast thou gone ?
Hiding at home, what hast thou done ?
Look here my friend ! This mowa tree
Smiling like the maid in glee
Let's take the flower and brew the aie
Drink and tell an amusing tale ?"

(మొగ్గలు విచ్చి పూలయాయి; కాయలు పండి పండ్లయాయి
రా! రా! చెలికాడా! రా! రా! చెలికాడా!
ఝుమ్మంటూ వచ్చిం దదిగో పోతుటీగ !
ఝుంకారం చేస్తూ వచ్చింది రాణీ ఈగ
ఓహో నా చెలికాడా ! నువ్వెక్కడ దాగి ఉన్నావు ?

ఇంట్లో దూరి కూర్చున్నావా, ఏం చేస్తున్నా వక్కడ?
చూడు చూడు చెలికాడా! ఇప్ప చెట్టు పూసింది
పగలబడి నవ్వే చక్కని వయసుక త్తెలా
రా! రా! ఈ పూలు కోసుకెళ్ళి సారా కాద్దాం.
ఆ సారా చప్పరిస్తూ సరదాగా కథలు చెప్పుకుందాం!)

ఆహారం కోసం తప్ప వినోదం కోసం సవరలు ఎన్నడూ వేటాడరు. బాణం వేసి పక్షుల్ని పడగొట్టే సందర్భంలో ఒక్కొక్కప్పుడు సుకుమార మైన వారి హృదయం కరిగి పోవడం కూడా కద్దు. ఈ పాట చూడండి :

తుఈ డోంగ్, తుఈ డోంగ్, ఆమన్ తుఈ డోంగ్
యం తే లంగా ఓంటిడ్, యేనా లంగా ఓంటిడ్
తుఈ డోంగ్, తుఈ డోంగ్, ఆమన్, తుఈ డోంగ్.

(బాణం వదలకు, బాణం వదలకు, ఓహో ఎంత అందమైన పిట్ట!
బాణం వదలకు, బాణం వదలకు; ఈ అడవిలో అందంగా ఎగిరింది
ఆ అడవిలో 'కూ, కూ' అని గీతాలు పాడింది- వెఱ్ఱి ఆవేశంతో!
వేటగా డొస్తున్నాడు పారిపో, పారిపో అందాల పిట్టా!)

వేద కాలంలో ఆర్యులతో కలిసి జీవిస్తున్న రోజులలో వేద నాగరకత కొంత సవరలకు అబ్బినట్లు కనిపిస్తుంది. సవరలు వేద నాగరకతకు చేసిన నిర్వాహం కూడా కొంత అథర్వ వేదంలో మనకు గోచరిస్తుంది. సవరలు ఆత్మ నిత్య మని నమ్ముతారు. ప్రేతాత్మలు ఊర్ధ్వలోకాలకు పోయేందుకు వీలుగా వారు కూడా చనిపోయిన వారికి అంత్యక్రియలు జరుపుతారు. సవరలు వాడే కొండల పేర్లూ, నదుల పేర్లూ, వారి మంత్రాలూ కొన్ని అథర్వ వేదంలో చేరినట్టు చెబు తున్నారు. సవరల వైద్య విజ్ఞానం చెప్పుకో దగ్గది. రోగ నివారణకు ఔషధాల తో పాటు కొన్ని మంత్రాలను కూడా వారు వాడతారు. వ్యాధులను కలిగించే దుష్ట దేవతలకు కోళ్ళనూ, మేకలనూ, దున్నలనూ బలి ఇచ్చి వాటిని వారు సంతృప్తి పరుస్తారు. ప్రార్థనలో సవరలకు నమ్మకం లేదు. "ఎందుకు నేను ప్రార్థించాలి? దేవతలను తృప్తి పరచి నా విధి నేను నిర్వహించాను. ఇంక దేవత నా కెందుకు కీడు చేస్తుంది? దానిని నే నెందుకు ప్రార్థించాలి?" అంటాడు సవర వాడు.

పని పాటలు చేసుకునే టప్పుడు సవరలు పాడుకునే పాటలకు ఉదాహరణంగా ఈ క్రింది దంపుళ్ళ పాటను సీతాపతి చూపారు. రోకటి పోటుకు అనుకూలమైన లయతో ఈ పాట ఎలా సాగుతూందో చూడండి:

| | | |
|---|---|---|
| తంతజ్ దిజ్ జా | అబాఞి - గోజ్ | తోనా - ఞాన్ |
| డిఞ్ డిఞ్ వాజా | అబాఞి - గోజ్ | కాకి - ఞాన్ |
| తూజల్ తోజా | అబాఞి - గోజ్ | తోనా - ఞాన్ |
| అజల్ బాజా | అబాఞి - గోజ్ | కాకి - ఞాన్ |
| సిడ్రుజ్-సుజ్ బా | బఞా ఇబా | తోనా - ఞాన్ |
| గిగ్గి-తోజ్ - బా | బఞా ఇబా | కాకి - ఞాన్ |
| తోజ్ సెజాన్ | బఞా ఇబా | అయి - ఞాన్ |
| కులమ్-సూజ్ బాన్ | బఞా ఇబా | తోనా - ఞాన్ |
| పాపా - ఉంచా | బఞా ఇబా | అయి - ఞాన్ |

ఈ పాటలో ఒక అక్క, చెల్లెల్ని కాపురానికి పంపుతూ తన చెల్లెలు సుకుమారి అనీ, కష్టమైన పనులు చెప్పవద్దనీ, ప్రేమగా చూసుకోమనీ తన మరిదికి ఉపదేశిస్తూంది.

సీతాపతి ఉదాహరించిన మరొక్క పాటను గమనించి ఈ ప్రస్తావనను మనం ముగిద్దాం. సవర పాటలలో కూడా పల్లవి లక్షణం కనిపిస్తూంది అంటూ తాను రచించిన 'తెలుగులో ఛందో రీతులు' అనే గ్రంథంలో సీతాపతి ఈ క్రింది పాటను ఉదాహరించారు. పాటకు స్వరాన్ని కూడా ఇవ్వడం ఆయన సంగీత పరిజ్ఞానాన్ని సూచిస్తూంది.

కురీ ! కురీ ! కురీ
(నిసా సరీ గరీ)

గామ్లై
(నీస)

గూతాయ్' గూతాయ్' గూతాయ్'
(గరీ రిసా సనీ)

బురోయ్' జపోంగ్ గంగా' జపోంగ్
(నిసగరీ నిసగరీ)

పా.... జపోంగ్ సిత్రీ జపోంగ్
(నిసగరీ నిసగరీ)

ఇజ్గాయ్! ఇజ్గాయ్! ఇజ్గాయ్!
(నిసా సరీ గరీ)

గాస్లె
(నీస)

గూతాయ్' గూతాయ్' గుతాయ్'
(గరీ రిసా సనీ)

("కురీ కురీ కురీ అంటూ కూస్తా కూస్తా కూస్తా!
కందులె కానీ, జొన్నలె కానీ, సామలె కానీ, రాగులె కానీ
తెస్తా తెస్తా తెస్తా" - ఇది ఒక గువ్వ పిట్ట పాడే పాట)

తరాల తరబడి అనాగరకులుగా పశు పక్ష్యాదులతో కలిసి జీవిస్తూ వచ్చిన సవర జాతి వారికి ఒక లిపినీ, గ్రంథాలనూ సమకూర్చి వారిని విద్యావంతులు గానూ, నాగరకులుగానూ మలచడం లోనే కాకుండా, సవర భాష స్వరూప స్వభావాలనూ, సవర జాతి సంస్కృతినీ, ఆచార వ్యవహారాలనూ బయటి ప్రపంచానికి చాటి చెప్పడంలో కూడా ఈ తండ్రీ కొడుకులు (రామమూర్తి, సీతాపతి) చేసిన సేవ గణనీయమైంది; అంతర్జాతీయ విఖ్యాతి పొందింది.

వ్యావహారిక భాషోద్యమానికి వీరు చేసిన సేవకు ఫలితంగా వీరికి లభించినవి ఎక్కువగా గ్రాంథిక భాషా వాదుల దూషణలూ, నిందలూ, పరిహాసాలే! వ్యావహారిక భాషాభిమానులలో తగిన ఆర్థిక సహాయం చేసి ఈ తండ్రీ కొడుకులచేత తెలుగు భాషకు ఒక సమగ్రమైన నిఘంటువునూ, ఒక నవ్యాంధ్ర వ్యాకరణాన్నీ రచింపచేయడానికి ఒక్కరూ ముందుకు రాలేదు.

వీరు చేసిన సవర భాషా సేవకే ఎక్కువ గుర్తింపూ, సత్కారాలూ లభించాయి. బ్రిటిష్ ప్రభుత్వం రామమూర్తిని 'రావు సాహెబ్', 'కైజర్-ఇ-హింద్' వంటి బిరుదులతో సత్కరించగా, ఆంధ్ర విశ్వ విద్యాలయం వీ రిరువురినీ 'కళా ప్రపూర్ణ' బిరుద విరాజితులను చేసింది. పాతిక సంవత్సరాల వ్యవధిలో 1938 లో తండ్రీ, 1963 లో కొడుకూ ఒకే విశ్వవిద్యాలయం నుంచి 'కళా ప్రపూర్ణ' బిరుదం అందుకోడం గిన్నెస్ ప్రపంచ రికార్డులలో ఎక్కదగిన అద్భుతమైన అంశం !.

ఆంధ్ర విశ్వవిద్యాలయం 1973 దాకా వ్యావహారిక భాషా మాధ్యమాన్ని అంగీకరించ నందువల్ల వారు ఈ ఇరువురికీ 'కళా ప్రపూర్ణ' బిరుదు ఇవ్వడం వీరు చేసిన సవర భాషా సేవకు గుర్తింపుగానే అని మనం ఊహించ వచ్చును.

# రాజకీయాలు-సినీమాలు

సీతాపతి సినీమా రంగంలో ప్రవేశించడం తండ్రి కిష్టం లేక పోయినా, రాజకీయ రంగంలో ఆయన అడుగు పెట్టడం మాత్రం తండ్రి ప్రోద్బలంతోనే జరిగింది.

1932 లో పర్లాకిమిడి కాలేజ్‌లో సీతాపతికి ఉద్యోగం పోవడం, అంత వరకూ పర్లాకిమిడి రాజవంశంతో గిడుగు వంశం వారికి గల ప్రేమానుబంధాలు అంతరించి, వారితో బలవద్ వైరం సంప్రాప్తించడం సంభవించింది. ఓఢ్ర తెలుగు వివాదాలు తలఎత్తి తెలుగు వారు ఎక్కువగా ఉన్న పర్లాకిమిడి తాలూకాను క్రొత్తగా ఏర్పడబోయే ఒరిస్సా రాష్ట్రంలో చేర్చే ప్రమాదం ఏర్పడింది. అందుచేత గిడుగు రామమూర్తి పంతులుగారు 'ఆంటి అమాల్గమేషన్ పార్టీ' (విలీన వ్యతిరేక పక్షం) ఒకటి ఏర్పాటు చేసి దానికి నాయకత్వం వహించవలసి వచ్చింది. ఆ విధంగా తలమున్కలుగా రాజకీయ రంగంలో వారు నిమగ్నం కావడం తప్పనిసరి అయింది.

ఉద్యోగం లేకపోవడం వల్లా, రాజకీయాలలో ఎక్కువ డబ్బు ఖర్చు చేయవలసి రావడం వల్లా సీతాపతి ప్రోనోట్ల మీద పుట్టిన చోటల్లా అప్పులు చేశారు. గిడుగు వారిని అల్లరి పెట్టాలని రాజావారు కొన్ని ప్రోనోట్లను తమ పేర ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వారి మీద దావాలు వేసి, వారిని నానా అగచాట్ల పాలు చేశారు.

చివరికి 1936 లో రాజకీయాలలో పరాజయం చెంది, రామమూర్తి రాజమండ్రిలో తన చిన్నకుమారుడు సూర్యనారాయణ ఇంటికి తరలివచ్చే నాటికి సీతాపతికీ, తండ్రికీ మాటలు లేవు. అప్పులు చేశా డన్న కోపానికి తోడు సీతాపతి మద్రాసులో సినిమాలలో నటిస్తున్నా డన్న వార్త అగ్నికి ఆజ్యం చేర్చినట్లు అయింది.

1939 లో రామమూర్తికి కడుపులో గుల్మం ఏర్పడి మద్రాసు తీసుకు వెళ్ళి వైద్యం చేయించవలసి వచ్చినప్పుడు మళ్ళీ తండ్రీ కొడుకులను ఏకం చేయాలనే సంకల్పంతో సీతాపతి తల్లి అన్నపూర్ణమ్మ భర్తతో ఇలా అన్నారట:*

"ఇంటికి పెద్ద కొడుకుగా ఉమ్మడి కుటుంబం బాధ్యత లన్నీ వాడిమీద వేసి కొని గత ఇరవై ఆయిదు సంవత్సరాలుగా సీతాపతి అన్నీ చూసుకొంటూ వచ్చాడు. ఏ బాధ్యతలూ లేకుండా తన భార్యా బిడ్డల విషయం ఒక్కడే చూసు కొని ఉంటే కొన్ని వేలు వెనుక వేసుకొని ఉండేవాడు. మీరే వాడిని ఒరిస్సా తగ వులలోకి లాగారు. ఎలెక్షన్లలో నిలబెట్టారు. పర్లాకిమిడిలో ఏ తెలుగు వారికీ పట్టని ఆంధ్రాభిమానం అంతా మీలోనే వచ్చింది. మీ వరకూ దానిని పరిమితం చేసుకో కుండా వాడికీ అంటగట్టారు. 1911 నుండి 1936 వరకూ మీరు ఏది చెబితే అది చేశాడు. ఏ విషయంలోనూ మీకు ఎదురు చెప్పకుండా, లాభ నష్టాలు ఆలోచించ కూండా మీరు ఎందులో దూకమంటే అందులో దూకాడు. పితృ వాక్య పరిపాలన వలన శ్రీరామునికి కలిగినన్ని కష్టాలు సీతాపతికి కలిగాయి. ఈ అప్పుల విషయం మీతో చెప్పలేదు గాని, ఎప్పటి కప్పుడు నాతో చెప్పే చేశాడు. వాడి ఉద్యోగం పోకుండా ఉంటే ఈ అప్పులు ఒక లెక్కలోకి రావు."

భార్య అన్న మాటలలోని నిజాన్ని గుర్తించి రామమూర్తి తన మనస్సు సమాధాన పరచుకొని, బావ మరది సూర్యనారాయణను పిలిపించి అతని పేర పవర్ ఆఫ్ అటర్నీ ఒకటి వ్రాసి ఇచ్చి పర్లాకిమిడిలోని తన ఆస్తి అంతా తెగనమ్మి ఉన్న అప్పులన్నీ వెంటనే తీర్చి వేయ మని చెప్పారు. వైద్యం నిమిత్తం పెద్ద కొడుకు సీతాపతి వద్దకు మద్రాసుకు ప్రయాణం కట్టారు.

## రాజావారి కుటుంబంతో సత్సంబంధాలు :

ఆ రోజులలో తెలుగు జిల్లా కేంద్రాలైన ఇతర పట్టణాల కంటె నవ నాగరకత విషయంలో పర్లాకిమిడి ఒక పాతిక ఏళ్ళు ముందంజ వేసింది. రాజవీథి పొడుగునా గ్యాస్ దీపాలు అమర్చారు. నౌపడా నుంచి పర్లాకిమిడి మీదుగా గుణు పురం వరకూ ఒక మీటరుగేజ్ రైలును పర్లాకిమిడి సంస్థానం వారే స్వయంగా వేయించుకున్నారు.

---

*గిడుగు రామమూర్తి (జీవిత చరిత్ర) - జి.వి. రామమూర్తి - పుట 62

ఆ సంస్థానం అంత ఎక్కువగా అభివృద్ధి పొందడానికి ముఖ్య కారకుడు 'టైలర్' అనే ఒక ఇంగ్లీషు దొర. పర్లాకిమిడిలో ముసలి ప్రభువు సంస్థానం సంగతి పట్టించుకోకుండా నిత్యం పూజలూ పురస్కారాలతో గడుపుతూ ఉండడం వల్లా, ఆయన కుమారులు మైనర్లైనందువల్లా చెన్నపట్టణం ప్రభుత్వం తరపున 'కోర్టు ఆఫ్ వార్డ్స్' వారు ఆ సంస్థానాన్ని స్వాధీన పరచుకొని తమ ప్రతినిధిగా టైలర్‌ను అక్కడ పాలకుడుగా నియమించారు. టైలర్ దొర సమర్థుడే కాదు; చాలా ఉత్తముడు కూడా! సంస్థానం ఆదాయం పెంచి సంస్థానానికి ఎన్నో మేళ్ళు చేకూర్చాడు; సంస్థాన ప్రజలందరికీ ప్రీతి పాత్రుడయాడు.

ముసలిరాజు జ్యేష్ఠ పుత్రుడు 'పట్టదేవ్' మైనారిటీ తీరి పరిపాలన చేపట్టిన తరువాత కూడా ఆ టైలర్‌ను ఆయన దివానుగా ఉంచుకున్నాడు. జమీందారీ కుటుంబం వారిని సొంతబిడ్డల వలె చూసుకున్న ఆ టైలర్ దొర నిండు వార్ధక్యంలో పర్లాకిమిడిలోనే చనిపోయాడు. పోతూ, పోతూ జీవితంలో తాను ఆర్జించిన లక్షలాది రూపాయల విలువచేసే ఆస్తి నంతటినీ ఆ జమీందారీ కుటుంబానికే సంక్రమింప చేసిపోయిన మహనీయుడు ఆయన!

రామమూర్తి పంతులు గొప్పతనాన్ని గ్రహించి జిల్లా కలెక్టరు సలహాతో టైలర్‌దొర రాజకుమారులకు ప్రైవేట్ ట్యూటరుగా ఆయనను నియమించాడు. అప్పటినుంచి రామమూర్తికి రాజ కుటుంబంతోనూ, వారి బంధువులైన ఇతర రాజకుటుంబాలతోనూ సన్నిహితమైన అనుబంధం ఏర్పడింది. గజపతి మహారాజు గద్దె ఎక్కిన తరువాత కూడా ఆయన తమ్ముడు చంద్ర మహారాజుకు మరికొంత కాలం రామమూర్తి చదువు చెప్పారు. అతనిని సర్వోత్తముడైన వ్యక్తిగా మలచడానికి ఆయన ప్రయత్నిస్తూ ఉండగా, దురదృష్టవశాత్తు అతడు అకాల మరణం పాలయాడు. తరువాత కొంత కాలానికి గజపతి మహారాజు కూడా మరణించడంతో రామమూర్తికి రాజకుటుంబంతో అనుబంధం క్రమంగా తగ్గుతూ వచ్చింది.

## వైరానికి అంకురార్పణ :

గజపతి మహారాజు మైనరు కుమారుడు మద్రాసులోని న్యూయింగ్‌టన్ కాలేజ్‌లో చదువుకుంటూ ఉన్న రోజులలో సంస్థానంలోని ఓఢ్రులకూ, తెలుగు వారికీ మధ్య వైమనస్యాలు అంకురించాయి.

"సంస్థానం ఓఢ్రులది. పాలకులు ఓఢ్రులు. సంస్థాన ప్రజలలో ఎక్కువ మంది ఓఢ్రులు. తెలుగువారు పరాయివారు, ఆగంతుకులు. వారికి ఈ సంస్థానంలో ఎలాంటి స్థానం ఉండకూడదు. ఓఢ్రభాష మాట్లాడే ప్రాంతా లన్నిటినీ కలిపి ప్రత్యేక ఉత్కళ రాష్ట్రం ఏర్పాటు చేయాలి" అని ఓఢ్రులు ఆందోళన చేయ సాగారు.

"పర్లాకిమిడి జమీందారు ఉత్కళు డైనా పర్లాకిమిడి తాలూకా జనాభాలో ముప్పాతిక మువ్వీసం తెలుగువారు అందుచేత పర్లాకిమిడి తాలూకాను క్రొత్తగా ఏర్పరచే ఒరిస్సా రాష్ట్రంలో కలపడానికి వీల్లేదు" అని గిడుగు రామమూర్తిగారి నాయకత్వంలోని 'ఆంటి ఎమాల్గమేషన్ పార్టీ' వాదించింది.

నిజానికి పర్లాకిమిడి రాజులు కూడా వెనుకటి తరాలలో తెలుగువారే అనీ, మధ్యలోనే వారికి ఒరియా భాష అలవడిందనీ సోపపత్తికంగా రామమూర్తి గారు నిరూపించారు. పర్లాకిమిడి రాజులు గాంగ వంశానికి చెందినవారు. అనంతవర్మ చోళ గంగ కటకాన్ని జయించి తన రాజధానిని ముఖలింగం నుంచి కటకానికి తరలించే వరకూ గాంగ వంశ రాజుల మాతృభాష తెలుగే అనీ, కటకం చేరిన తరువాతనే వారికి ఒరియా అలవడిందనీ రామమూర్తి బలమైన ఆధారాలతో నిరూ పించారు.

## సీతాపతి మీద రాజుగారి కోపం :

పర్లాకిమిడి రాజావారి కళాశాలలో హిస్టరీ లెక్చరర్‌గా పని చేస్తున్న సీతాపతిమీద రాజావారికి ఆగ్రహం కలిగించిన విచిత్ర సంఘటన ఒకటి జరిగింది.

1927లో రాజమండ్రీ ఆంధ్రా హిస్టారికల్ రీసెర్చ్ సొసైటీ వారు ముఖ లింగంలో జరిపిన సభల ఏర్పాటు పని అంతా రాజావారు సీతాపతికే ఒప్పగిం చారు. ఆ సభలు బాగా నిర్వహించాడని సీతాపతిని మెచ్చుకుంటూ ఆయన లేఖ కూడా వ్రాశారు.

ఆ ఏడాది డిసెంబరు నెలలో పర్లాకిమిడి నాటక సమాజాల చేత మద్రాసులో తెలుగు, సంస్కృతం, ఒరియా నాటకాలు ఆడించిన సందర్భంలో కూడా అక్కడ

ఏర్పాట్లు పెత్తన మంతా సీతాపతికే రాజావారు అప్పగించారు. అంతవరకూ సీతాపతిమీద అంత నమ్మకాన్ని ప్రదర్శించిన రాజావారి మనస్సు విరగడం చిత్రంగా ఒక నాటకీయ సన్నివేశం లాగ జరిగింది.

1928 ఏప్రిల్ నెలలో 'భారతీ తీర్థ' చతుర్థ వార్షికోత్సవ సభలను భీముని పట్టణంలో జరుపుతూ బుర్రా శేషగిరి రావు ఆ సభలకు అధ్యక్షులుగా పర్లాకిమిడి రాజాగారిని ఆహ్వానించారు. రాజా వారికి, ఆయన పరివారానికీ విజయ నగరంలో స్వాగతం చెప్పి, వారందరినీ కార్లమీద భీముని పట్టణానికి తీసుకుని వెళ్లే బాధ్యత సీతాపతిమీద పడింది. ఆ రోజులలోనే కాకతాళీయంగా పర్లాకిమిడి కాలేజ్ ప్రిన్సిపాల్ 'రాయ్' రిటైర్ కావడం, ఆయన స్థానే సీతాపతిని కాక ఆయనకంటె కొద్ది నెలలు సీనియర్ అయిన పారనంది జగన్నాథస్వామిని నియమించడం జరిగింది.

14వ తేదీ రాత్రి గం. 7 లకు వస్తా మన్న రాజావారి పార్టీ మర్నాడు ఉదయం గం. 5 లకు గాని రాకపోవడంవల్లా, 20 మంది పరివారంతో వస్తా మన్న రాజావారు 60 మంది పరివారంతో దిగడం వల్లా, రాజావారి పార్టీకి స్వాగత సన్నాహాల ఏర్పాటులో కొన్ని లోపాలు జరిగిన మాట నిజం! ఉద్దేశ పూర్వకంగా కాకుండా దురదృష్ట వశాత్తు జరిగిన ఆ లోపాలను రాజావారిని అవమాన పరచాలనే ఉద్దేశంతో సీతాపతి కావాలనే చేశాడనీ, పారనంది జగన్నాథ స్వామి ప్రిన్సిపాల్ అయ్యాడనే అక్కసుతో సీతాపతి కావాలనే రాజాగారిని కించ పరచారనీ రాజా వారి ఆశ్రితులు సీతాపతిమీద లేనిపోని నిందలు మోపి, రాజాగారికి బాగా పురి ఎక్కించారు. దానితో సీతాపతికీ, రాజావారికీ మధ్య అఘాతం ఏర్పడి క్రమంగా అది పెరుగ సాగింది.

## ఉత్కళ రాష్ట్రోద్యమం :

ప్రత్యేకాంధ్ర రాష్ట్రం కోసం ఆంధ్రులు ఉద్యమం ఆరంభించినట్లే ప్రత్యేక ఉత్కళ రాష్ట్రం కోసం ఓఢ్రులు ఉద్యమం సాగించారు. ఆ ఉద్యమ ప్రధాన నాయకులలో పర్లాకిమిడి రాజాగారు ఒకరు. నిజానికి పర్లాకిమిడి, బరంపురం ప్రాంతాలు తెలుగువారు అధిక సంఖ్యాకులుగా ఉన్న ప్రాంతాలైనా, తన అధికార

ప్రాబల్యాన్నీ, పలుకుబడినీ ఉపయోగించి రాజాగారు ఎలాగైనా ఆ ప్రాంతాలను కూడా క్రొత్తగా ఏర్పడబోయే ఒరిస్సా రాష్ట్రంలో చేర్పించాలని దీక్ష పూనారు.

అందుకు అవసరమైన ప్రజాభిప్రాయాన్ని కూడ గట్టడానికి అటు రాజా వారి పక్షంవారూ, ఇటు 'అంటీ ఎమాల్గమేషన్ పార్టీ' వారూ తాలూకాలో పెద్ద ఎత్తున ప్రచారం ప్రారంభించారు. మున్సిపాలిటీ, తాలూకా బోర్డు వంటి ప్రజా సంస్థలను స్వాధీనం చేసుకుంటే వాటి ద్వారా తమ తమ వాదాలకు అనుకూలంగా ప్రభుత్వం మీద ఒత్తిడి తేవచ్చునని ఇరు పక్షాలూ ఆశించాయి. దానితో రెండు పక్షాల మధ్యా తీవ్రమైన ఎన్నికల సంగ్రామం ప్రారంభమైంది.

## ఎన్నికల సంగ్రామం :

1931 లో పర్లాకిమిడి మున్సిపాలిటీకి ఎన్నికలు జరిగాయి. ఆ ఎన్నికలలో రాజావారి పార్టీ, ఆంటీ ఎమాల్గమేషన్ పార్టీ - రెండూ ఒకదానితో ఒకటి తలపడ్డాయి. వోటర్లలో నూటికి 60 మందికి పైగా తెలుగువారే అయినా ఎక్కువ మంది రాజావారి కొలువులో ఉండి, వారిమీద ఆధారపడిన వారు కావడంతో ఆ ఎన్నికలలో 'ఆంటీ ఎమాల్గమేషన్ పార్టీ' ఓడిపోయింది. పర్లాకిమిడి పుర వాసులకు అదే మొదటిసారి ఎన్నికలలో పాల్గొనడం. అంత వరకూ రాజావారు ఎవరిని నిలబెడితే వారే పోటీ లేకుండా ఎన్నిక అవుతూ వచ్చారు. తీవ్రమైన పోటీతో జరిగిన ఆ మొదటి ఎన్నికలో మున్సిపల్ కౌన్సిలర్లుగా తెలుగు వారే ఎక్కువ మంది ఎన్నిక అయినా, వారిలో చాలా మంది రాజా వారి అనుచర వర్గం లోని వారే అయారు. అందుచేత రాజావారి వత్తిడి వల్ల పర్లాకిమిడి తాలూకాను ఒరిస్సాలో చేర్చ వచ్చునని మునిసిపాలిటీ అధికార పూర్వకంగా తీర్మానం చేసి, ప్రభుత్వానికి పంపింది. అదే అభిప్రాయాన్ని ప్రకటిస్తూ ఒరిస్సా రాష్ట్ర సరిహద్దులను నిర్ణయించడం కోసం ఏర్పాటయిన 'ఒడెనల్' కమీషన్ వారికి ఒక నివేదికను కూడా పురపాలక సంఘం సమర్పించింది.

1921, 1931 జనాభా లెక్కల ప్రకారం పర్లాకిమిడి తాలూకాలోని 600 గ్రామాలలోనూ తెలుగువారే అధికులుగా ఉన్నారనీ, అందుచేత ఆ తాలూకాను ఒరిస్సా రాష్ట్రంలో చేర్చడం అనుచితమనీ 'ఒడెనల్' కమీషన్ ఎదుట రామ మూర్తిగారు తీవ్రంగా వాదించారు. తమ వాదాన్ని ఒక మహజర్ రూపంలో

అచ్చు వేయించి దాని ప్రతిని కూడా కమిషన్ వారికి ఆయన సమర్పించారు. తండ్రి సలహాతో ఆ నివేదికను సీతాపతే తయారు చేశారని తెలిసి, 4-2-1932 న కాలేజ్ ఉద్యోగం నుంచి రాజాగారు ఆయనను బర్తరఫ్ చేశారు దానితో ఆ రెండు కుటుంబాల మధ్యా అఖాతం మరింత పెరిగింది.

## తాలూకా బోర్డు అధ్యక్ష పదవి :

1932 నాటికి 'ఆంటీ ఎమాల్గమేషన్' పార్టీ బాగా బలం పుంజుకుంది. సభ్యత్వం సంఖ్య పెరిగింది. కాంగ్రెస్ ప్రముఖు లయిన ప్రనాం యజ్ఞేశ్వర శాస్త్రి, కన్నేపల్లి సత్యనారాయణ వంటి వారు కూడా కొందరు ఈ ఉద్యమానికి మద్దతు ఇచ్చారు.

అంతలో తాలూకా బోర్డు ఎన్నికలు వచ్చాయి. ఆ ఎన్నికలలో తెలుగు ప్రజలు తమ బలం నిరూపించుకుని పర్లాకిమిడి తాలూకా తెలుగు తాలూకాయే అని ప్రభుత్వానికి చాటాలని రామమూర్తి పంతులు ప్రబోధించారు.

ఆంటీ ఎమాల్గమేషన్ పార్టీ తాలూకాలోని మొత్తం 16 స్థానాలకూ పోటీ చేసింది. ప్రతి గ్రామానికీ పోయి తెలుగువారి తాలూకా అయిన పర్లాకిమిడిని ఒరిస్సా రాష్ట్రంలో చేర్చకుండా రక్షించుకోవలసిన బాధ్యత ప్రజల మీద ఉందని తీవ్రమైన ప్రచారం జరిపింది. ఆ ఎన్నికల హోరులో రాజాగారు గిడుగు వారిని రాజద్రోహులుగా చిత్రిస్తూ ఒక కరపత్రం ప్రకటించి పంచిపెట్టారు. ఆ కరపత్రానికి సమాధానంగా ధైర్య సాహసాలతో రామమూర్తి పంతులు "నిజానికి తమ రాజు 5 వ జార్జ్ చక్రవర్తే" అనీ, "పర్లాకిమిడి రాజు ఆ చక్రవర్తి దగ్గర పనిచేసే తాబేదారు మాత్రమే" అనీ ప్రకటిస్తూ ఘాటైన మరొక కరపత్రం అచ్చు వేయించి పంచి పెట్టారు సీతాపతికి రాజుగారి కొలువునుంచి విముక్తి లభించడంతో ఆయన కూడా బాహాటంగా ఉద్యమంలో దిగారు. రామమూర్తి పంతులుగారికి అప్పటికే 70 ఏళ్ళు నిండిన వృద్ధుడు కావడం వలన 'ఆంటీ ఎమాల్గమేషన్ పార్టీ' సీతాపతినే తమ నాయకుడిగా ఎన్నుకుంది

ఆ ఎన్నికలలో రాజావారి పార్టీకి 7 స్థానాలూ, ఆంటీ ఆమాల్గమేషన్ పార్టీకి 9 స్థానాలూ లభించాయి తాలూకా బోర్డు అధ్యక్షుని ఎన్నికకు తేదీ

నిర్ణయ మైంది. సాధారణంగా అన్ని ఎన్నికలలో జరిగే విధంగానే రాజాగారు కుతంత్రాలకు దిగారు. ఆంటీ ఎమాల్గమేషన్ పార్టీకి చెందిన బళ్ళ లచ్చన్న అనే అభ్యర్థిని జట్కాబండీలో పోతూ ఉండగా బలవంతాన బండీ దింపి, రహస్యంగా తీసికొనిపోయి, అంకా వీధిలోని ఒక గుడిలో దాచిపెట్టారు.

ఎన్నికకు ముందు రోజు సాయంత్రం రామమూర్తి ఇంటి వద్ద సమావేశం కావలసి ఉన్న ఆంటీ ఎమాల్గమేషన్ పార్టీ అభ్యర్థులలో 8 మందే ఆ సమావేశానికి హాజరయారు. 9వ వాడైన బళ్ళ లచ్చన్నను రాజాగారి మనుష్యులు ఎక్కడో దాచి పెట్టారని వారికి సమాచారం అందింది. వెంటనే ఆ పార్టీకి చెందిన సంకు సోమన్న ఇద్దరు రౌడీలతో సహా బయలుదేరి వెళ్ళి బళ్ళ లచ్చన్నను విడిపించుకుని వచ్చాడు.

బళ్ళ లచ్చన్నను బలవంతంగా రామమూర్తి తన ఇంట్లో నిర్బంధించారని రాజాగారు ఆ లచ్చన్న తమ్ముడి చేత పోలీసు రిపోర్టు ఇప్పించారు. వెంటనే పోలీస్ సర్కిల్ ఇన్‌స్పెక్టరు అప్పలస్వామి నాయుడు రామమూర్తి ఇంటికి వచ్చి విచారించాడు ఆయనతో లచ్చన్న "అయ్యా! నన్నెవ్వరూ నిర్బంధించలేదు. నా ఇష్టానుసారం నేను ఇక్కడికి వచ్చాను" అని చెప్పాడు. దానితో రాజాగారి ఆ చివరి ప్రయత్నం కూడా విఫలమైంది. ఆ మర్నాడు జరిగిన తాలూకా బోర్డు సభ్యుల సమావేశంలో సీతాపతి తాలూకా బోర్డు ప్రెసిడెంట్‌గానూ, దుక్కా రాజన్న రెడ్డి వైస్ ప్రెసిడెంట్‌గానూ ఎన్నిక అయారు.

ఆ విధంగా తాలూకా బోర్డును చేజిక్కించుకున్న ఆంటీ ఎమాల్గమేషన్ పార్టీ వారు ప్రజాభిప్రాయాన్ని కూడగట్టి పర్లాకిమిడి తాలూకాను మద్రాసు రాష్ట్రంలోనే ఉంచాలని కోరుతూ ప్రభుత్వానికి మహజర్లు అందచేశారు.

## సీతాపతి లండన్ యాత్ర :

'ఒడెనల్' కమీషన్‌లోని ఇద్దరు సభ్యులు పర్లాకిమిడి తాలూకాను ఒరిస్సా రాష్ట్రంలోనే చేర్చాలని వాదించినా, వారి వాదనను ఖండించి కమీషన్ అధ్యక్షుడు 'ఒడెనల్' పర్లాకిమిడి తాలూకా తెలుగు ప్రాంతమే అనీ, దానిని

ఒరిస్సాలో చేర్చరా దని తమ నివేదికలో పేర్కొన్నారు. ఆ నివేదిక ఆధారంగా వెలువడిన శ్వేతపత్రం (white paper) కూడా ఆ వాదననే బలపరచింది.

అయితే, లండన్‌లోని జాయింట్ పార్లమెంటరీ కమిటీ ఈ విషయంలో తుది నిర్ణయం చేయవలసి ఉంది. అందుచేత ఆ కమిటీ ఎదుట ఉభయ పక్షాల వారూ తమ తమ వాదాలను విన్నవించు కోడానికి లండన్ వెళ్ళవలసి వచ్చింది. ఆంటీ ఎమాల్గమేషన్ పార్టీ తమ ప్రతినిధిగా తాలూకా బోర్డు అధ్యక్షుడు సీతాపతిని లండన్ పంపించడానికి నిశ్చయించుకుంది. కాని, లండన్ వెళ్ళాలంటే ఆ రోజులలో కనీసం రూ. 3,000 లు కావాలి. విరాళాల ద్వారా ఆ మొత్తం వసూలు చేయడానికి నిశ్చయించుకున్నారు. ముందుగా రామమూర్తి పంతులు తమ విరాళంగా రూ. 1,000 లకు చెక్కు ఇచ్చారు. తాలూకా బోర్డు సభ్యులు ఎనమండుగురూ ఒక్కొక్కరు రూ. 100 ల చొప్పున ఇచ్చారు. తక్కిన మొత్తం కూడా అలాగే విరాళాల ద్వారా వసూలు చేశారు.

తెలుగు ప్రతినిధి వర్గానికి సర్. కె. వి. రెడ్డిగారు నాయకుడు, ఆ ప్రతినిధి వర్గంలో సీతాపతితో పాటు ఉన్నవ రామలింగం పంతులు, అయ్యగారి సుబ్బారావు మొదలైన వారు ఆరుగురు సభ్యులుగా ఉన్నారు.

1933 జూన్ 22 న ఓడమీద బయలుదేరి సీతాపతి లండన్ చేరుకున్నారు. లండన్‌లో సీతాపతిని చూడగానే రాజాగారు ఆశ్చర్య చకితు లయారు. పర్లాకిమిడి నుంచి వ్యయ ప్రయాసలకోర్చి తెలుగు ప్రతినిధు లెవరూ లండన్ రాబోరని ఆయన ఊహించారు. జాయింట్ పార్లమెంటరీ కమిటీ సభ్యులలో ఒకరైన జఫ్రుల్లాఖాన్‌ను ఆశ్రయించి తమ కార్యం సులభంగా సాధించుకోవచ్చునని ఆయన ఆశ పడ్డారు

పర్లాకిమిడి తాలూకాలోని తెలుగు వారికి ప్రతినిధిగా సీతాపతి వెళ్ళగా. సర్.కె.వి.రెడ్డి, ఉన్నవ రామలింగం, అయ్యగారి సుబ్బారావు ప్రభృతులు బరంపురం, ఛత్రపురం మొదలైన ఇతర తెలుగు ప్రాంతాల వారి ప్రతినిధులుగా లండన్ వెళ్ళారు. ఒరియా ప్రతినిధి వర్గంలో పర్లాకిమిడి రాజా, కళ్ళికోట రాజా మొదలైనవా రున్నారు.

పర్లాకిమిడి విషయమై సీతాపతి గట్టిగా పట్టు పట్టకుండా ఉంటే సీతాపతికి రూ. 25,000 లు ముట్టచెప్పగల మని బరంపురం నుంచి వచ్చిన ఒక తెలుగు ప్రతినిధి ద్వారా పర్లాకిమిడి రాజా రాయబారం పంపించారు. కాని నిప్పులాంటి రామమూర్తి పంతులు కుమారుడు కావడం వల్లా, అలాంటి ప్రలోభాలకు లొంగ వద్దని ముందుగానే తండ్రి కుమారుణ్ణి శాసించి ఉన్నందువల్లా రాజాగారి పన్నాగం పారలేదు.

జాయింట్ పార్లమెంటరీ కమిటి ఎదుట పర్లాకిమిడి ప్రజల పక్షాన సీతాపతి సుమారు 40 నిమిషాలు ప్రసంగించారు. ఆయన వాదనా పటిమను కమిటీ అధ్యక్షుడు సర్ శామ్యూల్ హోర్ మెచ్చుకున్నారు. మధ్య మధ్య జఫ్రుల్లా ఖాన్ అడ్డు ప్రశ్నలు వేస్తున్నా ఏ మాత్రం తొట్రుపడకుండా సీతాపతి పర్లాకిమిడి రాజా దురంతాల నన్నింటినీ నిర్మొహమాటంగా ఏకరువు పెట్టారు. "పర్లాకిమిడి తాలూకాలో తూర్పు ప్రాంతంలో ఓఢ్రులు అధిక సంఖ్యలో ఉన్నారని రాజాగారు వాదిస్తున్నందువల్ల ఆ ప్రాంతాన్ని ఒరిస్సాలో ఎందుకు చేర్చరా"దని జఫ్రుల్లా ఖాన్ సీతాపతిని ప్రశ్నించారు. "ఇతర ప్రాంతాల కంటె అక్కడ ఓఢ్రులు ఎక్కువగా ఉన్నమాట నిజమే అయినా అక్కడ తెలుగువారి సంఖ్య కంటె ఓఢ్రుల సంఖ్య అధికంకా"దని సప్రమాణంగా సీతాపతి నిరూపించారు. 1931 జనాభా లెక్కలు ఆధారంగా ఆ తూర్పు ప్రాంతంలో కూడా తెలుగువారి సంఖ్యే ఎలా ఎక్కువో ఆయన చూపించారు. జఫ్రుల్లాఖాన్ "ఓఢ్రుల జనాభాకు సవరల జనాభాను కలిపితే ఆ ప్రాంతంలో ఓఢ్రుల జనాభా ఎక్కువ అవుతుంది గదా!" అని వాదించగా సీతాపతి "సవరల జనాభాను ఓఢ్రుల జనాభాతో ఎలా చేరుస్తారు? సవరలు ఓఢ్రులూ కాదు, తెలుగువారూ కాదు" అంటూ ఆ వాదాన్ని ఖండించారు.

సీతాపతి వాదనను అంగీకరిస్తూ జాయింటు పార్లమెంటరీ కమిటీ మొదట పర్లాకిమిడి తాలూకాను ఒరిస్సాలో చేర్చరాదనే నిర్ణయానికే వచ్చింది. కాని ఆ కమిటీ రిపోర్టు 1935 వరకూ మూలపడి ఉండడంతో, 1934 లో పర్లాకిమిడి రాజా మళ్ళీ లండన్ వెళ్ళి, అనేక లక్షల రూపాయలు ఖర్చుపెట్టి, "ఒరిస్సా రాష్ట్రోద్యమ నాయకులలో నేను ఒకణ్ణి! తీరా ఒరిస్సా రాష్ట్రం ఏర్పడేటప్పుడు ఆ రాష్ట్రంలో నా జమీందారీ చేరక పోవడం నాకు ఎంత తలవంపులుగా ఉంటుందో ఆలోచించండి" అని సర్. శామ్యూల్ హోర్ వంటి పెద్దలను వేడు

◦న్నారు. చివరికి ఆయనను సంతృప్తిపరచడం కోసం పర్లాకిమిడి తాలూకాలోని 100 గ్రామాలలోనూ 200 గ్రామాలనూ, పర్లాకిమిడి పట్టణాన్నీ ఒరిస్సా రాష్ట్రంలో చేర్చడానికి ఆ కమిటీవారు నిశ్చయించారు.

## లండన్‌లో సీతాపతి :

ప్రధానంగా తాను లండన్ వచ్చిన పని పూర్తి అయిన తరువాత సీతాపతి లండన్‌లోనూ, ఆ పరిసరాలలోనూ గల ముఖ్య స్థలాలను సందర్శించారు. సర్ జార్జ్ గ్రియర్‌సన్, లండన్ యూనివర్సిటీలో డేనియల్ జోన్స్‌ను కలుసుకున్నారు. గ్రియర్‌సన్ పురుషకారంతో బ్రిటిష్ మ్యూజియంలో ఉన్న 1750-1800 మధ్య అచ్చుపడ్డ తెలుగు గ్రంథాలను చూశారు. యేట్స్ సహాయంతో ఆయన కారులోనే ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జ్ యూనివర్సిటీలను సందర్శించి వచ్చారు. ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో బాడ్లియన్ గ్రంథాలయం చూశారు. షేక్స్‌పియర్ ఫోలియో ఎడిషన్‌లూ, షేక్స్‌పియర్ స్వహస్తంతో వ్రాసిన వ్రాతప్రతులూ, ఆ ప్రతులలో పచ్చి శృంగారంతో ఉన్న కొన్ని పంక్తులూ యేట్స్ దొర ఆయనకు చూపించారు. అశ్లీలపు భాగాలను ప్రస్తుతం అచ్చులో ఉన్న షేక్స్‌పియర్ నాటకాలలో తొలగించారు.

లండన్ వెళ్ళే దారిలోనే పారిస్‌లో ఒకరోజు ఆగి, సీతాపతి అంతకు ముందు ఉత్తరాల ద్వారా తనకు పరిచితుడైన జ్యూల్ బ్లాక్‌ను కలుసుకున్నారు. అక్కడ ఆయన ఒక యూనివర్సిటీలో మహారాష్ట్ర భాషను బోధిస్తున్నారు. ఆయన కోరిక ప్రకారం సవరల సంగీత వాద్యాలు రెండు తమ వెంట తీసుకుని వెళ్ళి ఆయనకిచ్చారు. సవరల సంగీతాన్ని గూర్చి సీతాపతి ఇంగ్లీషులో వ్రాసిన ఒక వ్యాసాన్ని అక్కడి యూనివర్సిటీ సంచికలో ఆయన ప్రకటించారు.

చివరి రోజులలో తెలుగు భాషా సమితిలో ఉద్యోగం చేస్తున్న కాలంలో ఆయన ప్రాసంగికత మీది ప్రలోభంతో ఆయనను చూడడానికి వచ్చే మిత్రులకు రోజూ ఒకసారి అయినా తన లండన్ యాత్ర ముచ్చట్లను రకరకాలుగా సీతాపతి వర్ణించి చెబుతూ ఉండేవారు "నా దేశయాత్ర ముచ్చట్లు వివరిస్తూ వ్రాయాలంటే అది ఒక పెద్ద గ్రంథం అవుతుంది" అన్నారు సీతాపతి తమ స్వీయ చరిత్రలో.

లండన్ నుంచి తిరిగి వచ్చిన తరువాత ఆయనకు జరిగిన సన్మానాలను గురించి కూడా సీతాపతి స్వీయచరిత్రలో ఇలా వ్రాశారు : "లండన్ నుండి నేను పర్లాకిమిడికి తిరిగి వచ్చినప్పుడు తిలారు స్టేషన్‌నుండి పర్లాకిమిడివరకు 26 మైళ్లు మోటారుకార్లలో బ్యాండు మేళంతో జరిగిన ఊరేగింపు, త్రోవ పొడుగుననూ పెద్ద గ్రామాలవారు నాకు గావించిన సన్మానాలు మొదలైనవి వర్ణిస్తూ వ్రాయాలంటే ఒక పెద్ద గ్రంథమే అవుతుంది".

## పర్లాకిమిడి నుంచి వీడ్కోలు :

ఎంత తీవ్రమైన ఉద్యమం సాగించినా, చివరికి పర్లాకిమిడి పట్టణాన్నీ, ఆ తాలూకాలోని 200 గ్రామాలనూ ఒరిస్సా రాష్ట్రంలో కలిపివేయకుండా గిడుగు వారు నిరోధించలేక పోయారు. 1936 ఏప్రిల్ 1 వ తేదీ ఉదయం 10 గంటలకు ఒరిస్సా రాష్ట్రానికి ప్రారంభోత్సవ ముహూర్తం నిర్ణయమైంది. ఆ రోజు ఉదయం 7 గంటలకే రామమూర్తి పంతులు సతీ సమేతంగా రైలులో రాజమండ్రి బయలు దేరారు. 22 ఏళ్ళ పాటు తన పరిశోధన కలాపాలు సాగించిన పర్లాకిమిడిలోని తన సొంత ఇంటికి కన్నీళ్ళతో ఆయన వీడ్కోలు చెప్పారు. ఇంటి వద్ద జట్కా ఎక్కేటప్పుడూ, రైలు స్టేషన్‌లోనూ వందలాదిమంది తెలుగువారూ, ఉత్కళులూ కూడా గుమిగూడి కన్నీళ్ళతో ఆయనకు వీడ్కోలు ఇచ్చారు.

తనకు వీడ్కోలు ఇవ్వడానికి వచ్చిన వారిని ఉద్దేశించి రైలు ప్లాట్‌ఫారం మీద రామమూర్తి పంతులు ఇలా ప్రసంగించారు :

"తెలుగువారు అధిక సంఖ్యాకులుగా ఉన్న పర్లాకిమిడిని, 200 గ్రామాలను అన్యాయంగా ఒరిస్సా రాష్ట్రంలో చేరుస్తున్నందుకు నిరసనగా నేను నా ఇంటిని, నా స్వగ్రామాన్ని విడిచి వెళ్తున్నాను. మిమ్మల్ని అందర్నీ విడిచి వెళ్ళడం నాకైతే కష్టంగానే ఉంది. ఒరిస్సా రాష్ట్రం ఏర్పడినందుకు నేను నిరసించి వెళు తున్నానని కొందరు అనుకొంటూ ఉన్నారని విన్నాను. అది పొరపాటు. ఆంధ్రులు ఆంధ్రరాష్ట్రం కావాలని ఎలా కోరుకొంటున్నారో అలాగే ఓఢ్రులు ఒరిస్సారాష్ట్రం కోరుకొనడం సహజం. వారికి సొంత రాష్ట్రం ఏర్పడినందుకు నేను ఎంతో సంతో షిస్తున్నాను; వారిని అభినందిస్తున్నాను. నా నిరసన ఒక పర్లాకిమిడి విషయంలోనే! మీరంతా మీ భవిష్యత్తును నిర్ణయించుకొనండి. త్వరలో ఆంధ్ర రాష్ట్రం కూడా

ఏర్పడవచ్చును. అప్పుడు అవకాశముంటే మీ పోరాటాన్ని సాగించి మళ్ళా మన పర్లాకిమిడి మనకు దక్కేటట్లు ప్రయత్నించండి. మీకు ఈ విషయంలో సీతాపతి సహాయం చేయగలడు. నేను బ్రతికి ఉండగా పర్లాకిమిడి తెలుగు వారికి దక్కితే తిరిగి ఇక్కడకు వస్తాను; లేకపోతే రాను, సెలవు!".

## సినిమాలలో సీతాపతి :

సీతాపతిలో చిన్ననాటి నుంచీ బలంగా అభివ్యక్తం అవుతూ వచ్చిన సహజ ప్రవృత్తులు: కవిత్వం, నటన. చిన్ననాడే తన బాల్యమిత్రుడు బుర్రా శేషగిరిరావుతో కలిసి చిత్తూరు రాణి పద్మిని, రాణీ సంయుక్త, కృష్ణకుమారి మొదలైన నాటికలు రచించి ప్రదర్శిస్తూ ఉండడం వెనుకటి అధ్యాయాలలో మనం గమనించాము. 1896-98 సంవత్సరాల మధ్య వీరి నాటకాలను చూసిన గురజాడ అప్పారావుగారి శిష్యుడు పైడి ఘంటం కృష్ణారావు ఈయనలోని నటనా ప్రతిభను గుర్తించి పెద్ద నాటకాలలో కూడా ఈయనకు పాత్రలు ఇచ్చి తగిన శిక్షణ ఇస్తూ వచ్చారు. 1903 లో మద్రాసు క్రిష్టియన్ కాలేజ్‌లో బి.ఏ. చదువుతున్న రోజులలో కళాశాల వార్షికోత్సవాల సందర్భంలో కొన్ని నాటక ప్రదర్శనలలో పాల్గొని ఆ నాడే ఉత్తమ నటుడుగా కీర్తి గడించుకొన్నారని కళాప్రపూర్ణ మిక్కిలినేని రాధా కృష్ణమూర్తి వ్రాశారు. అటు తరువాత 1927 డిసెంబరు నెలలో పర్లాకిమిడి నాటక సమాజాలచేత మద్రాసులో తెలుగు, సంస్కృతం, ఒరియా నాటకాలు ఆడించే కార్యక్రమానికి సీతాపతే ఆధ్వర్యవము వహించారు. "ఆ నాటకాలలో నా పాత్రాభినయం చాలా బాగుంటుందని మెచ్చుకొనేవారు" అని సీతాపతి తన స్వీయచరిత్రలో అన్నారు.

మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి వ్రాసిన ఒక పరిశోధక వ్యాసం వల్ల సీతాపతి నట జీవితానికి సంబంధించిన కొద్ది పాటి వివరాలు తెలియ వస్తున్నాయి. మద్రాసులో బి ఏ, చదువుకునే రోజులలో సీతాపతి వేదం వేంకట రాయశాస్త్రి గారి మెప్పు పొందారట!

1908 - 1910 మధ్య పర్లాకిమిడిలో పైడిఘంటం కృష్ణారావు దర్శకత్వంలో ప్రతాపరుద్రీయం నాటకంలో ఒక సారి పేరిగాని పాత్రనూ, మరొక సారి యుగంధరుని పాత్రనూ సీతాపతి ధరించారు. అయితే - "పేరిగాని పాత్ర

అంత సహజంగా యుగంధరుని పాత్రను నేను పోషించ లేక పోయాను" అని సీతాపతి అంటూ ఉండేవారు.

మరో సారి మద్రాసులో బళ్ళారి రాఘవ 'రామదాసు' నాటకంలో తానీషా పాత్రను సీతాపతి ధరించారు. మొత్తం 50 నాటకాలలో సీతాపతి నటించి నట్టు తెలుస్తూంది. బళ్ళారి రాఘవతో కలసి 4, 5 సార్లు నటించి ఆయనవల్ల నటనలో కొన్ని మెలకువలు ఆయన గ్రహించారు. 'రాఘవ'తో కలసి చివరిసారి ఆయన నటించిన నాటకం పిఠాపురం యువరాజా వ్రాసిన 'తీరని కోరికలు'.

సీతాపతి సినిమాలలో చేరడం కాకతాళీయంగా జరిగింది. 1938లో సీతాపతి ఉద్యోగాన్వేషణ చేస్తూ మద్రాసు వెళ్లారు. అక్కడ తన మిత్రుడైన గూడవల్లి రామబ్రహ్మంగారిని కలిసి ప్రజామిత్ర సంపాదక వర్గంలో తనకు స్థానం కల్పించవలసిం దని కోరారు. సీతాపతి విగ్రహ పుష్టి చూడగానే ఆయనకు ఏమి అనిపించిందో ఏమో గాని డ్రాయరులోనుంచి ఒక ఆల్బం పైకి తీశారు. రామబ్రహ్మం తీయబోయే 'రైతుబిడ్డ' చిత్రంలో వివిధ పాత్రధారుల ఫొటోలు అంటించి ఉన్న ఆల్బం అది. ఆ ఆల్బంలో జమీందారు పాత్ర ఫొటో అంటించవలసి ఉన్న కాగితం ఖాళీగా ఉంది. "సీతాపతిగారూ! ఈ ఖాళీని మీరు భర్తీ చేయగలరా ?" అన్నారు రామబ్రహ్మం. తాను ఎన్నడూ ఊహించి ఉండని ఆ ప్రశ్నకు సీతాపతి నిర్ఘాంత పోయారు. "నేను చాలా మందిని చూశాను. కాని నాకు ఎవరూ నచ్చలేదు. మీ విగ్రహం, మీ ఠీవీ ఈ పాత్రకు సరిగ్గా సరిపోతాయని నాకు అనిపిస్తూంది. మీరు ఈ పాత్ర ధరిస్తే రైతుబిడ్డ పాత్ర ధరిస్తున్న బళ్ళారి రాఘవకు మీరు సరి ఉజ్జీగా ఉంటారు. మీరు ఒప్పుకోకపోతే ఇంక నేనే ఆ పాత్రను వెయ్యవలసి వస్తుంది" అని కూడా అన్నారు రామబ్రహ్మం.

మొదట కొంత సంకోచించినా ఆ నాటి తన ఆర్థిక పరిస్థితులలో అది తనకు దైవం పంపిన వరంగా భావించి, సీతాపతి అందుకు అంగీకరించారు. రామ బ్రహ్మంగారు అన్నట్లే 'రైతు బిడ్డ' సినిమాలో 'బళ్ళారి రాఘవ' ప్రక్కన జమీందారుగా సీతాపతి ఎంతో నిండుగా కనిపించారు

1938 నవంబరులో ఆ విధంగా గూడవల్లి రామబ్రహ్మం గారి చలువ వల్ల సినీమా రంగ ప్రవేశం చేసిన సీతాపతి 1938-1947 మధ్య మొత్తం ఏడు చలన చిత్రాలలో నటించారు.

| చిత్రం పేరు | వేషం |
|---|---|
| 1. రైతుబిడ్డ | జమీందారు |
| 2. ఇల్లాలు | నాయిక తండ్రి |
| 3. భక్తిమాల | రామానుజాచార్యులు |
| 4. పంతులమ్మ | మునిసిపల్ చైర్మన్ |
| 5. స్వర్గసీమ | ఆఫీస్ మేనేజర్ |
| 6. మాయాలోకం | మంత్రి |
| 7. పల్నాటి యుద్ధం | ఒక వీరుడు. |

సినిమాలలో నటించడం, రాజకీయాలలో ఎత్తుకు పై ఎత్తులు వేయడం సీతాపతి సహజ ప్రవృత్తికి అనుగుణమైనవే అయినా, ఆయన ప్రధానంగా తండ్రి ఒద్దికలో పెరిగిన కుమారుడు కావడం వల్లా, ఆయన సహజ ప్రవృత్తులకు సరియైన ప్రోద్బలం లభించనందువల్లా ఆ రెండు రంగాలలో దేనిలోనూ ఆయన స్థిరపడడం గాని, ఘన విజయాలు సాధించడం గాని జరుగలేదు.

ఏమైనా - సీతాపతి జీవితంలో సినిమారంగ విహారం, రాజకీయ రంగ విలాస యాత్ర మధ్యలో వచ్చిన అవాంతర కథలే కాని, ఆయన జీవిత ప్రధాన కథలో అంతర్భాగాలు కాలేదు.

# 8

# భారతీ శతకం

సీతాపతి రచించిన సృజనాత్మక సాహిత్యంలో భారతీ శతకం సుప్రసిద్ధం కావడం వల్ల అదే ఈ అధ్యాయానికి శీర్షిక అయినా, ఆయన వ్రాసిన సృజనాత్మక సాహిత్య రచన లన్నిటినీ పరామర్శించడం ఈ అధ్యాయం ధ్యేయం.

బాల్యంలోనే, సీతాపతి మూడవ ఫారం చదువుతున్నప్పుడే - 1897లో పులుగుర్తి లక్ష్మీనరసింహం అనే కవి పర్లాకిమిడికి వచ్చి కొన్నాళ్ళు వారి ఇంట ఉండడం, ఆయన వద్ద తెలుగు ఛందస్సు నేర్చుకొని సీతాపతి తెలుగులో పద్యాలు వ్రాయ నారంభించడం, తన బాల్య స్నేహితుడు బుఱ్ఱా శేషగిరిరావుతో కలిసి విక్టోరియా రాణి డైమండ్ జూబ్లీ ఉత్సవానికి 10 పద్యాలు వ్రాసి సభలో చదివి నలుగురి మెప్పునూ పొందడం మొదలైన విషయాలను ఈ గ్రంథం తొలి అధ్యాయాలలో మనం గమనించాము.

ఆ విధంగా బాల్యంలోనే సీతాపతిని భారతీదేవి అనుగ్రహించినా, చండశాసనుడైన తండ్రి నిషేధం వల్ల నిర్నిరోధంగా ఆయన కవితా వ్యాసంగం కొనసాగే అవకాశం లేకపోయింది. అయినా - అడపా దడపా, చాటునా మాటునా, సీతాపతి పద్యాలు వ్రాయడం జీవితాంతం కొనసాగుతూనే వచ్చింది. అలా ఆయన వ్రాసిన పద్యాలలో కొన్ని ఏవేవో పత్రికలలో ఆ నాడు ప్రచురింప బడినట్లు కూడా తెలుస్తూంది. అయితే వాటి నన్నిటినీ ఏకత్రితం చేసి గ్రంథ రూపంగా ప్రకటించడం జరుగలేదు.

## అనువాదాలమీద ఆసక్తి :

సీతాపతి మద్రాసులో బి.ఏ. చదువుతున్న రోజులలో తండ్రి అడ్డంకి లేకపోవడం వల్ల నిర్భయంగా, నిర్నిరోధంగా అక్కడ ఆయన కవితా వ్యాసంగం కొనసాగినట్టు స్వీయచరిత్రలో ఆయన వ్రాసుకున్నారు.

సీతాపతి తెలుగు పద్యాలు వ్రాస్తూ ఉండడం చూసి మద్రాసులో ఆయన మిత్రుడు దర్భా శివరామదాసు ఆయనకు ఏవేవో సమస్యల నిచ్చి పూరించ మనే వాడట. అలా ఆయన పూరించిన సమస్యా పూరణ పద్యాలన్నీ ఈ నాడు లభ్యం కావడం లేదు. వాటిలో ఒక్కటే పద్యం తనకు జ్ఞాపకం ఉన్నదని సీతాపతి స్వీయచరిత్రలో ఉదాహరించారు.

సమస్య : 'సుఖమా? సుఖమా? యనంగ సుఖమే యనియెన్

పూరణం :

కం. సుఖమా పద్మమ! నగు నెల?
సుఖమా లత! రాజహంస సోకిన నిన్నున్?
సుఖమా చక్రమ! కరములు?
సుఖమా? సుఖమా? యనంగ సుఖమే యనియెన్.

ఈ సమస్యలోనూ, ఈ సమస్యా పూరణంలోనూ ఎక్కువ చమత్కృతి గాని, క్లిష్టత గాని లేకపోయినా పద్యరచనలో సీతాపతి సాధించిన ధారాశుద్ధీ, లలిత పదబంధ నైపుణీ దీనిలో వ్యక్తం అవుతున్నాయి.

బి.ఏ.లో సీతాపతికి సంస్కృతం బోధించిన గురువు వేదం వేంకట రాయశాస్త్రి. భవభూతి వ్రాసిన మాలతీ మాధవం ఆయన పాఠం చెబుతూ ఉండేవారు. దాసు శ్రీరాములు, జనమంచి వేంకట్రామయ్యలు చేసిన మాలతీ మాధవం తెలుగు అనువాదాలు కొనుక్కొచ్చి సీతాపతి మూలానికి తమ గురువు గారు చెప్పిన మనోహరమైన విశేషార్థాలన్నీ ఆ అనువాదాలలో వచ్చాయో లేదో చూస్తూ ఉండేవారు. వాటిలో కొన్ని శ్లోకాల అనువాదం తనకు నచ్చకపోతే తానే స్వయంగా ఆ శ్లోకాలను తెలుగులోకి అనువదిస్తూ ఉండేవారు అలా అనువదించిన పద్యాలను శాస్త్రిగారి ఇంటికి వెళ్ళి ఆయనకు చదివి వినిపించి తన అభిప్రాయాలు సరి అయినవో కావో ఆయనను అడిగేవారు. శాస్త్రిగారు ఓర్పుగా ఆయన వాదాలను విని వాటిలోని మంచి చెడ్డలను ఆయనకు వివరించేవారు.

ఒక రోజున మాలతీ మాధవంలోని ఈ క్రింది శ్లోకాన్ని సీతాపతి తెలుగు చేయడం జరిగింది.

"అన్యేషు జంతుషు చ య స్తమసా ఽఽ వృతేషు
విశ్వస్య ధాతరి సమః పరమేశ్వరేఽ పి।
సోఽయం ప్రసిద్ధ విభవః ఖలు చిత్త జన్మా
మా లజ్జయా తవ కథంచి దపహ్నుతి ర్భూత్॥"

ఈ శ్లోకానికి సీతాపతి తెలుగు సేత.

చం. "మనసిజుఁ డెంతయేని నసమాన పరాక్రమవంతుఁ డందుచే
గొనముల మూఁటిలోఁ దమము గూడిన జంతువు లన్నియున్ జగ
జ్జనకుఁడు బ్రహ్మయున్ నిటల చక్షుఁడు శంభుఁడు నోడ, మాధవుం
డన నొక లెక్కయే? మన రహస్యము లింకను దాప నేటికిన్?

మాలతీ మాధవం నాటకంలో మకరందుడు మాధవునితో అనే మాటలు ఇవి. "తమో గుణంచేత ఆవరించబడిన ఇతర ప్రాణుల విషయంలోనే కాక ఈ ప్రపంచాన్ని సృష్టించిన బ్రహ్మదేవుని విషయంలోనూ, పరమేశ్వరుని విషయం లోనూ కూడా మన్మథుడు తన ప్రభావాన్ని సమానంగా ప్రదర్శిస్తాడు. అందు చేత మిత్రమా! ఎందుకు ఈ లజ్జ? ఎందుకు నా దగ్గర నీ ప్రణయ కలాపాన్ని ఇంకా దాస్తావు?" అంటాడు మూలంలో మకరందుడు మాధవునితో. దీనిని సీతా పతి యథామూలంగా కాకుండా "మాధవుం డన నొక లెక్కయే" అని క్రొత్తగా మాధవుని పేరు చేర్చడం బాగుందని వేంకట రాయ శాస్త్రిగారు మెచ్చుకున్నారు. 'మాధవ' శబ్దాన్ని విష్ణువు, తన మిత్రుడైన మాధవుడు అని రెండర్థాలు వచ్చే టట్లు శ్లేషతో ప్రయోగించడం, మూలంలో బ్రహ్మ, శివుడు మాత్రమే పేర్కొన బడగా త్రిమూర్తులలో మూడవ వాడైన విష్ణువును కూడా ఈ అనువాదంలో స్ఫురింపచేయడం గురువుగారి ప్రశంసల నందుకున్నాయి. స్వతః అనువాదం మూల విధేయంగా ఉండడమే వేంకటరాయ శాస్త్రికి అభిమతం అయినా మూలా నికి వ్యాఖ్యాన ప్రాయంగా చేసిన సీతాపతి అనువాదాన్ని ఆయన మెచ్చుకోకుండా ఉండలేక పోయారు.

అనువాద కళమీద ప్రీతి ఆ విధంగా సీతాపతికి తాను బి.ఏ. చదువుతున్న రోజులలోనే ఆరంభమైంది. సీతాపతి సంస్కృతంలో నుంచి తెలుగులోకే

కాకుండా, తెలుగులో నుంచి సంస్కృతంలోకి, సవరభాష నుంచి ఇంగ్లీషులోకి కూడా కవిత్వాన్ని అనువదించారు.

## కువలయావళి నాటిక :

సంస్కృతంలో నుంచి సీతాపతి తెలుగు చేసిన ప్రధాన రచన 'కువలయావళి' నాటిక. దీనికే 'రత్న పాంచాలిక' అని మరొక పేరు. ఇది సర్వజ్ఞ సింగభూపాల విరచితం. పిఠాపురం మహారాజా రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరు వారి ప్రేరణతో ఈ నాటిక అనువదించబడి ఆయన చేతనే 1946 లో ప్రకటించబడింది. ఎడమచేతి వైపు పుటలో తెలుగు లిపిలో సంస్కృత మూలం, కుడిచేతి వైపు పుటలో సీతాపతి చేసిన అనువాదం ప్రకటించ బడ్డాయి.

సర్వజ్ఞ సింగ భూపాలుడు పద్మనాయక (వెలమ) ప్రభువు. వెలమ ప్రభువైన పిఠాపురం రాజావారు ఆ సింగభూపాలుని కృతులను తెలుగులోకి అనువదింపచేసి ప్రకటించారు. 'కువలయావళి' అనే ఈ నాటికనే కాక సంస్కృతంలో 'రసార్ణవ సుధాకరం' అనే ఒక అలంకార గ్రంథాన్ని, 'సంగీత సుధాకరం' అనే సంగీత రత్నాకర వ్యాఖ్యానాన్నీ కూడా సింగభూపాలుడు రచించారు.

"సర్వజ్ఞ సింగ మహీపతి సుమనో మనోజ్ఞమైన కవితా ప్రజ్ఞ కలిగి వెలిగెను. సంస్కృత నాటక కవి శిఖామణులైన కాళిదాస శూద్రక భవభూతులకుం దీసిపోవు వాఁడు కాఁడు" అని తమ తొలి పలుకులో పిఠాపురం రాజావారు సర్వజ్ఞ సింగభూపాలుని కొనియాడారు.

కువలయావళి దశ విధ రూపకాలలో ఏ ప్రక్రియకూ చెందింది కాదు. ఉప రూపకాలలోని 'నాటిక' అనే ప్రక్రియకు సంబంధించిన రూపకం ఇది. నాటిక లక్షణం- నాలు గంకాలు ఉండడం, శృంగార రస ప్రధానమై ఉండడం, నాయకుడు ధీర లలితుడై ఉండడం. 'ధీర లలితుడు' అంటే కళాసక్తుడూ, విలాస పురుషుడూ అని అర్థం. ఈ నాటికలో నాయకుడు శ్రీకృష్ణుడు. నాయిక కువలయావళి.

ఈ నాటికలోని కథ సంగ్రహంగా ఇది;

కువలయావళి అపురూపమైన సౌందర్యవతి; దేవతా కాంత. వెనుకటి జన్మలో ఆమె రుక్మిణీదేవి చెల్లెలు. ఆమె ఒక విచిత్రమైన వ్యక్తి. స్త్రీలకు సాధారణ స్త్రీ లాగానే కనిపిస్తుంది. కాని పురుషులకు మాత్రం ఒక రత్నపాంచాలిక (రత్నాల బొమ్మ) లాగ కనిపిస్తుంది. కలహ ప్రియుడైన దేవర్షి నారదుడు ఆమెను రుక్మిణి వద్ద 'న్యాసం' (దాచమని ఇచ్చిన వస్తువు) గా ఉంచడంతో కథ ఆరంభం అవుతుంది. అపురూప సౌందర్యవతి అయిన కువలయావళిని శ్రీకృష్ణుని కంట పడకుండా చూడాలని రుక్మిణీదేవీ, ఆమె సపత్నులు సత్యభామా మొదలైన వారూ ప్రయత్నిస్తారు. కాని కాల యవనుని జయించడానికి వెళ్లి తిరిగి వచ్చిన శ్రీకృష్ణునికి రుక్మిణీ దేవి విలాసోద్యాన వనంలో నడయాడుతూ కువలయావళి కనిపించనే కనిపిస్తుంది. ప్రథమ వీక్షణంలోనే ఆ ఇరువురి హృదయాలలో అనురాగం అంకురిస్తుంది. వారి ప్రణయ వల్లరి చిగురించకుండా చూడాలని రుక్మిణీ, సత్యభామా మొదలైన వారు ఎన్నో అంతరాయాలు కల్పిస్తారు. నాటకీయమైన అనేక విచిత్ర సన్నివేశాల అనంతరం నారదుడు రుక్మిణికి కువలయావళిని గూర్చిన వాస్తవ వృత్తాంతం చెప్పడం, తన సపత్నుల అంగీకారంతో రుక్మిణీ దేవి స్వయంగా కువలయావళిని శ్రీకృష్ణుని కిచ్చి వివాహం జరిపించడంతో ఈ నాటిక సుఖాంతంగా ముగుస్తుంది.

భాసుడు రచించిన స్వప్న వాసవదత్తంతోనూ, శ్రీహర్షుడు వ్రాసిన రత్నావళి నాటికతోనూ విశేష సామ్యాలు గల ఈ కువలయావళి నాటికను పిఠాపురం రాజాగారు మొదట 1945 లో ఒక సత్యనారాయణశాస్త్రి చేత అనువదింపజేశారు గాని దానిలో తప్పులు దొరలినాయని పండితులు చెప్పడంచేత రాజాగారు ఆ నాటికను తిరిగి అనువదించమని సీతాపతిని కోరారు. ఆ విధంగా సీతాపతి ఈ నాటికను అనువదించడం, దీనికి రాజాగారు ఆయనకు వెయ్యి రూపాయలు పారితోషికం ఇవ్వడమే కాకుండా, 1946 లో దానిని ప్రకటించడం కూడా జరిగాయి.

కువలయావళి అనువాదంలో సీతాపతి సంస్కృత పాండిత్యం, తెలుగులో మౌలిక రచన అనిపించేటంత సరళంగా తెలుగు చేయగల ప్రజ్ఞ తనకు గల రంగస్థలానుభవంతో అనువాదాన్ని ప్రదర్శన యోగ్యంగా తీర్చి దిద్దడం మనకు కనిపిస్తాయి.

సీతాపతి అనువాద కళా ప్రతిభను గుర్తించడానికి వీలుగా రెండు మూడు శ్లోకాల అనువాద ధోరణిని ఇక్కడ పరామర్శిద్దాము. ద్వితీయాంకంలో ఉద్యాన వనంలో చాటున ఉండి శ్రీకృష్ణుడు కువలయావళి తన చెలికత్తె చంద్రలేఖతో సాగించే సంభాషణను వింటాడు. ప్రసంగ వశాన కువలయావళి చెలికత్తెతో ఇలా అంటుంది.

"చెలీ! అతని యెడల నీ కాశంక కలుగుట సరి యయినదే! ఏల యన అతడు కాళిందీ జల విహారము చేయుచుండిన వల్లవ నితంబినుల కోకల నపహరించిన దొంగ యని విందుము కదా!"

వెంటనే శ్రీకృష్ణుడు తాను ఆమె ఎదుట పడడానికి సరి అయిన అదను లభించిందని సంతోషపడుతూ, ఆమెను సమీపించి ఇలా అంటాడు:

పద్భ్యాం పద్మ రుచిం నిషంగ సుషమాం జంఘ శ్రియా ధూన్వతీ
మూరుభ్యాం కదళీ ప్రభా మురసిజ ద్వంద్వేన కుంభ శ్రియమ్
పూర్ణేందు ద్యుతి మాననేన విదితం ముగ్ధే! స్వయం ముష్ణతీం
మా మేవం విపరీత భాషిణి! వృథా పాటచ్చరం భాషసే॥

ఈ శ్లోకానికి సీతాపతి తెలుగు సేత—

చం. చరణములన్ సరోజ రుచి, జంఘలు కల్మి నిషంగ శోభ, న
య్యరఁటి వికాస మూరువుల, హారి కుచద్వయిఁ గుంభ లక్ష్మియున్
నెర నెల దీప్తి నాస్యమున నీవు హరించి యకారణంబ యా
వరుసను నన్ను దొంగ యని పల్కెదువే విపరీత భాషిణీ!

"నీవు తామర పువ్వుల శోభను దొంగిలించి పాదాలలోనూ, అరటి బోదల అందాన్ని తొడలలోనూ, పున్నమి చంద్రుని కాంతిని ముఖంలోనూ ఇలా ఎన్ని సొగసులనో దొంగిలించి నీ అంగాలలో దాచుకొని కూడా నన్ను 'దొంగ' అనడం ఇదేమి న్యాయం?" అని శ్రీకృష్ణుడు ఈ పద్యంలో ఆమెను నిగ్గదీస్తాడు.

ఈ అనువాదంలో మూల విధేయతా, అయినా తెలుగులో స్వతంత్ర రచన అనిపించేటంత సరళతా గోచరించడమే కాక నటుడు చక్కగా గానం చేయడానికి వీలుగా విరుగుతూ పద్యం నడవడం కూడా పాఠకులను ఆకట్టుకుంటుంది

తరువాత శ్రీకృష్ణుడు "దొంగ దగ్గరనే దొంగతనం చేసే జాణవు నీవు. నేను దొంగ నయితే నా హృదయాన్నే హరించిన నీవు నన్ను మించిన దొంగవు కావా?" అంటాడు, ఈ క్రింది శ్లోకంలో—

చోరస్యాపి ధనం హస్తే హరన్తీ కుటిలేక్షణే !
చౌర్య విద్యా విశేషేణ మా మతిక్రమ్య వర్తసే॥

తెలుగు సేత :

చోరకుని చేతి ధనమును చూఱ గొనుచు
నున్న దానవు గావున నన్ను గూడ
చౌర్య విద్యా విశేష కౌశలము నందు
మించి వర్తించు దానవో చంచలాక్షి !

సరళంగా సర్వ జన సుబోధంగా అనవదించడంలోనే కాకుండా అవసర మైతే ప్రౌఢంగానూ, సమాస జటిలంగానూ కూడా తెలుగు చేయగల దిట్ట సీతాపతి. ఈ పద్యం చూడండి :

మ. తతశైలాగ్ర విఘట్టనోద్యమ లసత్ ప్రఖ్యాత వజ్రాయుధో
ద్ధత ఘాతంబు లవెన్ని గావలయు సిద్ధార్థంబు ఖండింపగా ?
నతి దృప్యన్మద కుంభి కుంభ దళనాభ్యాసంబు గన్నట్టి యు
న్నత పంచాస్య చపేటికల్ మశకమున్ జంపంగఁ బెక్కేటికిన్ ? (4-6)

అయితే, విద్వాంసుల విమర్శలకు అవకాశ మిచ్చే ప్రయోగాలు కూడా కొన్ని సీతాపతి అనువాదంలో దొర్లక పోలేదు. ఈ పద్యం చూడండి :

గీ. స్వచ్ఛములు సుజాతంబులు సమ్మిళితము
లయిన రత్నంబులను బోలి యలరు చుండు

దేవెరుల బృంద మిచ్చోట దృశ్యమగుచు
నహహా! నా డెంద మానంద మంద జేయు (1-7)

ఈ పద్యంలో 'దృశ్యమాన మగుచు' అనడానికి బదులు 'దృశ్య మగుచు' అనడం, 'దేవేరుల బృందం' అనడానికి బదులు ఛందస్సు సరిపుచ్చడం కోసం "దేవెరుల బృందం' అనడం సమర్థనీయాలు కావు.

1949 లో ఈ అనువాదం మీద త్రిలింగ పత్రికలో ఒక విమర్శ వెలువడినట్టూ, దానిలో తాను ఒప్పుకోక తప్పని దోషాలు మూడు ఆ విమర్శకుడు చూపించినట్టూ, ఆ విషయాన్ని తాను మహారాజావారి దృష్టికి తేగా 1949 ఏప్రిల్‌లో ఆ దోషాలు సవరింపబడిన ద్వితీయ ముద్రణను రాజాగారు ప్రకటించి నట్టూ సీతాపతి స్వీయచరిత్రలో వ్రాసుకున్నారు.

## కట్టబొమ్మ నాటకం :

సంస్కృతంనుంచి 'కువలయావళీ' నాటికను అనువదించడమే కాకుండా 'కట్టబొమ్మ' అనే ఒక స్వతంత్ర నాటకం కూడా తెలుగులో సీతాపతి రచించారు. దేశభక్తి బోధకమైన వీర రసాత్మకమైన ఒక విషాదాంత నాటకం 'కట్టబొమ్మ'. ఈ నాటక రచనలో సీతాపతి ప్రతిభను ఉగ్గడిస్తూ వ్రాసిన ఒక వ్యాసంలో వడ్లమూడి గోపాల కృష్ణయ్య ఇలా అన్నారు:

"ఎనిమి దంకా లున్న ఈ నాటకంలో శ్రీ సీతాపతి గారి నటనానుభవంతో సార్థక శబ్ద ప్రయోగం వల్ల కలిగిన సంభాషణా చమత్కృతి, భావానుగుణ్యమైన రాగ రంజిత వృత్త రచనా శక్తికి మూలమైన ఛంద స్సంగీత నైపుణ్యం ప్రతి బింబిస్తున్నది".

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి నందుకొన్న ఈ నాటకంలో నాటకానుకూల మైన పద్య రచనకు ఒక మచ్చు తునుక :

శా. ఓరీ భీరు కులాధమా! ప్రజలు లేరో? నీకు రాజత్వమే
భారం బాయెనా? పౌరుషం బుడిగెనో? స్వాతంత్ర్య మే మయ్యెరా?

వైరుల్ లంచము లిచ్చి దోచికొనిరా? వాగ్దానమున్ చేసిరా?
పేరాసన్ బడి పారతంత్ర్య మను నూబిన్ గూల్తువే దేశమున్? (పుట-7)

## సవర పాటల అనువాదం :

సీతాపతి తాను సేకరించిన సవర పాటలను కొన్నింటిని ఇంగ్లీషులోకీ తెలుగులోకీ చక్కగా అనువదించారు. ఆయన సవర పాటలకు చేసిన ఇంగ్లీషు అనువాదాలు ఎంత మనోహరంగా ఉన్నదీ 'సవర భాషా సేవ' అనే అధ్యాయంలో వివరంగా పరామర్శించ బడింది.

## కవితోదయ చంద్రికా :

సీతాపతి తెలుగు భాషా సమితిలో విజ్ఞాన సర్వస్వ ప్రధాన సంగ్రాహకుడుగా పనిచేస్తున్న రోజులలో తీరిక వేళలలో సరదాగా తెలుగు పద్యాలను సంస్కృతీకరించి తనను చూడటానికి వచ్చే మిత్రులందరికీ చదివి వినిపిస్తూండేవారు. ప్రస్తుత గ్రంథ రచయిత ఆ రోజులలో ఆయన వద్ద సహాయ సంగ్రాహకుడుగా పని చేస్తున్నందువల్ల అలా ఆయన రచించిన సంస్కృత శ్లోకాలను ఏ రోజు వ్రాసినవి ఆ రోజున మొట్టమొదటి శ్రోతగా తానే వినే అవకాశం లభించింది.

సీతాపతి ఆ విధంగా అప్పు డప్పుడు రచిస్తూ వచ్చిన సంస్కృత శ్లోకా లన్నీ అనంతరం 1963 లో 'కవితోదయ చంద్రికా' అనే ఖండకావ్య సంపుటిగా దేవ నాగర లిపిలో ప్రకటించ బడ్డాయి.

కవితోదయ చంద్రికలో మూడు భాగాలు : 1. ఆంధ్ర ప్రబంధాలలోని కొన్ని మంచి పద్యాలకూ, కొన్ని శతకాలలోని పద్యాలకూ కొన్ని చాటుపద్యాలకూ చేసిన సంస్కృతానువాదాలు, 2. స్వతంత్ర రచనలు - స్వతంత్రంగా సంస్కృతంలోనే రచించిన ఖండ కావ్యాలు, 3. క్షేత్రయ్య పదాలకు సంస్కృతానువాదాలు.

ఈ కవితోదయ చంద్రికను సీతాపతి బూరుగుల రామకృష్ణారావుకి అంకితం చేస్తూ ఇలా రెండు శ్లోకాలు వ్రాశారు:

శ్రీ బూర్గులాన్వయ సుధాంబుధి పూర్ణ చంద్ర!
శ్రీ రామకృష్ణ! బహు విక్రమ ధీ విశాల।
తుభ్యం మదీయ కవితోదయ చంద్రికేయమ్
దత్తా మయా తవ యథోచిత పాలనాయ॥

నాహం సంస్కృత పండితో న చ కవిః కింత్వేష యత్నః కృతః
విజ్ఞాతుం బహుమాని తాంధ్రకవితా మాధుర్య మాంధ్రేతరాః।
కాంక్షన్తీతి భృశం విచిన్త్య కతిచిత్ పద్యాని గేయా న్యహమ్
ప్రీత్యా సంస్కృత భాషయా వ్యరచయమ్ మా మాద్రియన్తాం బుధాః॥

పై శ్లోకాలలో రెండవ దానిలో "నేను సంస్కృత పండితుణ్ణి గాను; కవిని గాను. అయినా ఆంధ్రేతరులు ఆంధ్ర కవితామాధుర్యాన్ని చవి చూడాలని ఆశ పడుతూ ఉంటారు గనుక కొన్ని తెలుగు పద్యాలనూ, గేయాలనూ నేను సంస్కృతం చేశాను. బుధులు వీనిని ఆదరింతురు గాక!" అనడం సీతాపతి వినయ సంపత్తిని సూచిస్తూంది.

తెలుగు ప్రబంధాలలోని సంస్కృత సమాస బాహుళ్యాన్ని ఆంధ్రేతరులకు పరిచయం చేసే ఉద్దేశంతో అల్లసాని పెద్దనగారి మనుచరిత్రలోని హిమవత్పర్వత వర్ణన పద్యానికి సీతాపతి చేసిన ఈ సంస్కృతీకరణం చూడండి:

తెలుగు పద్యం :

చం. అటఁ జని కాంచె భూమిసురుఁ డంబర చుంబి శిర స్సర ఝ్ఝరీ
పటల ముహు ర్ముహు ర్లుఠ దభంగ తరంగ మృదంగ నిస్స్వన
స్ఫుట నటనానుకూల పరిఫుల్ల కలాప కలాపి జాలమున్
కటక చర త్కరేణు కర కంపిత సాలము శీత శైలమున్

సంస్కృతానువాదం :

హిమగిరి మేష భూసుర యు వాంబర చుంబి శిరస్సరఝ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠ దభంగ తరంగ మదృంగ నిస్స్వన।
స్ఫుట నటనానుకూల పరిఫుల్ల కలాప కలాపి సంతతిమ్
కటక చరత్కరేణు కర కంపిత సాల మదర్శ దీహితమ్॥

ఈ అనువాదంలో తెలుగు పద్యంలో లేకుండా సీతాపతి కొత్తగా చేర్చిన మాటలు ఆరంభంలో "హిమగిరి మేష భూసుర యువా," మూడోపాదం చివర సంతతిమ్, నాల్గవ పాదం చివర 'ఆదర్శ దీహితమ్'* అనేవీ మాత్రమే! తక్కిన వన్నీ తెలుగు పద్యంలో ఉన్న మాటలే!

సుమతీ శతకంలో అందరికీ తెలిసిన ఈ క్రింది పద్యానికి సీతాపతి చేసిన సంస్కృతీకరణం చూడండి :

కం. చీమలు పెట్టిన పుట్టలు
పాముల కిరవైన యట్లు పామరులు దగన్
హేమంబు కూడఁబెట్టిన
భూమీశుల పాలు జేరు భువిలో సుమతీ!

సంస్కృతానువాదం :

పిపీలికా నిర్మిత వామలూరః
సర్పస్య గేహం భవతి క్రమేణ।
తథైవ లుబ్ధైః చిరకాల గుప్తమ్
స్వర్ణం చ గచ్ఛ త్యవనీశ కోశమ్॥

అనువాదంలో 'పామరుల'ను 'లుబ్ధులు'గా మార్చడం మూలానికి మెరుగు పెడుతూంది.

రెండవ భాగంలో "కాళిదాస ప్రశస్తిః," 'భారత దేశ ప్రశస్తిః', 'ఆంధ్ర రాష్ట్రావతరణ ప్రశంసా,' 'గురుదేవః' వంటి స్వతంత్రంగా సంస్కృతంలో వ్రాసిన 14 ఖండ కావ్యాలూ, మూడవ భాగంలో 27 క్షేత్రయ్య పదాలకు సంస్కృతానువాదాలూ కవితోదయ చంద్రికలో కనిపిస్తాయి. ఈ గ్రంథానికి 'ప్రరోచనా' అనే శీర్షికతో సంస్కృత భాషలో పరిచయ వాక్యాలు వ్రాసిన శ్రీనివాస సోదరులు ఇలా అంటారు:

---

* 'అపశ్య దీహితమ్' అని ఉండాలి.

"ఒకప్పుడు ఒక చిత్రమైన సంఘటన జరిగింది. మా ప్రెస్సులో సీతాపతి వ్రాసిన సంస్కృతీకరణల గ్రంథం అచ్చవుతూం దని అక్కడికి వచ్చిన కొందరు స్నేహితులతో చెప్పగా వారిలో ఒకడు ఇలా అన్నాడు: 'ఏమిటి సీతాపతి గారి ఈ వ్యామోహం? తెలుగు పద్యాలలో చాలా భాగం సంస్కృత శ్లోకాలకు ఛాయల వంటివే గదా! సంస్కృతంలో మహా కవులు చేసిన రచనల ముందు ఈ సంస్కృతీకరణలు ఏమి రాణిస్తాయి? ఈ సంస్కృతీకరణల వలన జరిగే ప్రయోజన మేమిటి? ఈ శ్రమ అంతా నిరర్థకమే గదా! 'కృష్ణా! రామా!' అంటూ కూర్చోవలసిన వార్ధక్యంలో ఆయనకు ఎందుకు ఈ అనవసరపు ప్రయాస?" అతని మాటలు విని లోకంలో అనేక రకాల ప్రకృతులు గలవారు ఉంటారు గదా అని మాలో మేమే నవ్వుకుని ఊరుకున్నాం. 

'ప్రయోజన మనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే' అనే ఆర్యోక్తితో ప్రారంభించి అటు తరువాత శ్రీనివాస సోదరులు తమ 'ప్రరోచనా'లో సీతాపతి సంస్కృతీకరణల వలన కలిగే ప్రయోజనాలను విపులంగా వివరించారు.

డా॥ పి. వి. రాజమన్నార్, కాశీ కృష్ణాచార్య, జమ్ములమడక మాధవరాయ శర్మ మొదలైన ప్రముఖు లనేకులు సీతాపతి 'కవితోదయ చంద్రిక'ను ప్రశంసించారు.



## భారతీ శతకం :



1939 ప్రాంతంలో నవ్య సాహిత్య పరిషత్తు ప్రకటించిన 'భారతీ శతకం' సీతాపతికి తెలుగు కవిగా గుర్తింపు తెచ్చింది. శార్దూల, మత్తేభ, చంపక, ఉత్పలమాలా వృత్తాలతో వ్రాసిన ఈ శతకం సీతాపతి తెలుగు పద్యాన్ని ఎంత మనోహరంగానూ, అప్రయత్న సిద్ధంగానూ రచించ గలరో స్పష్టం చేస్తుంది. పద్య రూపంలో ఉన్నా, నిజానికి ఇది ఒక శాస్త్ర కావ్యం. ఈ కావ్యానికి ఉపోద్ఘాతం రచించిన వేటూరి ప్రభాకరశాస్త్రి "పరవాది గజాంకుశాది శతకములు మత, వేదాంతాది విషయ చర్చలతో యున్నవి గాని భాషోత్పత్తి వికాసముల తీరును, కావ్య భాషాభ్యుదయ సాధనములను నిరూపించునది, వాఙ్మయ విమర్శనాత్మక మగునది-శతకము ఇట్టిది-ఇంత దనుకఁ దెనుఁగునఁ గానరాదు" అని ఈ కావ్యాన్ని ప్రశంసించారు.

శాస్త్ర విషయాలను పద్య రచనలో చమత్కారం లేకుండా ఛందోబద్ధం చేస్తే "శుష్కో వృక్ష స్తిష్ఠ త్యగ్రే" (ఎండిన చెట్టు ఎదురుగా నిలిచి ఉంది) వంటి నీరసమైన తార్కిక కవిత్వం అవుతుంది గాని, నిజమైన కవిత్వంలాగ అది ఆస్వాద్యం కాదు. సీతాపతి పద్య రచన చమత్కార భరితమైంది. ఆయన తండ్రి రామమూర్తి పంతులు కూడా పద్యాలు వ్రాసినా వాటిలో సీతాపతి రచనలోని చమత్కృతి, అక్షర రమ్యత లోపించి, అవి కేవలం తార్కిక కవితలవలెనే అనిపిస్తాయి. రామమూర్తిగారు వ్రాసిన ఈ పద్యం చూడండి:

''అఖిల లోకుల కానంద మైన చొప్ప
సరసముగ గైత కూర్చిన సరస కవుల
సరస భాషల నెత్తి నిస్సంశయముగ
బాల కవులకు నర్పింతు వాణి గొలిచి''

భారతీ శతకంలో మొత్తం 145 వృత్తాలు ఉన్నాయి. ప్రతి పద్యం చివరా 'భారతీ!' అనే సంబోధన మకుటంగా ఉంది. వీటిలోని మొదటి 46 పద్యాలూ భారతీ దేవిని సంబోధిస్తూ గ్రాంథిక భాషావాదాన్ని ఖండిస్తూ చెప్పినవి. భారతీ దేవి స్వయంగా తనకు ప్రత్యక్షమై 'ఓరీ లె'మ్మని మేలుకొలిపి ఈ కావ్యం వ్రాయమని ఆదేశించినట్లు కావ్యారంభంలోని రెండు పద్యాలలో ఆయన ఇలా చెప్పారు:

శా. శ్రీ రాగ స్వర మేళనాంచిత విపంచీ తంత్రులన్ హాయిగా
''సా రీ మా ప ని సా రి గా రి స గ రీ సా నీ ప రీ గా రి సా
సా రీ'' యంచును గోట మీటుచును నీ శాంతాకృతిన్ జూపి న
''న్నోరీ లె'' మ్మని మేలుకొల్పితివి నాఁ డో తల్లి! యో భారతీ!

శా. "ఓరీ! యేటికిఁ గాల యాపనము? ధీ యుక్తుండవై యుండియున్
సారస్యాన్విత పద్య కావ్య రచనా సామర్థ్య సంపత్తి యిం
పారన్ గల్గియుఁ జెప్ప వేమి యొక కావ్యంబైన సీతాపతీ!
ఆరంభించి జయంబు నొందు'' మని కాదా యంటివో భారతీ!

ఈ పద్యాలలోని శయ్యా, పాకం పూర్వ ప్రబంధ కవులలో చాలా మంది రచనతో దీటు రాగలవి. ఈ 46 పద్యాలలోనూ గ్రాంథిక భాషావాదుల వాదాన్ని యుక్తియుక్తంగానూ, హృదయంగమంగానూ ఖండించి, వ్యావహారిక భాషా వాదాన్ని సమర్థంగా సీతాపతి ప్రతిపాదించారు. 47 వ పద్యం నుంచి 113 వ పద్యం దాకా 68 పద్యాలలో 'ఓ నాడు', 'ఇస్తి' వంటి గ్రాంథిక భాషావాదుల చేత గ్రామ్యాలని నిరసించబడ్డ ప్రయోగాలు ప్రసిద్ధులైన పూర్వ కవుల రచనలలోనే ఎలా కనిపిస్తున్నదీ ఆయన వివరించారు. ఆ విధంగా నేటి వ్యావహారిక పదాలకు సీతాపతి పూర్వకవి ప్రయోగాలను ఉదాహరించిన కొన్ని పదాల పట్టిక ఈ క్రింద చూడవచ్చును :

| గ్రాంథికం | వ్యావహారికం | ప్రయోగం |
|---|---|---|
| కూఁతుకు | కూఁతురికి | బహుళాశ్వ చరిత్ర |
| ఎల్లయున్ / అన్నియున్ | ఎల్లను / అన్నిని | నన్నయ, తిక్కన |
| అంతయున్ | అంతా | ధూర్జటి |
| చల్లయు నంబలి | చల్లా యంబలి | శ్రీనాథుడు |
| నమ్మియు నమ్మక | నమ్మీ నమ్మక | తిక్కన |
| వినియు వినక | వినీ వినక | శ్రీనాథుడు |
| రోసినది | రోసింది | ధూర్జటి |
| కొలఁది | కొద్ది | రంగనాథ రామాయణం |
| వెలుఁగ | వెల్గ | కంసాలి రుద్రకవి |
| మొలక | మొల్క. మొక్క | తెనాలి రామకృష్ణుడు |
| సొరణగండ్లు | సొర్ణగండ్లు | తిక్కన |
| ఇచ్చితి | ఇస్తి | ప్రభు లింగ లీల |
| ఒక నాఁడు | ఓనాఁడు | శ్రీనాథుడు |
| మహా | మా | శ్రీనాథుడు |
| సహాయము | సాయము | హంసవింశతి |
| జయ పరమేశ్వర | జా పరమేశ్వర | మల్లన, సింగన |
| వరించెడి వేళ | వరించే వేళ | పార్వతీ పరిణయము |

| | | |
|---|---|---|
| ఇరువది | ఇరువై | శ్రీనాథుడు |
| కళచుకొని పోయె | కలచుక పోయె | శ్రీనాథుడు, పోతన |
| వాండ్రు | వాండ్లు | రాధామాధవ కవి |
| వానిని | వాటిని | అప్పకవి |
| నుండి | నుంచి | జ్ఞాన ప్రసూనాంబికా శతకం |
| ఒద్ద | వద్ద | — |
| ఆడుదము | ఆడుదాము | రాధికా సాంత్వనం |

వ్యావహారిక రూపాలకు ఇలా పూర్వ కవి ప్రయోగాలను చూపిస్తూ చెప్పే పద్యాలు కూడా ఎంత చమత్కార బంధురంగానూ, హృద్యంగానూ రచించవచ్చునో సీతాపతి భారతీ శతకంలో నిరూపించారు. 'కోసము', 'యవ్వనము' అన్న పదాల ప్రయోగాలను ప్రదర్శించే ఈ క్రింది రెండు పద్యాలూ చూడండి :

ఉ. ఒప్పగ 'కోస' మంటకు ప్రయోగము లున్నవి; "ముక్తి కోసమై"
అప్ప కవీయ మందుఁ గన నయ్యెఁడు, తమ్మయ పాపరాజులుం
జెప్పిరి; హంస వింశతిని జేరెను; తిర్పతి వేంకటేశ్వరుల్
"కొప్పరపుం గవీశ్వరుల కోసము" చెప్పిరి గాదె? భారతీ !

ఉ. జవ్వన మట్లె యవ్వనము సాధు పదం బగు నాంధ్ర భాషలో
"అవ్వన" మన్న కందమున "యవ్వన" మంచును సింగనార్యుఁడున్
యవ్వన లక్ష్మి కంచును అనంతుఁడు బల్కిరి; పల్కు రెల్లచో
నివ్విధి పల్కుచుంట వినవే? యిది తప్పన నేం? భారతీ!

113వ పద్యం మొదలు 142వ పద్యం వరకూ 30 పద్యాలలో మాండలిక శబ్దాలూ, అరసున్నా, శకటరేఫా, వైరి సమాసాలూ, విసంధి రూపాలూ, అన్య దేశ్యాలూ మొదలైన వాటిని సీతాపతి వివరించారు. "నవ్వరు ఎవ్వరు" అని కోట శివరామయ్య, "ఉన్నాడు ఇది" అని చేమకూర కవి విసంధిగా ప్రయోగించినట్లు ఆయన పేర్కొన్నారు.

143 నుంచి 145 వరకూ గల మూడు పద్యాలూ 'తుని పలుకు'. వీటిలో మూడవ పద్యం ప్రత్యేకంగా గమనించదగింది.

మ. జననీ! త్వత్కరుణావలోకన సుధా సంబద్ధ సాహిత్య ల
క్షణ విద్యా కవితా విశారదుఁడఁ; ద్వత్సందేశ కార్య క్రియా
చణతన్ గూర్చితి భారతీ శతక మిష్టాగోష్ఠిగా నింక నీ
వను శాసించెడి భాషఁ గూర్తు నొక కావ్యం బొప్పుగా భారతీ!

భారతదేవి అనుశాసించిన వ్యావహారిక భాషలో ఒక పూర్తి కావ్యం వ్రాస్తా నని ఈ పద్యంలో సీతాపతి భారతీ దేవికి వాగ్దానం చేశారు. కాని, సీతాపతి చివరి రోజులలో పేరు ప్రతిష్ఠలు లభించి బహు కార్య వ్యాపృతులు కావడం వల్లనో ఏమో ఆ వాగ్దానం ఆయన నిలబెట్టుకో లేక పోయారు.

"భాషా చరిత్ర పరిశీలనము, శబ్ద పరిణామ క్రమ నిరూపణము, సత్కవి కావ్య ప్రయోగ ప్రదర్శనము, సద్రచనము, సరస్వతీ స్తవము నను ప్రయోజనములతో గర్భితమయి యున్న యీ శతకము పండిత కవి ప్రశంసార్హము. పయి ప్రయోజనములు గల దగుటచే మాతృ భాషా పండితులు కాఁగోరు కాలేజీ విద్యార్థులకు పాఠ్య గ్రంథముగా గూడఁ బరిగ్రహింప దగిన దీ శతకము" అని ఈ పుస్తకానికి ఉపోద్ఘాతం వ్రాసిన వేటూరి ప్రభాకరశాస్త్రి ఈ రచనను ప్రశంసించారు.

భారతీ శతకం చివర 177 సూచికలతో కూడిన 'టిప్పణి' చేర్చడం ఈ గ్రంథం ఉపయోగాన్ని మరింత ఎక్కువ చేస్తూంది.

## బాల సాహిత్య వైతాళికుడు :

తెలుగులో బాల సాహిత్య వైతాళికులలో సీతాపతి ఒకరు. 1909 నుంచీ కూడా బాల సాహిత్యంలో తాను కృషి చేస్తున్నట్టు తగిన ప్రోత్సాహం లేక కొన్ని సంవత్సరాలు ఆ కృషి మానుకున్నట్టు సీతాపతి స్వీయచరిత్ర (పుట. 58) లో వ్రాశారు. 1940 లో కొన్ని మాసాలు 'భారతి' మాస పత్రికకు సంపాదకుడుగా ఉన్న కాలంలో ప్రతి సంచికలోనూ రెండు పేజీలు బాల సాహిత్యానికి ఆయన కేటాయించారు.

బాలలకోసం అప్పు డప్పుడు ఈయన వ్రాసిన గీతాలూ, కథలూ 'బాలానందం' అనే పేరిట చిత్రాలతో సహా కర్నూలులోని రాయలు పబ్లికేషన్స్ వారు చక్కని గ్రంథంగా ప్రకటించారు. ఈ గ్రంథం ఉత్తమ బాల సాహిత్య రచనగా 1949-50 లో రాష్ట్ర ప్రభుత్వం చేత 1955-56 లో కేంద్ర ప్రభుత్వం చేత బహుమతులు అందుకుంది. బాలానందంలో నుంచి మచ్చుకి ఒక చిన్నగీతం :

## బాలిక - చిలుక

"ఎండలో ఎక్కడికి ఎగిరి పోయెదవు?
ఉండవే మా యింట ఓ రామ చిలుక!"
"రెక్క లాడించుతూ రివ్వు మని మీట
చక్కగా ఎగురుతూ సంచరిస్తాను."
"సొంపైన మందిరము చూడు మా మేడ;
పెంపుడు చిలుకవై పెరుగు మా యింట!"
"మేడ మిద్దెల కంటె మేలు మా తోట;
తోటి చిలుకల జట్టు వీడి రాలేను"
అందమగు పంజరము ఉంది మా యింట
అందులో నివసించి హాయిగా ఉండు."
"ఈ యడవి స్వేచ్ఛగా ఎగిరి పోకుండ
చేయించితివె నాకు చెఱసాల యొకటి?"

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సీతాపతిని ప్రముఖ బాల సాహిత్య రచయితగా గుర్తించి బాల సాహిత్య రచయితలకు శిక్షణ ఇవ్వడం కోసం రెండేళ్ళ కొకసారి చొప్పున నిర్వహిస్తున్న బాల సాహిత్య రచనా కర్మాగారాలకు (వర్క్ షాప్‌లకు) ఆయనను డైరెక్టరుగా నియమిస్తూ వచ్చింది. ఆ విధంగా 1956 మే, జూన్ నెలలలో రాజమండ్రిలోనూ, 1958 నవంబరు నుంచి 1959 జనవరి వరకూ హైదరాబాదులోనూ, 1961 అక్టోబరు నుంచి డిసెంబరు వరకూ తిరిగి హైదరాబాదులోనూ నిర్వహించబడిన వర్క్ షాప్‌లకు సీతాపతి డైరెక్టరుగా పనిచేశారు. ప్రతి సారీ సుమారు 20 మంది బాల సాహిత్య రచయితలు ఆయన వద్ద శిక్షణ

పొందారు. 1956 లో రాజమండ్రిలో జరిగిన మొదటి శిక్షణ శిబిరంలో శిక్షణ పొందిన రచయితలలో నేడు సుప్రసిద్ధులైన బాల సాహిత్య రచయితలు బి.వి. నరసింహా రావు, కవి రావు, డా॥ వెల్చేరు నారాయణ రావు, జి. ప్రభావతి మొదలైన వారున్నారు.

ప్రతి వ్యక్తి జీవితాన్నీ వివిధ పరిస్థితులు మలుపులు తిప్పుతూ ఉంటాయి. 'ఇది ఇలా జరిగి ఉంటే ?', 'అది అలా జరగకుండా ఉంటే?' అనే ప్రశ్నలకు జవాబు చెప్పడం కష్టం. కాని, సీతాపతి సాహిత్య రచనలతో పరిచయం గల వారికి 'ఆయన జీవితం నానా ముఖాలుగా ప్రసరించకుండా కేవలం సృజనాత్మక సాహిత్యానికే పరిమితమై ఉంటే ఎలా ఉండేది?' అనే ప్రశ్న మనస్సులలో ఉదయించకుండా ఉండదు. ఇతర రంగాలలో ఆయన ధరించిన పాత్రలు ఆయన సృజనాత్మక వ్యక్తిత్వాన్ని మరుగు పరచినట్లు విశదం కాకపోదు.

# 9

# పరిశోధన

స్వత స్సిద్ధంగా సీతాపతి కళా హృదయుడే అయినా ఆయనలోని విస్పష్ట భావుకతా, అన్యూనాతిరిక్తంగా భావాన్ని ప్రకటించ గల శక్తి పరిశోధకుడుగా కూడా ఆయనకు ప్రశస్తిని గడించి పెట్టాయి. అమెరికాలోని వాషింగ్టన్ నగరంలో ఉన్న 'ఇంటర్నేషనల్ ఎకాడమీ' నుంచి డి.లిట్ పట్టానూ, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు నుంచి 'కళా ప్రపూర్ణ' గౌరవ పట్టానూ ఆయనకు సంపాదించి పెట్టాయి.

సీతాపతి పరిశోధన ప్రధానంగా నాలుగు ముఖాలుగా సాగింది. 1 తండ్రితో కలిసి వ్యావహారిక భాషను గూర్చి, సవర భాషను గూర్చి చేసిన పరిశోధనలు, 2. ఛందశ్శాస్త్ర పరిశోధనలు, 3. తెలుగు విజ్ఞాన సర్వస్వ, తెలుగు సాహిత్య చరిత్రల రచన, 4. శాసనాల పరిశోధన.

## భాషాశాస్త్ర పరిశోధన :

సవర, ఆంగ్ల, ఆంధ్ర భాషలలో త్రిముఖంగా సీతాపతి భాషా పరిశోధన కొనసాగింది. తండ్రితో కలిసి ఆయన చేసిన సవర భాషా పరిశోధన ఫలితాలు తండ్రి పేరుతోనే ప్రకటితం అయిన సవర భాషా నిఘంటువులలోనూ, వ్యాకరణం లోనూ కనిపిస్తాయి. అవి తండ్రీ కొడుకులు ఇరువురూ కలిసి చేసిన రచనలు కావడంవల్లనే రామమూర్తి పంతులు ఆ గ్రంథాలకు వ్రాసిన తొలి పలుకులలో 'నేను' అని ఏక వచనం కాకుండా 'మేము' అని బహు వచనాన్ని ప్రయోగించినట్టు లోగడ గమనించాము.

ఇక-ఇంగ్లీషు భాష విషయంలో రాజమండ్రిలో ట్రైనింగ్ కళాశాలలో చదువుకుంటున్న రోజులలోనే ఫొనెటిక్ లిపి ద్వారా సరి అయిన ఆంగ్ల భాష ఉచ్చారణను విద్యార్థులకు అలవరుస్తూ ఇంగ్లీషు బోధించే పద్ధతిని ఆకళింపు చేసికోడమే కాకుండా, పర్లాకిమిడి హైస్కూలులో ఉపాధ్యాయుడుగా చేరిన తరువాత అక్కడ ఆ పద్ధతిని విద్యార్థులపై ప్రయోగించి సీతాపతి సత్ఫలితాలు

సాధించారు. నూతన పద్ధతిలో ఇంగ్లీషు బోధించడానికి ఆయన చేసిన ఆ ప్రయోగం ఆ రోజులలో ఇంగ్లీషు బోధించే ఉపాధ్యాయుల నెందరినో విశేషంగా ఆకర్షించింది. ఇంగ్లీషు పదాలను సరి అయిన ఉచ్చారణతో మాట్లాడాలనే ఆయన పట్టుదల చివరి రోజుల వరకూ ఆయనలో సడలిపోలేదు. సినీమాలలో నటిస్తున్న రోజులలో 'జెమినీ స్టూడియో' అనే ఉచ్చారణ తప్పనీ, ఇంగ్లీషులో Gemini పదానికి మిధున రాశి అని అర్థ మనీ, దానిని 'జెమినై' అని ఉచ్చరించా లనీ తరచు ఆయన మిత్రులతో అంటూ ఉండేవారు. తెలుగు విజ్ఞాన సర్వస్వంలో 'చరిత్ర - రాజనీతి' సంపుటానికి సంగ్రాహకులుగా పని చేసే రోజులలో ఇంగ్లీషు పేర్లను వాటి సరియైన ఉచ్చారణను సూచించే విధంగా తెలుగు లిపిలో వ్రాయా లని ఆయన పట్టు పట్టేవారు. 'ఎడ్యుకేషన్' కాదు, 'ఎజూకేషన్' అనీ, 'గర్ల్' కాదు 'గాళ్' అనీ తోటివారి ఉచ్చారణను ఆయన సవరిస్తూ ఉండేవారు.

వ్యావహారిక భాషోద్యమ సంగ్రామం ముమ్మరంగా సాగుతున్న రోజులలో రామమూర్తి పంతులూ, సీతాపతీ ప్రాచీన ఆధునిక ఆంధ్ర భాషా శైలులను గురించీ, శబ్ద ప్రయోగాలను గురించీ చేసిన పరిశోధన అసాధారణ మైంది. అయితే ఆ పరిశోధన ఫలితాలు ఒక సమగ్రమైన ఆధునిక ఆంధ్ర భాషా నిఘంటువు రూపంలోనూ, వ్యావహారిక భాషా వ్యాకరణం రూపంలోనూ తరువాతి తరాలకు వారు అందజేయక పోవడం తెలుగు భాష దురదృష్టం!

సీతాపతి మద్రాసులో తెలుగు భాషా సమితిలో పని చేస్తున్న రోజులలో పందిరి మల్లికార్జున రావు కార్యదర్శిత్వం క్రింద ఏర్పాటయిన మద్రాసు తెలుగు రచయితల సంఘం నేటి వ్యావహారిక భాషకు ఒక సమగ్రమైన వ్యాకరణం రచించేందుకు సీతాపతి, తాపీధర్మారావు, ఈ గ్రంథ రచయితలతో ఒక ఉపసంఘాన్ని నియమించింది. కాని దురదృష్ట వశాత్తు ఉపసంఘ సభ్యుల అన్య కార్య నిమగ్నత వలన ఆ ఉపసంఘం ఒక్క సారి అయినా సమావేశం కావడం గాని, వ్యావహారిక భాషా వ్యాకరణానికి కనీసం ఒక ప్రణాళిక నైనా తయారు చేయడం గాని జరుగలేదు.

సీతాపతికి చివరి రోజులలో నిఘంటు నిర్మాణ వ్యాసంగంతో సంబంధం ఏర్పడినా, అది గ్రాంథిక భాషా నిఘంటువు. పిఠాపురం రాజా గారు సూర్య రాయాంధ్ర నిఘంటువులో చివరి సంపుటాలను అచ్చు వేయించే బాధ్యతను సీతా పతికి ఒప్పగించారు. కాని, ఆ నిఘంటు రచనా ప్రణాళిక అంతకు ముందే నిర్ణీతమై, కొన్ని సంపుటాలు కూడా అచ్చయి ఉన్నందువల్ల ఆయన తన భాషా పరిశోధన ఫలితాలను ఆ నిఘంటువు ద్వారా అందజేసే అవకాశం లేకపోయింది.

అయితే - ఆయన అప్పు డప్పుడు చేసిన రేడియో ప్రసంగాల ద్వారానూ, పత్రికలలో ప్రచురించిన వ్యాసాల ద్వారానూ సమగ్రమైన ఆధునిక ఆంధ్రభాషా నిఘంటువు స్వరూపం ఎలా ఉండాలని అయన భావించేవారో చూచాయగా మనకు తెలుస్తూంది. అలాంటి సమగ్ర నిఘంటువులో మాండలిక పదాలను కూడా చేర్చడం ఆయన అభిమతం. "జీవద్భాష - తెలుగు'' అనే వ్యాసంలో ఆయన ఇలా అంటారు.

''మాండలిక శబ్దాలు అగ్రాహ్యము లని ఏ లాక్షణికుడూ చెప్పలేదు. అంతే కాదు; అప్పకవి మొదలైన వారు వాటిని గ్రహించి, ఉదాహరించారు. 'అలంబు చివ్వ, కయ్యము, పోరు, బవరంబు, దురము' అనీ, 'వెలది, ఇంతి, పడంతి, ఎలనాగ, చెలి, బోటి, పొలతి, తొయ్యలి, నాతి, నెలత' అనీ ఈ విధంగా అప్పకవి మాండలిక పదాలను పర్యాయ పదాలుగా చేర్చి ఉదాహరించాడు. మాండలిక పదాలు ఆంధ్ర నామ సంగ్రహంలోనూ, అంత కంటె ఎక్కువగా ఆంధ్ర భాషార్ణవంలోనూ కనబడుతవి.''పప్పు బేడ యన సూపంబు దనరారు; పైకము, డబ్బు, దుడ్డు; చిల్క, గొల్లెము,బొంగర మనగను, బొమ్మర మనగను''అని ఈ విధంగా మాండలిక శబ్దాలు గ్రహింప బడినవి. ఇందుకు ప్రాచీన కవి ప్రయోగాలు కూడా ఉన్నవి. ''పప్పు'' శ్రీనాథుని హరవిలాసం లోనూ, బేడలు కృష్ణదేవరాయల ఆముక్తమాల్యద లోనూ ప్రయుక్తములు. ఆముక్తమాల్యదలో 'పోరి విళంగాయలు', 'సాపడు' మొదలైన అరవ పదా లున్నవి. కన్నడ పదాలకు శ్రీ కాళహస్తి మాహాత్మ్యము లోని 'బిజమాడు దేవర' అనే సీసపద్యంలో ఉదాహరణలు ఉన్నవి...... శ్రీనాథుడు, పెద్దన వంటి మహాకవులు హిందుస్థానీ పదాలను తమ కావ్యాలలో వాడుకున్నారు. తమ మండల మందలి పదాలే శుద్ధమైన వని కొందరు అనుకుంటూ ఉంటారు. తమకు తెలియని ఇతర మండలముల లోని పదాలను చెడ్డవిగా తలచి అపహాస్యం

చేస్తూ ఉంటారు. 'ఇల్లా' (ఈ విధంగా) అనే ఒక గోదావరి మండలం మిత్రుడు 'ఈ లాగున' అనే మరో మండలం మిత్రుణ్ని వెక్కిరించాడు. 'బాలేందు రేఖ దోఁచిన లాలిత మగు నపర దిక్కు లాగున' అన్న పోతన గారి పద్యాన్ని చదవ మని అతనికి నేను సలహా ఇచ్చాను.''

ఇదే వ్యాసంలో ' - తనం', 'పెత్తనం', 'మాట' వంటి పదాల వ్యుత్పత్తులనూ, అర్థ భేదాలనూ వివరించిన తీరును బట్టి సీతాపతి ఆధునిక ఆంధ్ర భాషా వ్యాకరణం రచించి ఉంటే, దానిలో ఈ మూడు పదాల తాలూకు ఆరోపాలు (**entries**) ఈ క్రింది విధంగా ఉండే వని మనం ఊహించ వచ్చును :

**-తనం** [సం.-త్వం > ప్రా. - తణం > తె. తనం] భావార్థకం. ప్ర. మగ తనం, పెంకెతనం, కలుపుగోలు తనం మొ.

**పెత్తనం** [పెద్ద + తనం] వి. అధికారం - ప్ర. ఎవ రిచ్చారు నీ కీ కర్ర పెత్తనం?; బంధు మిత్రుల గృహ సందర్శనం - ప్ర. అత్తగారు పెత్త నాలకు పోతే కోడలు కొంగు పరచుకున్నది.

**మాట.** వి. 1. పదం, ప్రసంగం - ప్ర. పెళ్ళిమాటలకు వారు వచ్చారు; 2. మాట్లాడే తీరు - ప్ర. మాట దురుసే గాని మనసు మంచిది; 3. ఆజ్ఞ - ప్ర. వాడి మాటకు తిరుగు లేదు; 4. సలహా - ప్ర. నా మాట వినవా?; 5. నింద - ప్ర. గుమాస్తా వల్ల అధికారికి మాట వచ్చింది, మాట పడడం కష్టం; 6. తిట్టు - ప్ర. ఒక మాటంటే పది మాటలు పడాలి; 7. సంగతి, విషయం - ప్ర. ఆ మూగపిల్ల మాటేమిటి?; **వేయి - లు** అధిక ప్రసంగం; -లపోగు, వదరు బోతు; -కారి, ప్రాసంగికుడు, సంభాషణ చతురుడు; -లు, భాష - ప్ర. మా అబ్బాయి కిప్పు డిప్పుడే మాటలు వస్తున్నాయి. - లు, సయోధ్య, మైత్రి - ప్ర. మా ఇద్దరికీ మాటలు లేవు.

[సం - సంస్కృతం; ప్రా. - ప్రాకృతం; ప్ర. ప్రయోగం; మొ - మొదలైనవి; వి. విశేష్యం]

## ఛందశ్శాస్త్ర పరిశోధనలు:

తెలుగులో ఛందో రీతులను గూర్చి సీతాపతి చేసిన పరిశోధన, సాధించిన ఫలితాలూ విస్మయావహ మైనవి; తద్జ్ఞుల ప్రశంసల నందుకొన్నవి.

తెలుగు ఛందస్సులను గురించిన పరిశోధనలో సీతాపతికి ఆసక్తి కలగడం, సునిశితమై పరిశోధన సాగించి ప్రాచీన లాక్షణికు లెవ్వరూ గుర్తించి ఉండని అనేక నూతనాంశాలు కనుగొనడం 1919 వ సంవత్సరం నుంచే ప్రారంభ మైంది. అప్పటి నుంచే వివిధ పత్రికలలో తమ ఛందశ్శాస్త్ర పరిశోధన ఫలితాలను సీతాపతి ప్రకటిస్తూ వచ్చారు. 1919-20 లో రామమూర్తి పంతులు గారు పర్లా కిమిడినుంచి ప్రకటించిన 'తెలుగు' పత్రికలో సీతాపతి మొదటి వ్యాసం 'ఛందో రహస్యములు' వెలువడింది. తరువాత 1924-25 సంవత్సరం భారతిలో మధ్యా క్కరలను గురించి సీతాపతి రచించిన పెద్ద పెద్ద వ్యాసాలు ప్రకటించ బడ్డాయి.

రామమూర్తి పంతులు వేటూరి ప్రభాకర శాస్త్రికి వ్రాసిన 7-3-24 వ తేదీ గల లేఖలో ఇలా వ్రాశారు:

"నేను ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికకై పంపిన వ్యాసము శీర్షిక- 'వ్యావహారికాంధ్ర భాషా బహిష్కార నిరసనము' మీరు ఒకమారు చిత్తగించండి. చి॥ సీతాపతి కూడా 'నన్నయ ఛందో విషయములు' అనే పేరు గల వ్యాస మొకటి పంపినాడు."

దీనిని బట్టి 1924 ఉగాది సంచికలో 'నన్నయ ఛందో విషయములు' అనే సీతాపతి వ్యాసం ప్రకటించబడ్డట్టు తెలుస్తూంది.

1921 లో వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రి కోరిక మీద 'అనంతుని ఛందము' (ఛందో దర్పణము) అనే గ్రంథానికి సీతాపతి 70 పేజీల విపులమైన ఉపోద్ఘాతం వ్రాసి ఇచ్చారు.

అలాగే 1923లో వావిళ్ళవారు అప్పకవీయాన్ని తిరిగి ముద్రించ దలచు కొన్నప్పుడు తాళ పత్ర ప్రతులలో ఉన్న విధంగా యథాతథంగా, 'తెలివిడి'

మొదలైన వచన రచనలు వ్యావహారికంలో ఉన్న వాటిని అలాగే ఉంచి ప్రకటించాలని సీతాపతిని ముద్రణ ప్రతి తయారు చేసి ఇమ్మని కోరారు. ముద్రణ ప్రతి తయారు చేయడమే కాకుండా దానికి ఆయన ఒక పీఠిక కూడా వ్రాశారు. "వ్రాత ప్రతులు సంగ్రహించుటలోనూ, పాఠములు సంప్రతించుటలోనూ, విషయ విచారణలోనూ మా తండ్రిగారు నాకు సహాయులుగా ఉన్నందున ఈ పీఠిక నేనే వ్రాసినా, 'మేము' అని బహువచనము వాడినాను" అని ఆ పీఠికలో సీతాపతి తండ్రి గారికి కృతజ్ఞత తెలియచేశారు.

సీతాపతి తెలుగు భాషలో పూర్వ లాక్షణికు లెవరూ చెప్పకుండా తాను స్వయంగా క్రొత్తగా కనిపెట్టిన ఒక తెలుగు ఛందోరహస్యం - ఊత, ఊనిక (**accent**). ఇంగ్లీషు మాటలలో లాగానే తెలుగు మాటలలో కూడా మాట మొదటి అచ్చుమీద ప్రధానమైన ఊత ఉంటుందనీ, అక్షరాల సంఖ్య మరీ ఎక్కువైనప్పుడు పదంలో మరొక చోట అప్రధానమైన ఊత ఉంటుందనీ ఆయన సోదాహరణంగా నిరూపించారు. 'పలు కుదురు' అనే మాటలో పళ్ళ వరుస అనే అర్థంలో 'ప'మీద, 'కు' మీదా కూడా ప్రధానమైన ఊత ఉంటుందనీ, 'చెబుతారు' అనే అర్థం లో 'ప' మీద మాత్రమే ప్రధానమైన ఊత ఉంటుందనీ ఆయన వివరించారు.

ఛంద శ్శాస్త్రంలో సీతాపతి సాధించిన మరొక గొప్ప ఆవిష్కరణ నన్నయ వ్రాసిన భారత భాగంలోని సీస పద్యాలలో యతి ప్రాసల విషయంలో కవి పాటించిన ప్రత్యేక నియమాలకు సంబంధించింది.

అనంతుడు ఈ క్రింది పది సీస భేదాలను పేర్కొన్నాడు :

1. పసిడి - సర్వ సాధారణంగా అందరూ వ్రాసే సామాన్య సీసం. సీసం లోని పన్నెండు పాదాలలోనూ యతి గాని, ప్రాస యతి గాని ఏదో ఒకటి పాటిస్తూ వ్రాయడం.

2. వృత్త ప్రాస సీసం - నాలుగు పెద్ద పాదాలలోనూ వృత్తంలో లాగ రెండో అక్షరం ఒకే విధంగా ఉండేట్టు ప్రాస పాటించడం.

3. సమప్రాస సీసం - నాలుగు పెద్ద పాదాలలోనే కాకుండా ఎత్తు గీతిలోని 1వ, 3వ పాదాలలో కూడా అదే ప్రాస పాటించడం.

4. అక్కిలి ప్రాస సీసం - సీస పద్యం 12 పాదాలలోనూ ఒకే ప్రాస పాటించడం.
5. సర్వతః ప్రాస సీసం - 12 పాదాలలోనే గాక ఆ పాదాలలో యతి స్థానాలతో కలిపి మొత్తం 24 చోట్లా ఒకే ప్రాస పాటించడం.
6. అవకలి ప్రాస సీసం - 24 చోట్లా ఒకే ప్రాస కాకుండా ఏ పాదాని కా పాదంలో ప్రాసయతిని పాటించడం.
7. అక్కిలి వడి సీసం - అన్ని పాదాలలోనూ అక్షర మైత్రి రూపమైన వడినే పాటించడం.
8. వడి సీసం - ప్రతి పాదంలోనూ నాలుగు చోట్లా ఒకే వడిని పాటించడం.
9. విషమ సీసం-నాలుగు పెద్ద పాదాల స్థానే ఉత్సాహ వృత్త పాదాలు వ్రాసి దాని క్రింద ఎత్తుగీతం చేర్చడం.
10. సర్వ లఘు సీసం - పెద్ద పాదాలలో ఐదేసి లఘువుల ఇంద్రగణాలు ఆరూ, మూడు లఘువుల సూర్య గణాలు రెండూ కూర్చడం. ఎత్తుగీతిని లఘువులతో కూర్చినా కూర్చక పోయినా ఫరవా లేదు.

ఈ పది సీస భేదాలలోనూ అప్పకవి 1, 3, 5, 6, 8, 9, 10 భేదాలనే వేరు పేర్లతో పేర్కొన్నాడు. ఈ ఏడు విధాల సీసాలనూ నన్నయ ఒక్కడే రచించాడనీ తక్కిన కవులు 'పసిడి' అనే సామాన్య సీసాన్నే రచించా రనీ అప్పకవి పేర్కొనగా, అది తప్పనీ, పోతన భాగవతంలో 'వడి' సీసాలూ, ఒక సర్వ లఘు సీసం (స్కం. 11, ప. 72) కనిపిస్తున్నాయనీ సీతాపతి అప్పకవి దోషాన్ని ఎత్తి చూపారు. స్వయంగా నన్నయ రచించిన 251 సీస పద్యాలనూ సునిశితంగా పరిశీలించి సీస పద్య రచనలో నన్నయ పాటించిన 13 విలక్షణ నియమాలను ఆయన సోదాహరణంగా వివరించారు.

అక్కరల విషయంలో కూడా సీతాపతి చేసిన పరిశోధన ప్రశంసార్హమైంది. అక్కరల రచన కన్నడ భాషలో ఎక్కువగా కనిపిస్తుంది. కన్నడం నుంచే తెలుగు వారు దానిని గ్రహించి నట్లు చెబుతున్నారు. అయితే కన్నడంలోని అక్కరలకూ, తెలుగులోని అక్కరలకూ అక్కడక్కడ తేడాలు కనిపిస్తాయి. ఆ తేడాలను సులువుగా అందరూ అర్థం చేసుకోడానికి వీలుగా సీతాపతి ఒక పట్టికలో ఈ క్రింది విధంగా పేర్కొన్నారు:

| తెలుగు పేరు | గణాలు | గణ సంఖ్య | కన్నడం పేరు |
|---|---|---|---|
| మహాక్కర | 1 సూ. + 5 ఇం. + 1 చం. | 7 | పిరి యక్కర |
| మధ్యాక్కర | 2 ఇం. + 1సూ. + 2 ఇం. + 1 సూ. | 6 | దొరె అక్కర |
| మధురాక్కర | 1 సూ. + 3 ఇం. + 1 చం. | 5 | నడువ ణక్కర |
| అంతరాక్కర | 1 సూ. + 2 ఇం. + 1 చం. | 4 | ఎడె యక్కర |
| అల్పాక్కర | 2 ఇం. + 1 చం. | 3 | కిరి యక్కర |

ఈ అక్కరలలో నన్నయ ఎక్కువగా మధ్యాక్కరలు వాడారు. ఆ తరువాత ఎఱ్ఱన, మరి కొందరు కవులూ ఇటీవలి కాలంలో విశ్వనాథ సత్య నారాయణ వంటి ఒక రిద్దరూ మధ్యాక్కరలు వ్రాశారు. ఈ మధ్యాక్కరల రచన విషయంలో లాక్షణికుల మధ్య గల అభిప్రాయభేదాలను సమన్వయం చేయడంలో సీతాపతి చూపిన ప్రతిభ నిరుపమానమైనది. అంతకు ముందే ఈ విషయంలో టేకుమళ్ళ రాజగోపాలరావు, బొడ్డపాటి రాజన్న పంతులు, వఝల చిన సీతారామశాస్త్రి చేసిన సమన్వయ ప్రయత్నాలలో దోషాలు చూపించి, సీతాపతి అందరికీ ఆమోద యోగ్యంగా క్రొత్తగా సమన్వయం చేశారు.

అప్పు డప్పుడు వివిధ పత్రికలలో వ్రాసిన వ్యాసాలనూ, మరి కొన్ని నూతన పరిశోధనాంశాలనూ చేర్చి 1951 లో సీతాపతి 'తెలుగులో ఛందో రీతులు' అనే గ్రంథం రచించగా దానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి బహుమతి లభించింది. 'తెలుగు ఛందోరీతుల'లో 'పద్యరచన పుట్టుపూర్వోత్తరములు పరిణామము' అనే రెండో ప్రకరణం, 'మాత్రాగణ నిబద్ధములైన ఛందోరీతులు' అనే మూడో ప్రకరణం, 'తెలుగులో పద్య రచనా ప్రారంభం-ఉపజాతి లక్షణం' అనే నాలుగో ప్రకరణం ఛందశ్శాస్త్రంలో సీతాపతికి గల సునిశిత దృష్టికి నిదర్శనాలు.

## తెలుగు విజ్ఞాన సర్వస్వం :

తెలుగులోనే కాక, దక్షిణ భారత భాషలలోనే విజ్ఞాన సర్వస్వ రచనకు మొట్ట మొదట శ్రీకారం చుట్టిన వాడు కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులు. ఇంగ్లీషు లోని 'ఎన్ సైక్లో పీడియా బ్రిటానికా' పద్ధతిలో అకారాది క్రమంలో బహు

సంపుటాలతో కూడిన సర్వ సమగ్రమైన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వాన్ని తెలుగు జాతికి సమకూర్చా లని ఆయన సంకల్పించారు. కాని, ఒక్క 'అ' కారంతో ఆరంభం అయ్యే పదాల వివరణ అయినా పూర్తి కాకుండానే ఆయన కన్ను మూశారు.

విజ్ఞాన సర్వస్వ ప్రకటన వంటి ఒక బృహత్ ప్రణాళిక విడి వ్యక్తుల వల్ల సాధ్యం అయ్యేది కాదనీ, ఉదారులైన దాతల ధన సహాయంతో ఏదైనా ఒక సాహిత్య సంస్థ మాత్రమే అలాంటి పనిని సక్రమంగా నిర్వహింపగలదనీ భావించిన బెజవాడ గోపాలరెడ్డి, రాజా బొప్పరాజు రామకృష్ణ రాజు, మోటూరు సత్యనారాయణ, ఎంబెరుమానార్ చెట్టి, పర్వతనేని బ్రహ్మయ్య మొదలైన ఆంధ్ర ప్రముఖులు కొందరు 1947లో తెలుగు విజ్ఞాన సర్వస్వ రచన ప్రధాన లక్ష్యంగా తెలుగు భాషా సమితి అనే ఒక సంస్థను మద్రాసులో స్థాపించారు. దానికి ఆ నాటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రం విద్యాశాఖామాత్యులు అవినాశలింగం చెట్టియార్, మద్రాసు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు సర్ ఆర్కాట్ లక్ష్మణస్వామి మొదలియార్ వంటి అధికారుల అండ దండలు లభించాయి.

కొమర్రాజు లక్ష్మణరావు పంతుల తరువాత ఆ విధంగా సంస్కృతాంధ్ర ఆంగ్ల భాషలలో పాండిత్యం, చరిత్ర పరిజ్ఞానం కలిగి విజ్ఞాన సర్వస్వ రథ సారథ్యం వహించగల మనీషి ఎవరా అని తెలుగు భాషా సమితి అన్వేషింప సాగింది. అందుకు తగిన అన్ని అర్హతలూ గల బహు ముఖ ప్రజ్ఞాశాలి సీతాపతే అని గుర్తించిన ఘనత మాగంటి బాపినీడుకి దక్కుతుంది. ఆయన సలహా మీదనే భాషా సమితి కార్యవర్గం సీతాపతిని తెలుగు విజ్ఞాన సర్వస్వానికి ప్రధాన సంగ్రాహకుడుగా నియమించింది.

లక్ష్మణరావు పంతులు లాగా మొట్ట మొదటనే అకారాది క్రమంలో సర్వ విజ్ఞానాన్నీ ప్రకటించడానికి పూనుకుంటే, అన్ని సంపుటాలూ ప్రకటించటానికి కొన్ని దశాబ్దాల కాలం పట్టవచ్చు ననీ, అన్నీ పూర్తి అయితే గాని ఆ విజ్ఞాన సర్వస్వం ప్రజలకు ఉపయోగపడ దనీ గుర్తించి, ఆ నాటి పరిస్థితులలో మొదటి మెట్టుగా సద్యః ప్రయోజన కరంగా ఉండగల విజ్ఞాన సర్వస్వం నిర్మించేందుకు ఒక నూతన ప్రణాళికను సీతాపతి కన్వీనరుగా ఉన్న 'సర్వస్వ విధాన నిర్ణయ

సమితి' వారు సూచించారు ఆ ప్రణాళిక ప్రకారం మొత్తం విజ్ఞాన శాఖల నన్నిటినీ పది వర్గాలుగా విభజించి, ఒక్కొక్క వర్గానికి సంబంధించిన విజ్ఞాన శాఖలను ఒక్కొక్క సంపుటంలో వివరించా లని నిర్ణయించబడింది. ప్రతి సంపుటంలోనూ ఆరంభంలో ఆ విజ్ఞాన శాఖలను స్థూలంగా పరిచయం చేస్తూ ఒక సమీక్షా భాగం, ఆ శాస్త్రాలకు సంబంధించిన వివిధ విషయాలను వివరించే ఒక విస్తృతమైన అకారాది భాగం, చివర అకారాది క్రమంలో ఒక సూచిక చేర్చా లనే నిర్ణయం జరిగింది.

ఆలా మొట్ట మొదట పది సంపుటాలుగా ప్రకటింప తలపెట్టిన ఆ విజ్ఞాన సర్వస్వం సంపుటాల సంఖ్య క్రమంగా పది హేనుకు పెంచబడింది. ఇటీవల తెలుగు భాషా సమితి తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనం అయిన తరువాత సమితి వారు తయారు చేసిన సంపుటాలను పునర్ముద్రించేటప్పుడు వాటిని మరింత ఆధునికంగానూ, విపులంగానూ తీర్చిదిద్ది, మొత్తం 36 సంపుటాలలో ఆ విజ్ఞాన సర్వస్వాన్ని పునర్ముద్రించాలని తెలుగు యూనివర్సిటీ సంకల్పించింది.

తెలుగు భాషా సమితి తలపెట్టిన దశ సంపుట విజ్ఞాన సర్వస్వంలో మొదటి దయిన 'చరిత్ర - రాజనీతి' సంపుటాన్ని సీతాపతి తయారు చేశారు. ఆ సంపుటానికి గాడిచెర్ల హరిసర్వోత్తమ రావు, ప్రతాపగిరి రామమూర్తి, సీతాపతి సంపాదకులు. ఆ విధంగా తొలి సంపుటం తయారు చేయడంలో కృత్యాద్యవస్థల నన్నిటినీ భరించి తరువాతి సంపుటాలకు మార్గనిర్దేశం చేసిన వాడు సీతాపతి!

## తెలుగు సాహిత్య చరిత్ర :

అఖిల భారత సాహిత్య అకాడమీ వారు భారత దేశంలోని అన్ని ప్రధాన భాషాలలోని సాహిత్యాల చరిత్రలనూ ఇంగ్లీషు భాషలో వ్రాయించి ప్రకటించ డానికి పూనుకుని ఆ విధంగా ఇంగ్లీషులో తెలుగు సాహిత్య చరిత్రను వ్రాసే బాధ్యతను సీతాపతికి ఒప్పగించారు. "తెలుగు భాషా సాహిత్య రంగాలలో సుప్రసిద్ధులు కావడమే కాక, ఈ శతాబ్ది ప్రముఖ తెలుగు రచయితలలో చాలామందితో ప్రత్యక్ష పరిచయం కలవారు కావడం వల్లనే సీతాపతిని ఈ బాధ్యతను నిర్వహించడానికి" ఎన్నుకున్నట్టు సాహిత్య అకాడమీ వారు ఆ గ్రంథం అట్టమీద పేర్కొన్నారు.

అంతకు ముందు పి. టి. రాజు, చెంచయ్య, భుజంగరావులు తెలుగు సాహిత్య చరిత్రను ఆంధ్రేతరులకు పరిచయం చేయడం కోసం ఇంగ్లీషు భాషలో వ్రాసినవా రున్నారు. వారు వ్రాసిన చరిత్రల కంటె సీతాపతి వ్రాసిన చరిత్ర విపులమైంది. డెమ్మీ సైజులో అచ్చులో సుమారు 300 పుటల గ్రంథం అది.

ఈ గ్రంథంలో సీతాపతి ప్రాచీన యుగం (600-1900), ఆధునిక యుగం (1900 తరువాత) అని రెండే యుగాలుగా తెలుగు సాహిత్య చరిత్రను విభజించి, వివరించారు. ప్రాచీన యుగ చరిత్రకు 150 పుటలనూ, ఆధునిక యుగ చరిత్రకు 150 పుటలనూ కేటాయించినందు వల్ల ఈ చరిత్ర ఆధునిక తెలుగు సాహిత్య వికాస వివరణకు విశేష ప్రాధాన్యం ఇచ్చినట్టు స్పష్టం అవుతుంది.

ఒక భాష రాని వారికి ఆ భాషా సాహిత్యంలో కనిపించే వివిధ ధోరణులనూ, విశిష్టమైన సొగసులనూ మరొక భాషలో చూచాయగా అయినా పరిచయం చేయడం చాలా కష్టమైన పని. ఆ కార్యం తా మాశించిన విధంగా ఈ గ్రంథంలో నెరవేర లేదనీ, అందువల్ల మరొకరి చేత ఇంగ్లీషులో తెలుగు సాహిత్య చరిత్ర వ్రాయించా లనీ ప్రస్తుతం సాహిత్య అకాడమీ వారు ఆలోచిస్తున్నట్టు తెలుస్తూంది. ఈ గ్రంథం వ్రాసే సమయంలో సీతాపతి బహు కార్య వ్యాపృతులై ఉండడం, వార్ధక్యం పైబడడం అందుకు కొంతవరకు కారణాలు కావచ్చును.

ఈ గ్రంథంలో తెలుగు భాషను గూర్చి చెప్పవలసి వచ్చిన సందర్భాలలో సీతాపతి ప్రతిభ మరింత ప్రస్ఫుటంగా కనిపిస్తూంది. ఆధునిక కవులు అన్య దేశ్య పదాలను యథేచ్ఛగా తమ రచనలలో వాడుతున్నారనీ, వాటిలో కొన్ని తెలుగు పదాలే అనిపించేటంతగా తెలుగులో కలసిపోయా యనీ చెబుతూ అందుకు దృష్టాంతంగా సీతాపతి 'rules' అనే ఇంగ్లీషు మాట 'నిబంధనలు' అనే అర్థంలో 'రూల్స్' అని ఇంగ్లీషులోని బహువచన ప్రత్యయంతో సహా తెలుగులోకి వచ్చిందనీ, అడ్డగీతలు అనే అర్థంలో 'రూళ్ళు' అని తెలుగు బహు వచన ప్రత్యయంతో తెలుగులోకి వచ్చిం దనీ పేర్కొన్నారు.

మొట్ట మొదటి సారిగా ఆంగ్ల నాటకాన్ని తెలుగు చేసిన వావిలాల వాసుదేవ శాస్త్రి 'జూలియస్ సీజర్' నాటకాన్ని తేట గీతులలో అనువదించారని చెబుతూ

'Friends, Romans and Country men....' అని ఆరంభం అయ్యే సుప్రసిద్ధమైన ఆంటనీ ప్రసంగాన్ని ఈ క్రింది విధంగా అనువదించా రంటూ సీతాపతి ఆ తెలుగు పద్యాన్ని రోమన్ లిపిలో ఉదాహరించారు.

"సద్ధితులు రోమనులు స్వ దేశస్థు లార!
చెవులు తెరవండి వినగ నా చెప్పు దాని
వచ్చితిని నేను సీజరుఁ బాతి పెట్ట
గాను, వానిని నుతియింప గాను గాదు
బ్రూటసుండు చాలగ పరువు గల వాఁడె!
మిగిలిన యందరును పరువు గల వారె!

గురజాడ అప్పారావు వ్రాసిన—

దేశాభిమానం నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయ్
పూని ఏదైనాను ప్రజలకు
గట్టి మేల్ తల పెట్టవోయ్!

అన్న చరణానికి సీతాపతి చేసిన ఇంగ్లీషు అనువాదం చూడండి :

**"Blow not thy trumpet indiscreet**
**'I love my country sweet'**
**Do thou and show a deed renowned**
**Give up thy bragging sound".**

## ఇతర రచనలు :

తన పరిశోధనకు ఫలితంగా సీతాపతి కలం నుంచి వెలువడిన మరి కొన్ని రచనలను గురించి కూడా ఇక్కడ ముచ్చటించుకోవాలి.

ఇంగ్లీషు భాషలో సీతాపతి చేసిన మరి ఒక రచన 'మహా కవి గురజాడ అప్పారావు', సాగర్ పబ్లికేషన్స్ (ఇసామియా బజారు, హైదరాబాద్) వారు దానిని ప్రకటించారు. క్రౌన్ సైజులో సుమారు 150 పుటలు గల ఈ జీవిత

చరిత్ర ఆంధ్రేతరులకు గురజాడ అప్పారావు జీవిత గాథను రసవంతంగా చెబుతూంది. గురజాడ అప్పారావు తన తండ్రికి సహాధ్యాయి, సన్మిత్రుడు కావడం వల్లా, సన్నిహితంగా ఆయన జీవితాన్ని పరిశీలించే అవకాశం తనకు లభించడం వల్లా ఇతరు లెవరూ సాధించలేని ఘన విజయాన్ని ఈ జీవిత చరిత్ర రచనలో సీతాపతి సాధించారు.

ప్రధానంగా చరిత్ర విద్యార్థే అయినా, ఆదినుంచీ సీతాపతికి గల సాహిత్య పక్షపాతం ఆంగ్ల సాహిత్యాన్ని కూడా ఆయన క్షుణ్ణంగా అధ్యయనం చేయడానికి దారితీసింది. తత్ఫలితంగానే ఆయన చివరి రోజులలో 'షేక్స్పియర్ రచనలు - సవిమర్శక ప్రశంస' అనే రచన తెలుగులో చేయగా విశాలా పబ్లికేషన్స్ (హైదరాబాద్ - 28) వారు దానిని ప్రచురించారు. డెమ్మీ సైజులో సుమారు 250 పుటలు గల ఈ గ్రంథం షేక్స్పియర్ జీవితాన్నీ, ఆయన రచనలలోని సోయగాన్నీ మనోహరంగా వివరిస్తూంది. గ్రంథం చివర సుమారు 20 పుటలలో షేక్స్పియర్ నాటకాలలోని కొన్ని ప్రధాన సూక్తులూ, వాటికి సీతాపతి చేసిన తెలుగు అనువాదాలూ కూడా చేర్చబడ్డాయి.

'నేటి రచనలలోని తప్పులు' అని సీతాపతి రచించిన ఒక చిన్న గ్రంథాన్ని (డెమ్మీ 1/8 30 పుటలు) ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ వారు తమ 7 వ సాంస్కృతిక ప్రచురణగా ప్రకటించారు. భవిష్యత్తులో నేటి వ్యావహారిక భాషకు వ్యాకరణం వ్రాయడానికి పూనుకునే విద్వాంసులకు ఉపకరించ గల చక్కని రచన ఇది!

## శాసన పరిశోధన :

సీతాపతి చేసిన పరిశోధనలలో శాసన పరిశోధన వ్యాసంగాన్ని గురించి చిట్టచివర ప్రస్తావిస్తున్నా నిజానికి ఈ కృషి ఆయన జీవితంలో తొలిదశలోనే ముమ్మరంగా సాగింది. ఇతర రంగాలలో లాగానే శాసన పరిశోధన విషయంలో కూడా సీతాపతికి ఔత్సుక్యాన్నీ, ప్రేరణనూ కలిగించింది ఆయన తండ్రి రామమూర్తి పంతులుగారే!

చిన్నతనంలో రామమూర్తి తరచు తమ జన్మస్థలమైన పర్వతాలపేటకు వెళుతూ, దారిలో ముఖలింగ క్షేత్రంలో ఆగి, ముఖలింగేశ్వరుణ్ణి దర్శించి వెళుతూ ఉండేవారు. అప్పుడే ఆయనకు ఆ ఆలయం గోడలమీదా, స్తంభాలమీదా వ్రాసి ఉన్న శాసనాలను చదివి పర్లాకిమిడి రాజవంశం వారి పూర్వ చరిత్రను వెలుగులోకి తేవాలనే సంకల్పం కలిగింది. గురజాడ అప్పారావు వల్ల ఆ నాడు వెలువడుతున్న 'ఇండియన్ ఆంటిక్వరీస్', 'ఎపిగ్రాఫియా ఇండికా', అనే పత్రికలను గురించీ, పాలియోగ్రఫీ, ఎపిగ్రఫీలను గూర్చి తెలిపే గ్రంథాలను గురించీ తెలుసుకుని అప్పుడు తనకు శిష్యుడుగా ఉన్న పర్లాకిమిడి కుమారరాజా పద్మనాభ దేవ్ చేసిన ఆర్థిక సహాయంతో రామమూర్తి పంతులు వాటిని తెప్పించి చదివారు. ప్రాచీన కాలపు లిపులను అధ్యయనం చేశారు. ఆ తరువాత ఒకసారి ఆయన ముఖలింగం దేవాలయం వెళ్ళినప్పుడు అక్కడి గోడలమీద ఉన్న శాసనాలను గడగడా చదువుతూ ఉంటే చూసి, అంతవరకూ అవి దేవతల వ్రాత లని భావిస్తూ వచ్చిన దేవాలయం అర్చకులు విస్తుపోయారట! రామమూర్తిని దేవాంశసంభూతు డని కీర్తించారట !

ఆ శాసనాల సహాయంతో రామమూర్తి 1894 లో ప్రకటించిన ఒక వ్యాసంలో రెండవ కామార్ణవుడు (క్రీ. శ. 800) మొదలు అనంతవర్మ చోడగంగు (క్రీ.శ. 1100) వరకు మధ్యకళింగ దేశాన్ని పాలించిన తూర్పు గాంగవంశ రాజులకు రాజధాని అంతవరకూ అందరు అనుకుంటున్నట్టు కళింగ పట్టణం కాదనీ, ముఖలింగమే వారి రాజధానిగా ఉండేదనీ, కళింగ పట్టణం కేవలం ఓడరేవు మాత్రమే అనీ సోపపత్తికంగా నిరూపించారు.

తరువాత అనంతవర్మ చోడగంగు శాసనాలను పరిష్కరించిన సీతాపతి తూర్పు గాంగ వంశ రాజులు ముఖలింగాన్ని రాజధానిగా చేసుకోక ముందు అక్కడ సవరలు నివసిస్తూ ఉండేవారనీ, శబరాదిత్యుడు అనే ఒక సవర రాజును క్రీ.శ. 1702 లో ఒక యుద్ధంలో ఓడించి కామార్ణవుడు తమ రాజధానిని దంతపురం నుంచి ముఖలింగానికి తరలించాడనీ ధ్రువపరిచారు.

రెండు కొర్ని తామ్ర శాసనాలను పరిష్కరించి సీతాపతి భారతి మాస పత్రికలో (క్రోధన - శ్రావణమాసం - 1925) ప్రకటించారు. ఈ కొర్ని శాస

నాలు రెండూ సంస్కృత భాషలో వ్రాయబడ్డాయి. మొదటి శాసనం గుణమహార్ణవుని పుత్రుడు వజ్రహస్తుడు 'వరాహవర్తని' ప్రాంతంలోని కొన్ని గ్రామాన్ని 300 మంది నానా గోత్రముల బ్రాహ్మణులకు దానం చేస్తూ వేయించింది. రెండవ శాసనం అనంత వర్మ చోడగంగ దేవుడు 'ముండపటు' గ్రామాన్ని బ్రాహ్మణులకు దానం చేస్తూ వేయించింది. ఈ రెండవ శాసనం వల్ల గాంగ వంశ రాజుల చరిత్ర విపులంగా తెలుస్తూంది.

సీతాపతి కళింగ సంచికలో 'కళింగ దేశ శాసనము లందలి తెలుగు భాష' అనే 15 పుటల చక్కని వ్యాసం ప్రకటించారు. ఆ వ్యాసంలో ముఖలింగం, శ్రీకూర్మం, సింహాచలం, అరసవెల్లి, దీర్ఘాసి, రాగోలు, రావిపాడు, శ్రీమహేంద్ర గిరి దేవాలయాల గోడలమీద ఉన్న వందలాది తెలుగు శాసనాలలోని భాషకూ, ద్రాక్షారామం మొదలైన ఇతర ప్రాంతాలలో లభించిన శాసనాలలోని భాషకూ ఎలాంటి భేదం లేదని నిరూపించారు. వ్యవహార భాష, శాసన భాష, ప్రబంధ భాష ఎలా క్రమ పరిణామం చెందుతాయో వివరించారు.

శాసన పరిశోధనలో సీతాపతి ప్రతిభను ప్రశంసిస్తూ సుప్రసిద్ధ పురాతత్త్వ వేత్త బి. ఎన్. శాస్త్రి ఇలా వ్రాశారు:

"కీ॥శే॥ డా. గిడుగు వేంకట సీతాపతి గారు సంస్కృతాంధ్రాంగ్ల భాషల యందు నిష్ణాతులు, పండితులు. వారు శాసన లిపులను చదువుటయం దభినివేశము కలవారు. కళింగ రాజ వంశమునకు సంబంధించిన అనేక శాసనములను చదివి కొన్ని తామ్ర శాసనములను ప్రకటించినారు....కీ॥శే॥ డా. గిడుగు సీతాపతిగారు బ్రాహ్మీ, వేంగీ, శాలంకాయన లిపులను క్షుణ్ణముగా నేర్చినారు." పరిశోధకుడుగా కూడా తెలుగు భాషా యోషకు సీతాపతి చేసిన సేవ చిరస్మరణీయమైంది.

# 10

# ఉపసంహారం

ఆధునిక భారత దేశ చరిత్రలో గాంధీ మహాత్ముడూ, పండిత జవహర్ లాల్ నెహ్రూ నిర్వహించిన పాత్రలు ఎలాంటివో తెలుగు దేశంలో సాగిన వ్యావహారిక భాషోద్యమంలో గిడుగు రామమూర్తి పంతులూ, సీతాపతీ నిర్వహించిన పాత్రలు ఇంచుమించుగా అలాంటివి!

## గాంధీ, నెహ్రూలు :

గాంధీ మహాత్ముడు ప్రధానంగా భారత దేశానికి పరాయి పాలన నుండి దాస్య విముక్తిని సాధించడం కోసమే తన జీవితాన్ని ధారపోశాడు. అలాగే రామమూర్తి పంతులు కూడా తెలుగు లిఖిత భాషకు ఆ నాటి ఛాందసపు పండితులు విధించిన కఠోర నియమ నిబంధనల నుండి విముక్తిని సాధించడం కోసమే తన సర్వ శక్తులూ వినియోగించి పోరాడారు. తన ప్రధాన ధ్యేయమైన విద్యాబోధనకు మాధ్యమంగా వ్యావహారిక భాష విశ్వవిద్యాలయాల ఆమోద ముద్ర పొందడం ఆయన జీవిత కాలంలో జరుగక పోయినా, ఆ నాటి ప్రముఖ కవులూ, నాటక కర్తలూ, పాత్రికేయులూ మొదలైన వారు అసంఖ్యాకంగా వ్యావహారిక భాషను ఆదరించడం, సాహిత్య భాషగా వ్యావహారిక భాష గౌరవ ప్రతిపత్తులు సాధించుకోడం ఆయన జీవిత కాలంలోనే జరిగాయి.

స్వాతంత్ర్య సంపాదన అనంతరం నెహ్రూ దేశానికి సుస్థిరమైన ప్రజాస్వామ్య ప్రాతిపదికను ఏర్పరచడం, పంచ వర్ష ప్రణాళికలతో దేశాన్ని పునర్నిర్మించడానికై బృహత్ ప్రయత్నం చేయడం, అలా భారతీయులను నవీన యుగంలోకి ప్రవేశపెట్టడం జరిగినట్టు సీతాపతి తండ్రిగారి మరణానంతరం తెలుగు సాహిత్య భాషకు ఆయన సాధించిన స్వేచ్ఛను క్రమబద్ధం చేసి ఒక సమగ్రమైన ఆధునిక భాషా నిఘంటువునూ, ఆధునిక భాషా వ్యాకరణాన్నీ నిర్మించడానికి కృషి చేయవలసి ఉంది.

కాని తండ్రిలోని కార్యదీక్ష, ప్రధానలక్ష్యం పై దృష్టిని కేంద్రీకరించే పట్టుదల సీతాపతిలో లోపించడంవల్ల ఆ పని జరుగలేదు.

డాక్టర్ ఆక్కిరాజు రమాపతిరావు అన్నట్టు "రామమూర్తి పంతులుగారి కన్నా కూడా కొన్ని రంగాలలో అతిశయమైన ప్రజ్ఞ కలవారు సీతాపతిగారు ... ఇంచుమించుగా 50 సంవత్సరాల వయస్సున్న జీవితంలో ఒక కుదురు లేకపోయి నందువల్ల, స్తిమితత కొరవడి నందువల్ల సీతాపతి పంతులు గారి ప్రజ్ఞ రాణించ వలసి నంతగా రాణించలే దనిపిస్తుంది."*

రామమూర్తి పంతులు గారు కూడా తమ కుమారుడు సీతాపతి స్వభావాన్ని గూర్చి వేటూరు ప్రభాకరశాస్త్రి గారికి 7-3-1924న వ్రాసిన ఒక లేఖలో ఇలా అంటారు.

"చి॥ సీతాపతిని నా పనికి ఉపయోగించుకో లేదు. నవలో, నాటకమో, పాటో, పదమో వాడికి ఇష్టమయినది వాడు వ్రాయవచ్చును. రచించుటకు పూనుకొమ్మని ఇదివరకే చెప్పినాను. అయితే వాడికి తీరిక తక్కువ. మ్యునిసిపాలిటీ పనులు, కో-ఆపరేటివ్ బ్యాంకి పనులు చేసి, చదరంగం ఆడి కాని, వీణ వాయించి కాని విశ్రాంతి పొందుతాడు."

## పిఠాపురం రాజాతో మైత్రి :

తండ్రి మరణానంతరం సీతాపతి తాను కొనసాగించ వలసి ఉన్న నిర్మాణాత్మకమైన కృషిని కొనసాగింపక పోగా వ్యావహారిక భాషావాదానికి బద్ధ విరోధి అయిన పిఠాపురం రాజాగారితో చేతులు కలిపి తన శక్తి యుక్తులను గ్రాంథిక భాషా నిఘంటువైన సూర్యరాయాంధ్ర నిఘంటువు చివరి సంపుటాల ముద్రణ పర్యవేక్షణ, ప్రభావతీ ప్రద్యుమ్నంవంటి ప్రాచీన ప్రబంధాల పునర్ముద్రణ వంటి పనులకు వినియోగించడం దురదృష్టకరం!

చివరి రోజులలో పిఠాపురం మహారాజా వారితో తనకు మైత్రి ఎలా ఏర్పడిందీ తన స్వీయ చరిత్రలో సీతాపతి ఇలా వివరించారు:

---

* చూ. 'కళా ప్రపూర్ణులు' - గిడుగువారి సంస్మరణ సంచిక.

"1942 లో తలవని తలంపుగా నాకు పిఠాపురము మహారాజా వారి పరిచయము కలిగినది. వీరు భాషా వాదములో మా తండ్రి గారి వాదమును నిర్మూలించుటకు పూనుకొని ఆంధ్ర సాహిత్య పరిషత్తును స్థాపించి, దానికి పోషకులుగా ఉన్నారు. 1926 లో నేను మద్రాసు యూనివర్సిటీ సెనేటు సభ్యుడుగా ఉన్నపుడు వారును సభ్యులుగా ఉండి, పొరపాటున నేను కూర్చుండిన ప్రక్క కుర్చీలో కూర్చుండి నన్ను చూడగానే తేలు కుట్టినట్టు చట్టున లేచి పోయి, మరి యొక చోట దూరముగా కూర్చుండిన వారే! 1942 నుండి నా యెడల ఎందుకు అనుగ్రహము కలిగినదో చెప్పలేను. ఒక నాటి రాత్రి చెన్నపురి ఆంధ్ర మహాసభలో ఒక నాటక ప్రదర్శనము జరుగుతూ ఉన్నప్పుడు నన్ను వారు పలుకరించి 'ఈ నాటక ప్రదర్శనములో మీరు పాల్గొన లేదేమి?' అని ప్రశ్నించి, భాషా సాహిత్య విషయములు ప్రసంగించి, నా యభిప్రాయములు తెలుసుకో గోరినారు. ఆ తరువాత మరి యెకసారి పోతన తన భాగవతము సింగ భూపాలునికి అంకితము చేయలే దన్న కోపం కొద్దీ సింగ భూపాలుడు ఆ గ్రంథమును పాతిపెట్టించినా డన్న కథను గురించి నా అభిప్రాయ మడిగారు. ఆ కథ నేను నమ్మనని, నమ్మక పోవుటకు కారణాలు వివరించాను.

"....మహారాజా వారితో కలిగిన పరిచయం గాఢమైన మైత్రిగా పరిణమించి నది. పింగళి సూరన్న ప్రభావతీ ప్రద్యుమ్నము, దేవుల పల్లి సుబ్బయ్య (సుబ్బరాయ) శాస్త్రి గారి మహేంద్ర విజయము, దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి గారి 'రావు వంశ ముక్తావళి', సింగభూపాలుని రసార్ణవ సధాకరం, తమ నిఘంటువులో 5వ, 6వ, 7వ, వాల్యూములు ముద్రించే పని నాకు అప్పగించినారు. అందులో కొన్నింటికి నా గ్రంథపరిచయ వాక్యములు కూడా వారి కోరిక ననుసరించి ఆ యా గ్రంథాలలో ప్రకటించడం కూడా జరిగింది."

## ఆత్మ పరితాపం :

తండ్రి వలె దృఢదీక్షతో తన జీవిత ధ్యేయాన్ని విస్మరించకుండా కృషి చేయగల చిత్త దార్ఢ్యం గాని, పరిస్థితుల ఆనుకూల్యం గాని సీతాపతికి కొరవడి నప్పటికీ, తన తండ్రి ఆశయ సాఫల్యానికి తగు విధంగా కృషి చేయలేక

పోతున్నానే అనే పరితాపం మాత్రం సీతాపతిలో ఉండేవి. తన స్వీయచరిత్ర చివరి పుటలో ఆయన ఇలా అంటారు :

"శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మ గారికి (కృష్ణా పత్రిక సంపాదకులు) నే నొక తెలుగు నిఘంటువును మా తండ్రిగారి నోట్సు ఆధారంగా రచించడానికి ఒప్పుకుని చాలా కాలమైనది. ఇంతవరకు కార్యాంతరముల వలన ఆ పని సాగలేదు. వృద్ధుడను, బలహీనుడను అయినా ఉత్సాహ శక్తి తగ్గలేదు. భగవంతుడు దయ తలచి మరి యొక రెండేండ్లు నాకు ఆయువు, బలము ప్రసాదిస్తే ఆ పని కూడా నిర్వహించగల నని అనుకుంటున్నాను."

ఈ మాటలు సీతాపతి వ్రాసినది 1962 లో. అటు తరువాత ఆయన ఏడు సంవత్సరాలు జీవించి ఉన్నారు. అయినా తగినంత శారీరక బలము లేకనో, పరిస్థితులు అనుకూలించకనో ఆయన సంకల్పించిన ఆ నిఘంటు రచన జరుగ లేదు.

ఒక రోజున పిఠాపురం రాజా గారితో సీతాపతికి ఈ క్రింది సంభాషణ జరిగిందట:[1]

రాజాగారు : మీరు గ్రాంథిక భాషలో వ్రాయరా దన్న నియమం పెట్టుకొన్నారా ?

సీతాపతి : అట్టి నియమం నేనేమీ పెట్టుకో లేదు. మా వ్యావహారిక భాషావాదం ముఖ్యంగా గద్య రచన కోస ముద్దేశింప బడినది. పద్య రచనలో వ్యాకరణ సూత్రాలకు విరుద్ధములైనా, కవుల ప్రయోగాలు మాకు గ్రాహ్యములు.

రాజాగారు : నాకు మీ వాదము నచ్చినది. మీరు ఈ నాటిక (కువలయావళి నాటిక) తెనిగించండి.

---

1. స్వీయ చరిత్ర-పుటలు 56, 57

రాజాగారి ఇష్టం ప్రకారమే సీతాపతి ఆ కువలయావళీ నాటికను అరసున్న (ఁ) లూ, శకటరేఫ (ఱ) లూ కూడా పాటిస్తూ వీర గ్రాంథిక భాషలో తెలుగు చేశారు.

## నేటి లిఖిత భాష:

చివరి రోజులలో నేటి మన లిఖిత భాషను గూర్చి సీతాపతికి ఏర్పడిన అభిప్రాయాలను ఈ క్రింది వాక్యాలు స్పష్టం చేస్తున్నాయి:

"ఎవరే భాషలో రచిస్తూ ఉన్నా, నేటి రచనలు నిర్దుష్టములు కావు. వాటిలో గల తప్పు లెట్లున్నవో ఈ వ్యాసమందు చూపించుటకు సాహసిస్తు న్నాను .... కావ్యములందునూ లేక, నేటి వ్యవహారమందునూ లేక తెలిసీ తెలియని రచయితలు కొందరు తెచ్చిపెట్టిన ప్రయోగములు తప్పు లనకతప్పదు "[2]

రామమూర్తి పంతులు గారు కూడా తమ చివరి రోజులలో ఇంచుమించు ఇలాంటి అభిప్రాయాన్నే ప్రకటించినట్లు తెలుస్తూంది. సుప్రసిద్ధ వక్త, బెంగాలీ నవలల అనువాదకుడు జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి రామమూర్తి గారికి ఒక రకంగా అల్లుడు. సత్యనారాయణ మూర్తి గారి భార్య శారదాంబ రామ మూర్తి గారి పెదతండ్రి వెంకయ్య గారి మనుమరాలు. రామమూర్తిగారికి పుత్రికా సంతానం లేనందువల్ల 1906 లో ఆమెను ఆయన దత్తత చేసుకొన్నారు. రామమూర్తిగారి చివరి రోజులలో ఒకసారి శారదాంబగారు పెంపుడు తండ్రిని చూడటానికి రాగా రామమూర్తి గారు ఆమెతో ఆమె భర్త బెంగాలీ గ్రంథాలను గ్రాంథిక భాషలో అనువదిస్తున్నందువల్ల తెలుగు వారికి ఆ మూల గ్రంథాలు ఎంత అర్థం అవుతాయో, ఇతని తెలుగు భాషానువాదాలు కూడా అంతే అర్థం అవుతాయి అన్నారట.

శారదాంబ గారు నవ్వుతూ "అయితే గ్రాంథిక భాషను ఎవరూ చదవ కూడ దంటారా ?" అని పెంపుడు తండ్రి చెవిలో నోరు పెట్టి గట్టిగా అడిగారు.

---

2. నేటి రచనలలోని తప్పులు - సాంస్కృతిక ప్రచురణలు - పుట 2

అప్పుడు రామమూర్తి గారు ఆమెకు చెప్పిన సమాధాన మిది : "నేను గ్రాంథిక భాషకు వ్యతిరేకిని కాను, తెలుగు భాషలో పాండిత్యం సంపాదించా లన్నా, భాషా స్వరూపం తెలుసుకోవా లన్నా గ్రాంథిక భాషను తప్పకుండా అభ్యసించాలి. తెలుగు భాషకు ప్రాణవాయువు వంటిది సంస్కృతం. దానిని కూడా అభ్యసించడం అవసరం. ప్రజలకు ఉపయోగ పడే గ్రంథాలను కృతక భాషలో రచించి భేషజాన్ని ప్రదర్శించ వద్దంటాను. ఈ వ్రాతలు వ్రాసే వారు తాము మోసపోయి విద్యార్థులను మోసం చేస్తున్నారు. నేను అదే వద్దంటున్నాను."*

రామమూర్తి పంతులు గారి వ్యావహారిక భాషా వాదాన్ని అంగీకరించిన వేటూరి ప్రభాకర శాస్త్రి వంటి పండితులు కూడా సాహిత్యేతర ప్రయోజనాల వరకూ మాత్రమే శిష్ట వ్యావహారిక భాషను అంగీకరించారు. సీతాపతి వ్రాసిన భారతీ శతకానికి ఉపోద్ఘాతం వ్రాస్తూ ప్రభాకర శాస్త్రి ఇలా అంటారు:

"భాషా ప్రయోజనములలో సత్కావ్య నిర్మాణము నొక ప్రయోజనము. అంతే కాని సత్కావ్య నిర్మాణ మొక్కటియే భాషా ప్రయోజనము కాదు. ప్రాచీన లాక్షణి కానుశాసిత మగు నాంధ్రభాష కావ్యైక ప్రయోగార్హ ముగనే కలదు గాని, తదితర సర్వ భాషా ప్రయోజనములకును సరిపడఁ జాలకున్నది. అట్లే వ్యావ హారిక భాష కూడ నేడు సత్కావ్య ప్రయోజనమునకుఁ జాలకయే యున్నది. కోర్టులో, కౌన్సిలులో, రేడియోలో సంభాషించుటకు నేఁటి కావ్యభాష యుపయోగ పడదు. 'వస్తూ,' 'పోతూ', 'చూస్తూచూస్తూ', 'అన్నారు', 'ఉన్నారు'-ఇత్యాదులు శిష్ట వ్యవహారము నుండి చంపివేసి,'వచ్చుచుఁ','బోవుచుఁ', 'జూచుచుఁ జూచుచుఁ', 'అనిరి', 'ఉండెడివారు' ఇత్యాదులను జొప్పింపఁ దరము గాదు. 'ఉంటే ఊరా, పోతే పాడా, 'అంటే అన్నా వంటారు గానీ' - ఇటువంటి చవిగల పలుకుబడు లెన్నో వ్యవహారమున సాగుచున్నవి. వీటి నన్నింటినిఁ గోర్టు, కౌన్సిలు, రేడియో వ్యవ హారములు పరిత్యజింపఁ జాలవు. రేపు స్వరాజ్యము వచ్చి, ఆంధ్రరాష్ట్రము వేరు పడి, కౌన్సిళ్ళలో ఆంధ్రభాషా వ్యవహారము సాగి, తెలుగు షార్టుహాండు ప్రబలమై దైవానుగ్రహము దైవాటితే -పెద్దలు సభలలో వ్యవహరించిన భాషా వ్యవ హారము స్వస్వరూపముతో పత్రికలలో ప్రకటితము కావలెనే కాని అది నన్నయభట్టి

* గిడుగు రామమూర్తి (జీవితచరిత్ర)-జి.వి. రామమూర్తి, పుటలు 66-67

యాథర్వణీయాది వ్యాకరణ పారాయణ పరాయణులచే పరిసంస్కృతమై ప్రకటితము గారాదు. భాషా ప్రయోజనము లెన్నో నానాటికిఁ బ్రబలుచున్నవి. ఇంకను బర భాషల మూలమున నిన్న నేఁడు ననుభవించు లాభముల నెన్నిటినో మాతృభాష మూలమున నిఁక మన మనుభవింపవలసి యున్నాము. అట్టి ప్రయోజనముల కెల్లఁ బనికివచ్చుటకు వ్యవహార భాష సముచిత పరిపోషము కావలెను."

ఈ ఉపోద్ఘాతాన్ని ప్రభాకర శాస్త్రి శిష్ట వ్యావహారిక భాషలో కాకుండా గ్రాంథిక భాషలోనే వ్రాయడం గమనించ దగింది.

## ధన్య జీవి :

ప్రతి వ్యక్తి జీవితంలోనూ సాఫల్యం, వైఫల్యం కలసిపోయి ఉంటాయి. ఒక దృష్టితో చూస్తే సీతాపతి ధన్యజీవి; గొప్ప అదృష్టవంతుడు. ఋషి వంటి రామమూర్తి పంతులుకు జ్యేష్ఠ పుత్రుడై జన్మించడం, యుక్త వయస్సు వచ్చిన దగ్గర నుంచి మిత్రుని లాగ, జంట పండితుడి లాగ ఆయనతో కలిసి పని చేయ గలగడం ఆయన మొదటి అదృష్టం. ఉన్నత విద్య అభ్యసించ గలగడం, విదేశాలు దర్శించి రావడం, గురజాడ అప్పారావు, విక్రమ దేవవర్మ, పర్లాకిమిడి రాజా, విజయనగరం రాజా, పిఠాపురం రాజా వంటి పెద్దలతో సన్నిహితంగా మెలగ గలగడం, గౌరవప్రదాలైన ఉన్నత పదవులను అధిరోహించడం, చలన చిత్ర నటుడుగా అశేష ప్రజల ఆదరణ పొందడం ఆయన జీవిత చారితార్థ్యాన్ని చాటుతున్నాయి.

సీతాపతి మహా ప్రతిభావంతుడు. చిన్ననాటి నుంచి చివరి వరకూ కవిత్వం, పరిశోధన, రంగస్థల నాటకాలలోనూ, చలన చిత్రాలలోనూ అభినయం- మొదలైన వాటిలో ఏ రంగంలో అడుగు పెడితే ఆ రంగంలోనే అందరికీ ఆయన ప్రీతి పాత్రుడు అయాడు.

రామమూర్తిగారికి ఆయన 70 వ ఏట 1933 డిసెంబరు 29, 30, 31, తేదీలలో రాజమండ్రిలో సమస్తాంధ్ర కవిపండితులూ కలిసి ఘనంగా సప్తతి పూర్తి ఉత్సవం జరిపి, ఆ సందర్భంలో చిరస్థాయిగా ఉండగల గొప్ప అభినందన వ్యాస సంచిక (Commemoration Volume) ఆయనకు సమర్పించినట్లే

రామమూర్తి పంతుల శతజయంత్యుత్సవాన్నీ, సీతాపతి అష్టసప్తతి తమ (78వ) జన్మదినోత్సవాన్నీ పురస్కరించుకొని శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు అధ్యక్షుడుగా ఏర్పాటైన 'డాక్టరు గిడుగు వేంకట సీతాపతి సన్మాన సంఘం' వారు 1963 లో సీతాపతిని అంత ఘనంగానూ సత్కరించారు. ఆ సందర్భంలోనే ఆయన వ్రాసిన "స్వీయ చరిత్రను" ఆ సన్మాన సంఘం ప్రచురించింది.

## అవసాన దశ :

వార్ధక్యం కారణంగా 1960 ప్రాంతంలో సీతాపతి జవ సత్వాలు క్షీణింపగా విశాఖపట్టణం కింగ్ జార్జ్ హాస్పిటలులో ఆయన మనుమడి రక్తాన్ని తీసి ఆయనకు ఎక్కించారు. ఆ సందర్భంలో ఆయన ఈ రచయితతో "నా మనుమడి రక్తంతో నాలో కొత్త యౌవనం వచ్చింది. మరో 20 ఏళ్ళ పాటు నేను తెలుగు సాహిత్య సేవ చేయగలను" అన్నారు. తండ్రిలాగానే చివరి రోజులలో ఆయన కూడా కొంత వరకు బాధిర్యం (చెవుడు) తో బాధపడినా చివరి వరకూ ఆయన ఆరోగ్యంగానే ఉంటూ, సాహిత్య వ్యాసంగం కొనసాగిస్తూనే వచ్చారు.

తెలుగు భాషా సమితిలో పదవీ విరమణ చేసిన తరువాత దాదాపు ఒక దశాబ్ది పాటు ఆయన హైద్రాబాదులో తమ కుమారుడు రామమూర్తి ఇంట విశ్రాంతి జీవితం గడుపుతూ హైద్రాబాదులోని సాహితీ మిత్రులతో సరస సల్లాపాలు సాగిస్తూ, వివిధ సాహిత్య సభలలో పాల్గొంటూ, సాహిత్య పరులకు ఒక పెద్ద దిక్కుగా ఉంటూ ప్రయోజనకరంగా జీవితం గడిపారు.

సహస్ర మాసాలు జీవించి చివరికి తన 84 వ ఏట వృద్ధాప్యం వల్లనూ, మూత్రపిండ వ్యాధితోనూ స్వల్పంగా బాధపడి 1969 ఏప్రిల్ నెల 19వ తేదీన హైద్రరాబాదులో తమ కుమారుని ఇంట సీతాపతి పరమపదించారు.

ఆయన మరణ వార్త విని విశ్వనాథ సత్యనారాయణ "సీతాపతి పంతులు గారు బహు విషయ పాండిత్య శోభితులు. పాండిత్యం విషయంలో ఆయన వేలూరి శివరామశాస్త్రి అంత వారు!" అని ప్రస్తుతించారు. తెలుగు దినపత్రికలు ఆయనను స్మరిస్తూ సంపాదకీయాలు వ్రాశాయి.

సీతాపతి నెరిగి ఉన్న వారందరి హృదయాలలోనూ జరీ అంచు పంచెతో, నల్ల కోటుతో, బట్టతలతో, గుబురు మీసాల చాటునుంచి చిరు నవ్వులు చిందిస్తూ ఉండే నవ్వు ముఖంతో, చేతిలో ఎప్పుడూ కారా కిళ్ళీ తాంబూలపు పెట్టెతో కూడిన ఆయన రూపం నిత్యం మెదులుతూనే ఉంటుంది.

సీతాపతి వ్యక్తిత్వాన్ని ఒక చక్కని ఉత్పల మాలలో పదచిత్రంగా చిత్రిస్తూ లక్ష్మి, శారదలు రచించిన ఈ క్రింది పద్యం స్మరిస్తూ ఈ సీతాపతి జీవిత సంస్మరణ ప్రసంగాన్ని ముగిద్దాం:

"హాసము మోమునందు, పరిహాసము మాటల పోకడందు, ను
ల్లాసము మానసంబున, విలాసము పండిత గోష్ఠియందు, వి
శ్వాసము తల్లి దండ్రులెడ, భ్రాతలయం దనురాగ మన్న సం
తోసము మిత్రులందు, పరితోషము సత్సఖలందు ముచ్చటల్!"



అనుబంధం - 1

# గిడుగు వారి వంశ వృక్షం



అనుబంధం - 2

# సీతాపతి జీవితంలో ప్రధానమైన తేదీలు

| | |
|---|---|
| 1885 జనవరి 28 | జననం - ఉదయం గం. 11 లకు (భీముని పట్టణంలో) |
| 1890 | అక్షరాభ్యాసం (5 వ ఏట, 5 వ నెల, 5 వ రోజున) |
| 1891-1894 | ప్రాథమిక విద్య |
| 1894-1900 | ఉన్నత విద్య |
| 1898 | కన్యా శుల్కంలో వెంకటేశం పాత్ర ధారణ |
| 1901 | ప్రథమ వివాహం |
| 1901-1902 | ఎఫ్. ఏ. చదువు (పర్లాకిమిడిలో) |
| 1903-1905 | బి.ఏ. (హిస్టరీ) - మద్రాసులో |
| 1904 | ద్వితీయ వివాహం |
| 1906 | హైస్కూలు ఆక్టింగ్ టీచరు ఉద్యోగం (పర్లాకిమిడి) |
| 1906 | ప్రథమ పుత్రికా జననం |
| 1807 | ఎల్.టి. చదువు (రాజమండ్రిలో) |
| 1908-1910 | హైస్కూలులో హిస్టరీ టీచరు ఉద్యోగం (పర్లాకిమిడి) |
| 910-1911 | హైస్కూలు హెడ్‌మాస్టర్ పదవి (జయపురం) |
| 911-1931 | హిస్టరీ లెక్చరర్ పదవి (పర్లాకిమిడి) |
| 1926 | మద్రాసు యూనివర్సిటీ సెనేట్ సభ్యత్వం |
| 933 | లండన్ యాత్ర - పర్లాకిమిడి తాలూకా బోర్డు అధ్యక్షత- జిల్లా బోర్డు సభ్యత్వం |
| 936 | ఒరిస్సా రాష్ట్రం ఏర్పాటు, సరంగ్ గ్రామంలో బైబిల్ కు సవర భాషానువాదం |

| | |
|---|---|
| 1938 | మద్రాసు నివాసం, సినీమా రంగ ప్రవేశం |
| 1940 | డి. లిట్. పట్ట ప్రదానం - 'భారతి' సంపాదకత్వం |
| 1942 | పిఠాపురం రాజా వారితో మైత్రి ప్రారంభం |
| 1948-1957 | మద్రాసు తెలుగు భాషా సమితిలో విజ్ఞాన సర్వస్వ ప్రధాన సంగ్రాహకత్వం |
| 1954 | సాహిత్య అకాడమీ తెలుగు సలహా సంఘ సభ్యత్వం |
| 1954, 1956, 1961 | బాల సాహిత్య రచనాలయం (వర్క్‌షాప్) డైరెక్టరు పదవి |
| 1963 | అష్టసప్తతి (78) తమ జన్మదినోత్సవ సన్మానం |
| 1969 | అస్తమయం. |

అనుబంధం - 3

# సీతాపతి రచనలు

## తెలుగు :

| | | | |
|---|---|---|---|
| 1. | భారతీ శతకం | 1939 | నవ్య సాహిత్య పరిషత్తు, గుంటూరు. |
| 2. | తెలుగులో ఛందో రీతులు | 1961 | విశాలా పబ్లికేషన్స్, హైదరాబాద్. |
| 3. | కువలయావళి నాటిక (సంస్కృతానికి తెలుగు సేత). | 1946 | పిఠాపురం రాజా |
| 4. | కట్టబొమ్మ | | స్వతంత్ర నాటకం. |
| 5. | బాలానందం | 1951 | రాయలు పబ్లికేషన్స్, కర్నూలు. |
| 6. | స్వీయ చరిత్ర | 1962 | సన్మాన సంఘం, హైదరాబాద్. |
| 7. | షేక్స్పియర్ రచనలు- సవిమర్శక ప్రశంస. | 1972 | విశాలా పబ్లికేషన్స్, హైదరాబాద్. |
| 8. | నేటి రచనలలోని తప్పులు | 1967 | ఆం. ప్ర. ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ |

## ఇంగ్లీషు :

| | | | |
|---|---|---|---|
| 1. | **History of Telugu Literature,** | 1968 | **Sahitya Akademi, New Delhi.** |
| 2. | **Mahakavi Gurua jada Apparao** | 1941 | **Sagar Publications, Hyderabad,** |
| 3. | **Sora Songs** | 1978 | — |

## సంస్కృతం :

| | | | |
|---|---|---|---|
| 1. | కవితోదయ చంద్రికా | 1963 | విశాలా పబ్లికేషన్స్, హైదరాబాద్. |

* ఇంకా వివిధ పత్రికలలో ప్రకటించిన రచనలూ, తెలుగు విజ్ఞాన సర్వస్వానికి వ్రాసిన వ్యాసాలూ, వివిధ రచయితల గ్రంథాలకు వ్రాసిన పీఠికలూ మొ. వి ఎన్నెన్నో !

మ. భయమో, విస్మయమో, భవన్మధుర వాగ్వైచిత్ర్య సమ్మోహమో
జయమున్ బొందుదు నన్న గర్వితమనస్సంజాత సంతోషమో
పయి కొక్కింతయు నా కృతజ్ఞతను దెల్పన్ వాక్కు నాకట్టె; న
ట్లయినన్ డెందము నిండ భక్తి గలదమ్మా! నమ్ముమో భారతీ!

భారతీ శతకం - 3.

ఓమ్ తత్ సత్